## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# హనుమద్విలాసము

## ప్రథమ భాగము



ఇది

మంత్రశాస్త్రప్రవీణ - హనుమదుపాసక

శిష్ట్లా చంద్రమౌళిశాస్త్రిచే

కూర్చఁబడినది.

బ్రహ్మశ్రీ తంగిరాల వీరరాఘవయ్యగారి

ద్రవ్యసహాయముచే

విజయవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

 1949 [వెల రు. 2-0-0



గ్రంథకర్త:

మంత్రశాస్త్ర ప్రవీణ - హనుమదుపాసక

బ్రహ్మశ్రీ శిష్టా చంద్రమౌళిశాస్త్రి,

పెదపాడు, ఏలూరు తాలూకా.

# పాఠకులకు విజ్ఞప్తి

మహాశయులారా! సమస్తప్రాణిజాలమును ఇహము నందును పరమునందును సుఖమునే యభిలషించును. అట్టి సుఖము విహితకర్మానుష్ఠానముచేతను నిషిద్ధకర్మపరిత్యాగము చేతను సంభవించును. విహితకర్మానుష్ఠాన మనునది కాయిక వాచిక మానసిక దోష రాహిత్యముగ ననుష్ఠింపబడిననే సఫలమగును. సామాన్యముగ కాయిక మానసిక దోషము లనబడు, ఆధివ్యాధులచే పీడింపబడనివా రరుదు. అట్టి ఆధి వ్యాధులు విహితకర్మానుష్ఠానమునకు ప్రతిబంధకములు. గాన ఆధివ్యాధులుకలవారలు సత్కర్మానుష్ఠానాసమర్థులుగను దత్ఫల మగు ఐహికాముష్మిక సుఖములను పొందఁజాలరు. ఆధి వ్యాధులను తొలగించుకొనినచో సత్కర్మల నాచరించి తత్ఫల మగు సుఖమును బడయుగలరు. ఆధివ్యాధులన్ననో సామాన్య మైనవి కావు. ఆధియన, మనోవికారము. అయ్యది భూత ప్రేత పిశాచాదిదుష్టగ్రహావేశమువలన గాని, ఇష్టవస్తువుయొక్క అలాభమువలనగాని, భ్రాంత్యాదులవలనగాని సంభవించును. అట్టి చిత్తవికారముఁ ఉపాయాంతరములచేఁ బోగొట్టుకొనుట దుర్ఘటము. యోగాభ్యాసరూప మగు ఉపాయ మున్నను అయ్యది సంప్రదాయ పరిభ్రష్ట మగుటచే సులభముగ ననుష్ఠించుటకు శక్యమైనదికాదు. వ్యాధులన్ననో శరీరమునకు వికృతిని సంపాదించి తద్ద్వారా దుఃఖకరములుగాన; కాయికము లనబడును. అట్టివ్యాధులు కుష్ఠాపస్మారాదులని, తద్భేదములు చరకసంహితాదిగ్రంథములయందు విపులముగ వర్ణింపబడినవి. ఆ

వ్యాధులు సామాన్యముగ నూటికి తొంబదివంతులు అసాధ్యము లనియే చరకసంహితయందు వర్ణింపబడినవి. ఐనను తాత్కాలి కోపశాంతికొఱకు చికిత్సలును చెప్పబడినవి. అట్టి చికిత్సలు ఓషధీసంప్రదాయము ననుసరించియు, రసాదిసంప్రదాయము ననుసరించియు ద్వివిధములుగ నున్నవి. అందు ఓషధులు హిమవద్వింధ్యాది మహాపర్వతప్రాంతములయందు ఉత్పన్న మైనవియే వ్యాధినివారణములనియు, ఆయోషధులను సంప్రదాయానుసారముగ గుర్తించి కాలవిశేషమునందు సంగ్రహించవలసినదనియు వర్ణించబడినది. ప్రకృతమన్ననో మనకు అట్టి ఓషధులే దొరుకుట లేదు. 'కాకోళ్యాదిగణము, జీవంతికాదిగణము, సోమలత, జ్యోత్స్నలత, రుదంతీలత' మొదలగు ఓషధిరాజములు మహాపర్వతప్రాంతములయందును దృష్టిగోచరము లగుట లేదు. యథాసంభవమగు స్వల్పౌషధులైనను దేశ కాల నియమము లేక సంగ్రహించబడిన వగుటవలన నిస్సారముగనున్నవి. రససంప్రదాయమన్ననో; రస విష గంధకములు అష్టాదశసంస్కారములచే సంస్కరింపబడిననేగాని నిర్దుష్టమై ఫలజనకములు కానేరవు. అట్లుగాక పోవుటయేగాక అపరిశుద్ధత వలన నితర వికారములను గూడ కలిగించుచున్నవి. కనుక ఆధివ్యాధులకు చెప్పబడిన ఉపాయములచే ఆత్యంతిక నివృత్తి దుర్లభము. అట్టిఆధి వ్యాధులను సుకరముగ అత్యంతము నశింపజేయుటకు సాధనమును అన్వేషించుటకు యత్నము చేయవలసియున్నది. ఈ నాచే ఉపదేశించబడు సాధనము; ప్రతి గ్రామమునందును ప్రతిమతమునందును ఆబాలగోపాలమునకు విదితము. అట్టిసాధన మేమనగా: శ్రీసువర్చలాసమేత హనుమ

త్ప్రదక్షిణపూజానమస్కారములు మొదలగునవి. సామాన్యముగా ఆస్తిక దేశమగు మనభరతఖండమునందు ఆంజనేయాలయము రామాలయము లేని గ్రామమే లేదు. ప్రతిగ్రామమునందును చిన్నదియో పెద్దదియో ఆలయమును నిర్మించి, యందు శిలావిగ్రహమునుగాని పటమును గాని ప్రతిష్ఠించి భక్తిపూర్వకముగా ఆచండాలాంతము ఐకమత్యముతో ఆస్తిక బుద్ధితో శ్రేయస్సు నభిలషించి సేవించుచున్నారు. ఆంజనేయ విగ్రహముగాని పటము గాని ఆంజనేయస్మరణముగాని లేని ప్రతి గ్రామమునందును శ్రీరామాజ్ఞచే రాక్షసులు భూతప్రేత పిశాచాద్యావేశరూపముగా మానవులనుభక్షించుచుందురనియు, శ్రీఆంజనేయపూజాదులచేగాని స్మరణమాత్రముచేగాని భక్తితో ఆంజనేయు నుపాసించువారలకు అట్టిబాధలుతొలగిపోవుననియు అనేకప్రమాణములు కలవు. వానిలో కొన్నిటి నుదాహరించు చున్నాను ఖిలసంహితయందు ఈక్రిందివిధముగా చెప్పబడి యున్నది.

శ్లో॥ మమ పార్శ్వగతా వీరా రాక్షసాః పిశితాశనాః। యాచంతే జానకీనాథం నరభోజనమేవ చ॥ ఇతి శ్రుత్వా రామచంద్రః అబ్రవీ జ్జానకీపతిః। ఆంజనేయం వినా యత్ర తత్ర భక్షంతు మానవాన్.

తా॥ మాంసభక్షణయందు ఆసక్తిగల రాక్షసులు, తమకు నరభోజనము కావలెనని శ్రీ రామచంద్రుని కోరగా ఆసమయమునందు రామచంద్రమూర్తి ఆరాక్షసులనుజూచి ఆంజనేయ విగ్రహముగాని తత్స్మరణముగాని యేగ్రామము నందుగాని యేగృహమునందుగాని లేదో; అచ్చట మనుష్యులను

భక్షింపుడని అజ్ఞయిచ్చెను. ఇట్లు ఆజ్ఞనిచ్చి తత్క్షణమే హను
మంతునితో ఇట్లుపలికెను.

శ్లో॥ గచ్ఛ శీఘ్రం మహాభాగ! కురు రక్షోవిదారణం ।
రక్ష విశ్వం కపిశ్రేష్ఠ! రక్షోగణవిదారణ!

తా॥ ఓ ఆంజనేయా! నీవు శీఘ్రముగ గ్రామములయందు నివసించి రాక్షసులను వశింపజేయుము. నేను రాక్షసులకు పూర్వోక్త ప్రకారముగా వరమునిచ్చియుంటిని. నీవు లేనిచో రాక్షసులు మనుష్యులను బాధింతురు. గనుక విశ్వమును రక్షింపుము. అనిన—

శ్లో॥ ఇత్యేతద్వచనం శ్రుత్వా రామదూత స్సుబుద్ధిమాన్ । తదారభ్య దివారాత్రం రక్షణ సర్వం చ రాష్ట్రకమ్॥

తా॥ ఈప్రకారముగా పలికిన రామచంద్రునియొక్క వాక్యములను విని సర్వభూతదయాపరుడగు హనుమంతుడు అప్పటినుండియు దివారాత్రములయందు తనధ్యానాధికము చేయు భక్తులను సంరక్షించుచు సర్వరాష్ట్రములయందు నిండియుండెను. ఇట్లు అనేకములగు ప్రమాణములు తాళపత్రముల యందును; సుదర్శనసంహిత, శౌనకసంహిత, హనుమచ్చాంబర చింతామణి యను గ్రంథములయందు అనేకము లున్నను గ్రంథవిస్తరభీతిచే సంగ్రహముగ నుదాహరించితిని. సామాన్యముగ పూజావిధానమని సమష్టిరూపముగ చెప్పబడు పూజా విధానము సాంగోపాంగముగ కల్పోక్తప్రకారముగ నాచరింప బడినయెడల ఆధివ్యాధిరూపము లగు సమస్తదుఃఖములు నివర్తించును. చిత్తస్వాస్థ్యము కలుగును. స్వస్థచిత్తులై సత్కర్మానుష్ఠానముచే ఐహికాముష్మిక సుఖములను బడయగలరు.

ఇందుకు 'హనుమచ్చాంబరచింతామణి'యను తాళపత్రగ్రంథ మునందుగల ప్రమాణవచనముల నుదాహరించుచున్నాను.

శ్లో॥ ఆంజనేయమను ర్లోకే శంకరేణ ప్రకాశితః। భూత ప్రేత పిశాచాద్యా శ్శాకినీబ్రహ్మరాక్షసాః। దృష్ట్వైవ ప్రపలాయంతే మంత్రానుష్ఠానతత్పరమ్.

తా॥ ఆంజనేయ మంత్రము శంకరునిచే ప్రకాశింపజేయబడినది. అట్టిమంత్రము నుపాసించువానిని చూచుటతోడనే భూత ప్రేత పిశాచాదులు పారిపోవును.

శ్లో॥ భూతిం జలం మూలికాం చ హనుమన్మనునా ప్రియే। మంత్రయిత్వాతు దాతవ్యం రోగశాంత్యర్థమేవ చ.

తా॥ ఆంజనేయమంత్రముచే నభిమంత్రించబడిన విభూతి గాని ఉదకము గాని ఔషధము గాని సేవించినయెడల తత్క్షణమే సమస్తవ్యాధులు తొలగిపోవును.

శ్లో॥ వజ్రవల్లీం సమాదాయ విదద్యా ద్వైష్ణవీదినే। విసృజ్య గ్రంథిదేశం తు సూక్ష్మం చూర్ణం తు లేపయేత్॥ బిడాలపదమాత్రం తు మంత్రితం శతశః ప్రియే। శర్కరాఘృత సంయుక్తం భక్షయేచ్ఛ ద్విపంచకమ్॥ అశీతివాతా నశ్యంతి యే యే దారుణసంభవాః। మాసద్వయేన ముచ్యంతే నాఽత్ర కార్యా విచారణా.

తా॥ వజ్రవల్లిని (నల్లేరును) విష్ణుప్రియమగు ద్వాదశి యందు సంగ్రహించి కణుపులను విడచి మిగిలినభాగమును చూర్ణించి హనుమన్మంత్రముచే నూరుపర్యాయములు అభిమంత్రించి కొద్దిచూర్ణమును శరీరమునకు లేపనమునుజేసి మిగత

చూర్ణములో మూడువ్రేళ్ళకు వచ్చిన చూర్ణమును పంచి దార ఆవునేతులతో కలిపి పదిభాగములు చేసి ఒకరోజు సేవించు పద్ధతిని రెండుమాసములు సేవించినయెడల అతిదారుణములగు అశీతివాతములు నివారించును. ఈ ఔషధమును సేవించునప్పుడు ఆంజనేయుని సభక్తికముగ హృదయమునందు నిలిపి నిత్యము ఆంజనేయమంత్రముగాని, యేకవచము గాని మాలామంత్రము గాని మొదలైనవాటిలో దేనినైనను పఠనచేయుచుండినయెడల నిస్సంశయముగ ఫలము కలుగును. ఇట్టిచికిత్సలే ప్రతివ్యాధికిని హనుమన్మంత్రసంపుటిచే చెప్పబడి యున్నవి. ఇందు ఇట్టి పరమహంసక్రియలను వెల్లడిచేయుట అశాస్త్రీయము గనుక ఉదాహరణముగ కొన్నిటిని నిరూపించి యున్నాను.

ఆంజనేయమంత్రోపాసన యనునది ఉత్తమాధికారులకు; తన్మంత్రజపము, హోమము, తర్పణము, మార్జనము, ద్విజభోజనము అని కల్పములయందు చెప్పబడియున్నది. శౌనకసంహితయందు—శ్లో॥ జపోహోమ స్తర్పణం చ మార్జనం ద్విజభోజనం। పంచాంగోపాసనం ప్రోక్తం ప్రవదంతి మనీషిభిః. మధ్యమాధికారులకు విగ్రహపూజా ప్రదక్షిణ నమస్కారములు. అశక్తులగు మందాధికారులకు తద్దేవతాదర్శన తన్నామస్మరణములు. ఇట్లు నియమముగ సభక్తికముగ ఆంజనేయదేవు నుపాసించుటచే ఆధివ్యాధులు నశించుటయేగాక సమస్తాభీష్టకార్యసిద్ధులు కలుగును. ఇందుకు పరాశరసంహితయందు గల ప్రమాణవచనము వ్రాయుచుంటిని. శ్లో॥ యద్య దిష్టతమం లోకే తత్తత్సిద్ధి ర్న సంశయః॥ ఇట్టి భక్తకల్ప తరువగు ఆంజనేయదేవుని మంత్రానుష్ఠానము మొదలైన వానియందు

దైవ గురు భక్తి కలిగిన; బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులగు చాతుర్వర్ణ్య స్త్రీ పురుషులకు బాల వృద్ధులకు అజ్ఞవిజ్ఞులకు తత్తద్వర్ణ విహిత రీతిని అర్చనాదికమును గాని కాలశుద్ధిని గాని విచారింపకయే శ్రేయోభిలాషులగువారు తన్మంత్రానుష్ఠానమునుగాని తద్విగ్రహ పూజనమునుగాని ప్రదక్షిణములను గాని తద్ధ్యానమునుగాని చేయుటకు అర్హత కలిగియున్నారు. ఇందుకు ప్రమాణ వచనములు కలవు. గాలుడనుకిరాతుడు కుష్ఠవ్యాధిచే పీడింపబడి పుల్కలుడను మహర్షి నాశ్రయింపగా నా మహర్షి హనుమన్మంత్రమును కిరాతునకు ఉపదేశించువిషయములో సందేహము కలవాడై తదిష్టదైవమగుఆంజనేయమూర్తి వలన తనకుగల సందియముబాపుకొనదలచి హనుమంతుని ధ్యానించి ప్రత్యక్షము చేసికొని తనకు గలిగిన సందేహమును బాపుకొని ఆంజనేయాజ్ఞచే తన్మంత్రమును కిరాతునకుపదేశించి అతని కుష్ఠవ్యాధిని నశింపజేసెను. ఈ అర్థమును ప్రతిపాదించు హనుమదాజ్ఞా వాక్యములనుదహరించుచున్నాను ॥శ్లో॥ గాలోఽయం మృగయుర్నీచః కథం మంత్రోస్య తే ప్రభో। యోగ్యోఽయమితి సందేహో బాధతే మా మహర్నిశమ్॥ హనుమద్వాక్యము:-శ్లో॥ కపీంద్రస్తము వాచాఽథ మా కురుష్వాత్ర సంశయం। మన్మంత్రజాల విషయే మద్భక్తో మయ్యపి ద్విజ॥ ఉపదేశగురౌ చాపి భక్తిరేవాత్ర కారణమ్। శూద్రో వా విప్రకీర్ణో వా వైశ్యో వా క్షత్రియోఽపి వా। మన్మంత్రవిషయే సర్వే పాత్రాణ్యేవ న సంశయః॥

ఈప్రకారము పరాశర సంహితయందు చెప్పబడియున్నది. కనుక హనుమన్మంత్రము నుపాసించుటకు సర్వులు అర్హతకల

వారై యున్నారు. ఈ హనుమ దుపాసనచే అగస్త్యులు పరాశ రులు మైత్రేయులు భీముడు అర్జునుడు గాలుడు పుష్కలుడు ధ్వజదత్తుడు సోమదత్తుడు యవనాశ్వుడు విశ్వామిత్రుడు భర తుడు దేవేంద్రుడు 'హరిశర్మ యను విప్రపుంగవుడు' సీతాదేవి ద్రౌపది మొదలుగా గలవారు వారివారి అభీష్టములను పొందిన విషయములు ఈగ్రంథమునందు శ్లోకరూపమైన ఉదా హరణలతో పొందుపరుపబడినవి.

శ్రీరస్తు

" శ్రీ హనుమత్పూజయైవ సర్వదేవతా పూజాఫలంసిద్ధ్యతీతి"
తత్రప్రమాణవచనాని నిగద్యన్తే.

వితండవాదమునకు బేరుపెట్టిన యీకాలమున నాంజ నేయ పూజ యేలచేయవలయును? తక్కిన దేవత లనేకులు లేరా? వారిని బూజించినంజాలదా? యని యనేకులు తర్కింపవచ్చును. వారికి సమాధానముగా శ్రీహనుమంతులవారు సర్వదేవతాత్మ కులు కావునఁ దత్పూజనము వలన సర్వదేవతాపూజాఫలము సిద్ధించితీరునని చెప్పఁబడుచున్నది. అందుకై ప్రమాణవచనము లీ క్రింద నుద్ధరింప బడుచున్నవి.

పరాశర సంహితాయాం సప్తమపటలే—

శ్లో॥ ఆంజనేయః పూజితశ్చే త్పూజితాస్సర్వదేవతాః
హనుమన్మహిమాఽశక్యో బ్రహ్మణాపి నవర్ణితుం ॥

ఆంజనేయుని బూజించినయెడల సర్వదేవతలను బూజించి నట్లేయగును. హనుమంతుని మహిమను బ్రహ్మదేవుడు కూడ వర్ణింపఁజాలఁడు. బ్రహ్మదేవుడు చరాచరసృష్టికిఁ గర్తయైనను హనుమత్సృష్టి యాచరాచరసృష్టి కతీతమైనది కావున బ్రహ్మ

దేవుడు వర్ణింపలేడని పరాశర సంహిత చెప్పుచున్నది.
తత్రైవ నవమేపటలే ధ్వజదత్త చరిత్రే–

శ్లో॥ దైవతాని కతిసంతి నభూతలే నైవ తాని మనసోమతాని
మే । దీక్షితం జడదరిద్రరక్షణే దైవతం హనుమదాఖ్య
మేవతత్ ॥

లోకములో ననేకులు దేవతలు లేరా? ఉన్నారు. ఉన్నను వారియందు నామనస్సు ప్రసరించుట లేదు. జడులను, దరిద్రులను రక్షించిన హనుమంతుడే రక్షింపవలయును. కావున హనుమంతుని మించిన దైవము లేదు.

హనుమత్సూక్తాంతే–

శ్లో॥ ఆంజనేయో విరాడ్రూపీ విశ్వాత్మా పావకాత్మజః
గౌరీసుత ఈశపుత్రః సర్వాకామాన్ దదాతునః

ఆంజనేయులు విరాడ్రూపి. సర్వదేవతాత్మకుడు. విశ్వమంతయును నాతనిస్వరూపమే. ప్రపంచమంతయు నగ్నిషోమాత్మకము. అందు అగ్నికి హనుమంతుడు పుత్త్రుడు. సోమాత్మకులైన పార్వతీశివులకును బుత్త్రుడు. అందుచేత నాయన సర్వదేవతాస్వరూపుడనుట నిర్వివాదాంశము. అట్టి హనుమంతుడు మాకు సర్వమనోరథముల నొసంగుగాక!

పరాశరసంహితాయాం ధ్వజదత్తచరిత్రే :–

శ్లో॥ బ్రహ్మవిష్ణుశివమైథిలీశివాః కార్యసిద్ధిశిథిలోద్యమాముహాః
అంజనాసుతమనుప్రభావతో భుఞ్జతే సుఖమహర్నిశం ద్విజః॥

బ్రహ్మ విష్ణు రుద్రులును సీతాపార్వతులును కార్యసిద్ధిపరులు కారు. ఈ దేవతలు కేవలము పారలౌకికులు కావున వారు ప్రాపంచిక కార్యసిద్ధికిఁ దోడ్పడరు. హనుమంతుడట్లు కాడు.

ఆయన పరాపరప్రపంచ స్వరూపుడు కావుటచే సర్వకార్యసిద్ధి ప్రదు డనుట సత్యము. హనుమదుపాసకుడైన ద్విజుడు సర్వ సౌఖ్యముల ననుభవించును.

తత్రైవత్రయోదశపటలే. హనుమంతంప్రతిద్విజవచనం —

శ్లో॥ త్వామామనంతి శ్రుతయో జగతామాదికారణం
త్వామేవసృష్టికర్తారం పురుషంప్రకృతేఃపరం ॥

స్వామీ! శ్రుతులు నిన్నుఁ బరబ్రహ్మపదార్థమని చెప్పు చున్నవి. సమస్తజగత్తునకు ఆదికారణమైన పరంజ్యోతివి నీవే నని శ్రుతులు పల్కుచున్నవి. భూతసృష్టియొక్క చతుర్ముఖ బ్రహ్మవును నీవే. ప్రకృతికతీతుడైన పరబ్రహ్మవును నీవే.

అపిచ ఏకోనవింశపటలే —

శ్లో॥ సప్తకోటిమహామంత్రా వినాబ్రహ్మాస్త్రవిద్యయా
హనుమన్మంత్ర జాలానాం మిత్రాణీతివిదుర్బుధాః॥

బ్రహ్మాస్త్రవిద్య యొక్కటి తక్కఁ దక్కిన సప్తకోటి మహామంత్రములును హనుమద్విద్యకు లోఁగినవే. ఒక బ్రహ్మా స్త్రమునకు మాత్రము హనుమంతు డేడునిమిషములు లీలగా గట్టువడెను. ఆ బ్రహ్మయైనను హనుమదనుగ్రహము చేతనే యాయనను గట్టుటకు సమర్థుడయ్యెను. ఇందొక్క విశేషము. బ్రహ్మాస్త్రవిద్యను బహ్మదర్శించినను నది శ్రీ బగళావిద్యా తత్త్వములో త్రిపురసుందరీ దేవతాత్మకమైనది. హనుమంతుఁ డందు జగన్మాతయందలి గౌరవవిశేషముచే దానికి లొంగెనని విశేషజ్ఞులు గమనింపవలయును.

పరాశరసంహితాయాం_

శ్లో॥ కేవానపూజయన్తీహ ప్రత్యక్ష వరదాయకం
అర్చయన్తి హనూమంతం బ్రహ్మవిష్ణుశివాఅపి

శ్లో॥ హనుమత్సదృశం దైవం నాస్తినాస్త్యేవ భూతలే
తస్మిన్ సంపూజితే భాను ర్బ్రహ్మ గౌరీ మహేశ్వరః

శ్లో॥ శ్రీ జానకీపతి స్స్వామీ దాదినారాయణః ప్రభుః
ఈశశక్రాదిలోకేశాః కుమారో గణనాయకః

శ్లో॥ బ్రహ్మర్షయో వసిష్ఠాద్యా స్సనకాద్యాశ్చ యోగినః
పితరో వసవో రుద్రాః పూజితా స్స్యు ర్న సంశయః

శ్రీరామచంద్రుడే హనుమదుపాసకుడని సుందరోత్తర కాండవచనముల వలన స్పష్టమగుచున్నది. హనుమన్మంత్రమునకు శ్రీరామచంద్రుడే ఋషియయ్యెను. అనగా హనుమన్మంత్రమును దర్శించినది శ్రీరామచంద్రుడే యని తెలియవలయును. ఈవిషయము అగస్త్యసంహితయందును, శ్రీ రామోత్తరతాపిన్యుపనిషత్తునందును బ్రతిపాదింపబడినది. అయినను గోరిన గోరికలెల్ల బ్రత్యక్షముగా దీర్చు పరమదైవమైన హనుమంతు నెల్లరుపాసింతురు; బ్రహ్మవిష్ణురుద్రులుకూడ హనుమదుపాసన చేయుచుందురు. హనుమంతుని బోలిన దైవము భూతలమునందు లేనేలేదు. హనుమదుపాసన చేసినందువలన సూర్యుడు, బ్రహ్మ, గౌరీశంకరులు, స్వామీదాదినారాయణమూర్తియైన శ్రీరామచంద్రుడును ఇంద్రాద్యష్టదిక్పాలురును, స్కందగణాధిపతులును, బ్రహ్మర్షులైన వసిష్ఠాదులును, పరమయోగి

పుంగవులైన సనకాదులును, పితృ వసు రుద్ర గణంబులును బూజింప బడినవా రగుదురు. హనుమంతుడు సర్వదేవ తాత్మకు డని దీనివలన దెలియనగుచున్నది.

పునశ్చ తత్రైవ బ్రహ్మకృత ఆంజనేయస్తుతౌ—

శ్లో॥ పార్వతీ గర్భ సంభూతేః పార్వతీపుత్రనామవాౝ
అగ్నినా ధార్యమాణత్వా దగ్నిగర్భో భవాౝ భవేత్

శ్లో॥ వాయు ప్రసాదజననా ద్వాయుపుత్రోనిగద్యతే
అంజనాగర్భ జననా దాంజనేయ స్తతో భవాన్

శ్లో॥ కేసరిక్షేత్ర జన్యత్వా త్పుత్రః కేసరిణః కపే
హనూవజ్రప్రహారాద్ధి హనుమానితి నామతే

శ్లో॥ బ్రహ్మ విష్ణు శివాంశత్వా త్త్రిమూర్తి రితి విశ్రుతః

పార్వతీదేవి, అగ్ని, వాయువు, అంజనాకేసరులు, వీరు హనుమంతుని పరాపరమూర్తుల ధరించినవారు. ఇందుఁ బార్వతి శివునియర్ధాంగి. అగ్నివాయువు లిర్వురును శివుని యష్టమూర్తుల లోనివారే. ఇట్లు హనుమంతుని శివత్వము రూఢియగుచున్నది. అగ్ని ప్రపంచసృష్టికి హేతువగుటచే బ్రహ్మాంశకలవాడు, వాయువు సర్వవ్యాపియగుటచే విష్ణ్వంశకలవాఁడు. ఇట్లు బ్రహ్మ విష్ణ్వంశలుఁగూడ హనుమంతునియం దుండుట హనుమంతుడు త్రిమూర్త్యాత్మకుడని బ్రహ్మ స్తుతించెను.

ఉమా సంహితాయాం ఆంజనేయ స్తవే.

శ్లో॥ ఆంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకం
బాలార్క సదృశాభాసం రామదూతం నమామ్యహం

ఆంజనేయుడు గొప్పవీరుడు. ఇందు వీరు డనగా బ్రహ్మ వేత్తయని యర్థము. సృష్టి స్థితి లయకారణ తత్త్వములైన బ్రహ్మ విష్ణు శివాంశలు కలవాడగుటచే త్రిమూర్త్యాత్మకుడు. ఆయన పొడుచుచున్న పొద్దువంటి యెఱ్ఱని కాంతికలవాడు. ఇది శక్తి స్వరూపము. "ఆధారేతరుణార్క-కోటిసదృశం" అని దేవీస్తుతి యం దున్నది. ఆయన రామదూత. పరబ్రహ్మపదార్థమైన శ్రీరామ చంద్రుని స్వరూపకథనము చేయగలిగినవాడని యర్థము.

కావుననే యనేక గ్రంథములయందు మారుతి సర్వదేవ తాత్మకుడని ప్రశంసింపబడెను. ఆయనపూజవలన సర్వదేవతా పూజాఫలము లభించుననియుఁ జెప్పబడినది.

శౌనక సంహితాయాం-

శ్లో॥ యత్రాఽస్తి భోగో నహి తత్ర మోక్షః
యత్రాఽస్తి మోక్షో నహి తత్ర భోగః
శ్రీమారుతే స్సేవనతత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ.

పరాశర సంహితాయాం మైత్రేయంప్రతి పరాశరః-

శ్లో॥ అనయా సదృశీవిద్యా నాస్తినాస్త్యేవ తేశపే
త్రిస్సత్యం నప్రశంసాతు క్రియతే సత్యమేవతత్.

సుదర్శన సంహితాయాం-

శ్లో॥ యస్తు గేహే హనూమంతం భక్త్యా నిత్యం ప్రపూజయేత్
తద్గృహే తత్ప్రభావేన నిత్యం లక్ష్మీరచంచలా.

శ్లో॥ దీర్ఘమాయుర్లభేత్తైవ సర్వత్ర విజయీ భవేత్
మార్యాది భూత సంక్షోభ స్తద్దేశే నైవజాయతే

కొందరు దేవతలు భోగమును,గొందఱు దేవతలు మోక్షమునుమాత్రమిచ్చెదరు.హనుమన్మంత్రోపాసకులకుభోగ మోక్షములు రెండును గరతలామలకము లగుచుండును. అందుచేత నే హనుమన్మంత్రము వంటి మహావిద్య మఱియొకటి లేదనియు నిది మొగమోటమిచేతగాక సత్యమును బ్రతిజ్ఞచేసి చెప్పుచుంటి ననియు మైత్రేయునితోఁ బరాశరమహర్షి చెప్పెను. ఎవనియింటి యందు హనుమంతుడు పూజితుడగుచుండునో; వానియింటి యందు లక్ష్మి స్థిరనివాసముగా నుండును. వాడు సర్వ కార్యములందును సర్వతోముఖ విజయము గాంచుచుండును. అట్టివానికి మార్యాది భూతపుల వలన భయమెన్నఁడును గలుగ బోదని సుదర్శన సంహిత వాకుచ్చుచున్నది.

పరాశర సంహితాయాం.

శ్లో॥ సప్తర్షయో మునిశ్రేష్ఠాః కాదళే కపినాయకం
సంపూజ్య విధివత్పూర్వైః సంప్రాప్తాశ్శాశ్వతంపదం

శ్లో॥ మార్గశీర్షే మహామాసే మందవారే శుభావహే
రంభావనే మహారమ్యే బ్రాహ్మణాన్ భోజయేద్యది

శ్లో॥ తస్య ప్రసన్నో హనుమాన్ సర్వకామ ఫలప్రదః
దదాతి శాశ్వతీం భక్తిం పరత్రచ పరాంగతిం.

ఉమా సంహితాయాం—

శ్లో॥ అర్కమూలేన కుర్వీత హనుమత్ప్రతిమాం సుధీః
యః కరోతి నరో భక్త్యా పూజాం శక్త్యా హనూమతః

శ్లో॥ న శత్రుభయ మాప్నోతి భయం వాప్యంతరిక్షజం
పుత్రపౌత్రాది సహితః సర్వసౌఖ్య మవాప్నుయత్.

ఇకఁ బూజావిధానము చెప్పఁబడుచున్నది. సప్తర్షులు హనుమంతుని ప్రతిమను కదళీవనమందుఁ బ్రతిష్ఠించి పూవులతోఁ బూజ చేసి శాశ్వత పదవిని గాంచిరి. మార్గశిరమాసమున శనివారమునాడరటితోటయందు హనుమంతుని బూజించి తదంగముగ బ్రాహ్మణ సమారాధన జరిపినచో నట్టివారి యెడల శ్రీ హనుమంతుడు ప్రసన్నుడై శాశ్వతమైన భక్తి సంపత్తియుఁ, బరమగతియు నొసంగి రక్షించును. హనుమత్ప్రతిమను జిల్లేడువేరుతోఁ జేసి పూజించినచో; దాని వలన శస్త్ర భయములు పొందకుండుననియు నెట్టి యాపదలును లేక నరుడు పుత్రపౌత్రవంతుడై దివ్యములైన సర్వసౌఖ్యము లనుభవించు ననియు సుమా సంహిత యందుఁ జెప్పఁబడినది.

పరాశర సంహితాయాం మైత్రేయం ప్రతి పరాశరవచనం—

శ్లో|| ఏకోదేవ స్సర్వద శ్రీహనూమా
నేకోమంత్ర శ్శ్రీ హనూమత్ప్రకాశః
ఏకోమూర్తి శ్శ్రీ హనూమత్స్వరూపా
చైకం కర్మ శ్రీ హనుమ త్సపర్యా.

తా|| పరాశర మహర్షి యంతవాడు శ్రీ హనుమంతుని యెడల ననన్య భక్తి కలవాడై పరవశత్వమునొంది ఇట్లు చెప్పుచున్నాడు. ఒక్కడే దేవుడు. అతడు హనుమంతుడు. ఒక్కటే మంత్రము. అది హనుమ న్మంత్రము. ఒక్కటే మూర్తి. అది హనూమన్మూర్తి. ఒక్కటే కర్మ. అది హనుమత్సేవ.

పరాశర మహర్షి పరవశత్వము పట్టలేక ఇంకనునిట్లు వాక్రుచ్చెను.

శ్లో|| జలాధీనా కృషి స్సర్వా భక్త్యధీనంతు దైవతం
సర్వం హనుమతోఽధీన మితిమే నిశ్చితామతిః

శ్లో॥ మహాదేవాంశ సంభూతం వాయునా ప్రేరితం బలాత్
అంజనాగర్భ సంభూతం హనూమంత ముపాస్మహే.

శ్లో॥ హనూమా న్కల్ప వృక్షో మే హనూమాన్మమ కామధుక్
చింతామణిస్తు హనుమాన్ కోవిచారః? కుతో భయం?

తా॥ లోకములోఁ గృషియంతయు జలమున కధీనమై యుండును. నీరులేనిచోఁ బంటలు పండవు. దైవత మెప్పుడును భక్తి కధీనమై యుండును. భక్తి లేనిచో నే దేవతయు సాక్షాత్కరింపదు. కాని హనుమంతుని కీ సర్వము నధీనములై యుండును. అనగా సర్వకృషియు సర్వ దేవతలును హనుమదధీనములై యుండును. మహాదేవునియొద్దనుండి బయలుదేరి వాయుదేవునిచేతఁ గొని బడి యంజన గర్భమున సాక్షాత్కరించిన యాంజనేయస్వామిని నే నుపాసించెదను. ఇందు హనుమంతుని స్థూల సూక్ష్మ కారణ దేహములు వర్ణింపఁబడినవి. స్థూలమంజనాగర్భ సంజనితము. సూక్ష్మము వాయు ప్రేరితము. కారణము మహాదేవజనితము. హనుమంతుడు మా కల్పవృక్షము. మా కామధేనువు. మా చింతామణి. మాకు విచారము లేదు. మాకు భయమెక్కడిది? యని పరాశరుడు చెప్పెను.

శివరామాయణే:

"శ్లో॥ తదాంజనేయస్తు విజృంభయిత్వా ప్రతీకమాగాత్కిల విశ్వరూపః। బ్రహ్మాది దేవాశ్చ తదంగరోమ కూపేషు మధ్యే ఋషయశ్చ దృష్టాః। సహస్ర శీర్షాచ సహస్ర బాహు ర్నాక్రమ్య సర్వా విదిశోదిశశ్చ. ... ..."

తా॥ సహస్రకంఠరావణుని సంహరించుటకై శ్రీరామచంద్రుడు హనుమంతుని నియోగించెను. అప్పుడాయన తన

విశ్వరూపమును జూపెను. అట్లు పెరిగిన హనుమంతుని రోమ కూపములయందు బ్రహ్మాదిదేవతలును ఋషులును గన్పడిరి. ఆమహామూర్తికి సహస్రశీర్షములు, సహస్రబాహువులు నుండెను. ఆయన దిగ్దిదిక్కుల నన్నిటి నాక్రమించెను.

పరాశరసంహితాయాం శ్రీరామం ప్రతి హనుమద్వచనం.

శ్లో॥ ప్రసార్య లాంగూల మహం తిష్ఠామి వరుణాలయే
సప్తసాగరపర్యంతం వర్ధయిత్వాతు సేతువత్

శ్లో॥ లాంగూలం సమధిష్ఠాయ జహి తంపురుషోత్తమ!
ఇత్యుక్త్వా దీర్ఘలాంగూలం ప్రసార్య పవనాత్మజః

శ్లో॥ మార్గం సప్తసముద్రాంతం కృత్వావై పర్యవస్థితః
లాంగూల రోమజా తేషు నక్షత్రాణి తథాగ్రహాః

శ్లో॥ దృశ్యన్తే దర్భపుంజేషు యథైవ హిమబిందవః.

తా॥ సహస్రకంఠరావణ సంహారమునందు శ్రీ యా నేయుడు శ్రీరామునితో నిట్లు చెప్పెను. "రామచంద్రా! నాతోకను సప్తసముద్రాంతము పెంచెదను. నీవు నాతో మీదుగా సప్తసముద్రములను దాటి వెళ్లి సహస్రకంఠుని వధింపుము" అని. అప్పుడు శ్రీయాంజనేయుడు తన తోకను పెంగా నది సముద్రసప్తకము దాటిపోయెను. దానియందు నక్షత్రములు గ్రహములు "దర్భకొసలపై మంచునీటి బిందువు లున్నట్లు" ప్రకాశించెను.

పరాశరసంహితాయాం పంచముఖపటలే—

శ్లో॥ చతుర్ముఖః పంచముఖశ్చ షణ్ముఖ
స్సహస్రశీర్షాప్యయ మైకవక్త్రః

త్రిమూర్తి తేజోమయ మాంజనేయం
జ్ఞాతుం సమర్థశ్చ నహి త్రిలోక్యాం॥

తా॥ నాలుగు ముఖములు గలిగిన బ
నై దుముఖములు గలిగిన శివుడును, నాఱుముఖమ
కుమారస్వామియు, వేయి తలలు గలిగిన యాదిశేష
ముఖములు గలిగిన యగ్నియును ఏకముఖుడైన (
యణుడును త్రిమూర్త్యాత్మకుడైన యాంజనేయ
త్మ్యము నెఱుంగ సమర్థులు కారు.

శ్రీ త్రైవపంచవింశతిపటలే పంచముఖాంజనేయ ధ్యా

శ్లో॥ శ్రీకరాకారదృష్ట్యా కృత్తి మోహితాఖిలము
స్త్రీపుంమయాయ మహతే పరేశాయ నమ

తా॥ శోభాయుక్తమైన రూపనేత్రా కారమ
మూర్తులను మోహింపజేయువాడును, స్త్రీపుం
డును, గొప్పవాడును, పరబ్రహ్మ స్వరూపుడైన
నేయులవారికి నమస్కారము. స్త్రీపుంరూపద్వయమ
చుచున్న వాడనుటచే నర్ధనారీశ్వర రూపుడని
చున్నది. బాలార్కద్యుతి యనుటవలన వర్ణసామ్య
త్వము, స్త్రీపుంమూర్తిమయుడనుటచేత శక్తిమత
వగుచున్నది.

సుందరకాండే త్రింశేసర్గే—

శ్లో॥ తతో వర్ధితు మారేభే సీతాప్రత్యయకారణ
మేరుమందర సంకాశో బభౌ దీప్తానలప్రభ

శ్లో॥ అగ్రతో వ్యవతస్థేచ సీతాయా వానరోత్త

హరిః పర్వతసంకాశస్తామ్రవక్త్రో మహాబలః

శ్లో॥ వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీ మిద మబ్రవీత్
సపర్వతవనోద్దేశాం సాట్టప్రాకారతోరణాం

శ్లో॥ లంకామిమాం సనాథాం వా నయితుం శక్తిరస్తి మే
తం దృష్ట్వా భీమసంకాశ మువాచ జనకాత్మజా

శ్లో॥ తవ సత్వం బలం చైవ విజానామి మహాకపే॥

సుందరకాండే ౭౦ సర్గే

శ్లో॥ హనూమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః
న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్॥

శ్లో॥ తా॥ హనుమంతుని సామాన్యరూపమును జూచిన సీత మొదట నతని విశ్వసింపలేకపోయెను. హనుమంతుడు సహజముగ నవహిత్థకలవాడగుటచేఁ దన స్వస్వరూపమును మొదటఁ జూపించినవాడు కాడు. తరువాత దేవికి విశ్వాసము కలిగించుటకై స్వస్వరూపమును జూపక తప్పదయ్యెను. ఆయన స్వరూపము మేరుమందరప్రతిమానమై యుండెను. 'ఎందుకు భయపడెదవమ్మా ? ఈ మేడలు తోరణములతో సహా యీ లంకాపట్టణమును గట్టగట్టి తీసికొనిపోగలుగుదు' నని యాయన చెప్పెను. నిజమే. నీసత్వమును నీబలమును నేనెఱుగుదు' నని సీత యనెను. తరువాత రాక్షసులకు యుద్ధాహ్వానము నంపుచు హనుమంతుడు 'ఓరీ నేనాంజనేయుడను' వేయిమంది రావణులైనను నాకుఁ జాల' రని గర్జించెను. హనుమంతుడు యథార్థవాది కాడు. యుద్ధములో రావణాసురు నొక్కగుద్దు గుద్ది గద్దెపై నిల్లు శక్కిరించెను. ఆయన శ్రీరామచంద్రుని యశోఽర్థియై స్వకీయ బలప్రకటనము చేయలేదు.

శ్రీహనుమంతుని మాహాత్మ్యమిట్టిదై యుండ నీతనను వైకుంఠునిసాధారణలీలావిభూత్యంతర్గతునిగాను, గరుడుని నిత్య విభూత్యంతర్గత భాగవత గణమునం దొక్కనిగను పరిగణించి హనుమద్దేవునకుఁ గొంచెము న్యూనత నాపాదించుచున్నారు. అది యవిచారిత రమణీయము. బృహద్బ్రహ్మ సంహితయందు అర్థపంచకవివరణములో నిత్యవిభూత్యాత్మక పరమపదమునందు శ్రీరామపదవాచ్యుడైన వాసుదేవుని సన్నిధిలో హనుమంతుడు నిత్యస్థితుడై యుండునని వర్ణింపబడినది. అదియునుగాక భృగు ప్రోక్తమైన వైఖానసదైవిక యజ్ఞాధికారమునందలి యుత్సవ పటలమున

శ్లో॥ అథ విష్ణోర్వాహనాని వ్యాఖ్యాస్యామః. ప్రథమేఽహని హంసః, ద్వితీయేసింహః తృతీయే హ్యాంజనేయః, చతుర్థే ఫణీంద్రః, పంచమే వైనతేయః, షష్ఠేదంతావళః, సప్తమేరథః, అష్టమేతురంగమః, నవమే శిబికా, దశమే పుష్పకమ్ ఇతి.

అత్రిప్రోక్తకారికాగ్రంథమందును వైశంపాయనోక్త కారికాగ్రంథమందును వాహనములక్రమ మిట్లున్నది. ఈ వాహనముల విషయములో నొక సూక్ష్మమున్నది. హంస సింహాంజనేయ ఫణీంద్ర వైనతేయులవఱకు దివ్యవాహనములు. దంతావళాదు లదివ్యములు. ఇం దాంజనేయునిది మూడవ స్థానము. పంచవ్యూహాత్మకుడైన శ్రీమహావిష్ణువునకు క్రమముగా దివ్యవాహనములైదును జెప్పబడినవి. దీనివలన వైనతేయునికంటె హనుమదాధిక్యమును గమనింపనగును. కేవలవైష్ణవులు శిరియ త్తిరువడి(హనుమంతుని)కంటె పెరియ త్తిరు

పడి (వైనతేయుడు) గొప్పవాడని యెంచుచుందురు. అది న్యాయముకాదు.

ఇంతకును ముఖ్యమైన విషయ మొక్కటి చెప్పవలసి యున్నది.

అథర్వవేదీయ రామరహస్యోపనిషది మహర్షీన్ ప్రతి శ్రీహనుమదుక్తిః.

శ్లో॥ ఐహికే సమనుప్రాప్తే మాం స్మరే ద్రామసేవకం
వాంఛితార్థం ప్రదాస్యామి భక్తానాం రాఘవస్యతు

శ్లో॥ ఐహికేషు చకార్యేషు మహాపత్సు చ సర్వదా
నైవయోజ్యో రామమంత్రః కేవలం మోక్షసాధకః.

తా॥ ఐహికవాంఛాఫలసిద్ధినిగోరువారు రామసేవకుడనైన నన్ను సేవించినచో రాఘవభక్తులైనవారి కోరికలను నేను దీర్చెదను. కేవల మోక్షసాధకమైన రామమంత్ర మైహిక కార్యములందు సాధకముకాకపోవుటచే నైహికములందును ఆపదలయందును నన్నే పూజింపవలసినదని యాంజనేయుల వారు స్వయముగాఁ జెప్పినట్లున్నది.

ఇదియునుగాక కొందఱు హనుమంతుడు శ్రీదశరథపుత్త్రుఁడైన రామచంద్రుని సేవకుడుమాత్రమే యని తలచుచున్నారు. అది సంగతముకాదు. రామరహస్యోపనిషత్తు నందలి యీవిషయము గమనింపదగియున్నది. సనకాది మహామును లందఱును బరతత్త్వ మెఱిగింపుమని హనుమంతుని బృచ్ఛసేయఁగా నాతఁడ యిట్లు చెప్పుచున్నాడు.

శ్లో॥ భోయోగీంద్రాశ్చ ఋషయో విష్ణుభక్తా స్తథైవ చ
శృణుధ్వం మామకం వాచం భవబంధవినాశినీం

శ్లో॥ ఏతేషు చైవ సర్వేషు తత్త్వం చ బ్రహ్మతారకం
రామఏవ పరబ్రహ్మ రామఏవపరంతపః

శ్లో॥ రామఏవపరంతత్త్వం శ్రీరామో బ్రహ్మతారకం
రామం త్రినేత్రం సోమార్ధధారిణం శూలినం పరం

శ్లో॥ భస్మోద్ధూళితసర్వాంగం కపర్దిన ముపాస్మహే.

శ్రీ ఆంజనేయు డిందు రామపరతత్త్వమును బ్రతిపాదించుచు నా మూర్తి ముక్కంటి యనియు నెలదాల్పనియు శూలమును ధరించుననియు నొంటినిండ బూదిపూత కలవాడనియు జటాజూటమును ధరించిన వాడనియు నిదియే సర్వ తత్త్వములకు నతిశాయియైనదనియు వక్కాణించెను. ఇది శివరామతత్త్వము. ఇందు శివకేశవులకు రూపసామరస్య మేర్పడి పరతత్త్వముగాఁ బరిణమించినది. ఇది హనుమంతుని కుపాస్యమై యున్నదని గమనింపదగును.

రామరహస్యోపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది

శ్లో॥ "ఆద్యో రా తత్పదార్థః స్యాన్మకార స్త్వం పదార్థవాన్
తయోస్సంయోజన మసీ త్యర్థే తత్త్వవిదోవిదుః"

రామశబ్దమునందలి రకారము తత్త్వమసి యను మహా వాక్యము నందలి తత్ అను పదముయొక్క యర్థమును నిర్దేశించును. మకారమందలి త్వం పదమును జెప్పును. రకార మకారముల సంయోజనమును అసి యను పదము తెలియ జేయును.

తారసారోపనిషత్తులో ఓమ్కారతత్త్వనిర్వచనమిట్లు చేయబడినది.

శ్లో॥ అకారా దభవ ద్బ్రహ్మా జాంబవానితి సంజ్ఞకః
ఉకారాక్షరసంభూత ఉపేంద్రో హరినాయకః
మకారాక్షరసంభూత శ్శివస్తుహనుమాన్ స్మృతః.
ఇతి రామతారోపనిషత్తునందును:—
శ్లో॥ అష్టమూర్తే శ్శివస్యాసీద్వాయురూపాత్మనో బలీ
హనూమాన్ కేసరిక్షేత్రే మకారార్థస్స ఉచ్యతే.

అని యున్నది. దీనినిబట్టి ఓమ్‌కారమునందలి మకారము
డని తజ్జన్యుడైన హనుమంతుడు మకార శబ్దవాచ్యుడని
మగుచున్నది. కావున ఆస్తికులగు భక్తులెల్లరును సర్వా
త్మస్వరూపుడైన శ్రీహనుమద్దేవతోపాసనవారివారి శక్త్యా
రముగా జేసి తరింతురుగాక యని ప్రార్థన:

ఇంతయును నీగ్రంథమందలి విషయమంతయును మా
లకల్పితము కాదు. ఇది పరాశరాగస్త్యాది సంహితలనేకముల
యందందలి విషయముల నేర్చి కూర్చి, మా పూర్వుల
ష్ఠానక్రమము ననుసరించి సంప్రదాయానుసారముగా
నము చేసినది. ఇందలి ప్రమాణాప్రమాణములు మహర్షి
క్తము లేకాని మాయవికావు. అనూచానముగా మా వంశ
న వచ్చుచున్న సంప్రదాయమిది. నాశక్తినిబట్టి శ్రీ
మద్దేవతాంకితముగా నేతత్ఫలమెల్ల తద్దేవతార్పణబుద్ధితో
ంకర్తా' యను భావములో నేనీగ్రంథమును సంగ్రహించి
కావున పెద్దలు పండితులు పామరులైన భక్తమహాశయు
నిరహంకారముగా నేనుచేసిన సేవయందలి వైలక్షణ్యా
గుర్తించి నన్నాశీర్వదింతురని ప్రార్థించుచున్నాను. ఇది
ముప్పదియేండ్లనుండి జరిపినకృషి. ఇంకను ననేకమహద్విష

యములు నాకు లభించనివి గ్రంథాంతరములయం దుండి యుండవచ్చును. లభించినవానికి సరియైన వ్యాఖ్యానము నాకు దోచియుండకపోవచ్చును. "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిః" అను న్యాయము చొప్పున బండితులు వారివారి మేధాసంపత్తికి తోచినగూఢార్థవిశేషములు నాకు దెలిపినచో వానిని కృతజ్ఞతతో స్వీకరించి యీమాఱు ముద్రణమున జేర్పించ గలుగుదును. రామశబ్దమునందలి మకారము త్వం పదవాచ్యము. ఓమ్ కారము నందలి మకారము శివ హనుమంతులను జెప్పునది. కావున హనుమంతుడు త్వంపదవాచ్యుడని తేలుచున్నది. త్వంపదము చిదచిద్విశిష్ట బ్రహ్మపదవాచ్యము కావున హనుమంతుడును పరావరమూర్త్యాత్మకుడైన పరమేశ్వరుడని సిద్ధాంతమగు చున్నది.

## సువర్చలాపతిత్వము

లోకమునం దనేకులు హనుమంతుడు బ్రహ్మచారియని యుపాసించుచున్నారు. కాని యాదేవుని గృహస్థుడని విశ్వసించి యుపాసించువారును ననేకులున్నారు. దానికి దగిన ప్రమాణ వచనము లిందుద్ధరింప బడుచున్నవి.

హనుమద్విలాసే-

శ్లో॥ జాయాచాపి సువర్చలా రవిసుతా దివ్యంచ హేమాంబరం
మాణిక్యాంచిత కుండలే శ్రవణయోః కంఠేచ ముక్తావళిః
సుగ్రీవాంగద గంధమాదన ముఖా స్సత్పార్షదా స్సన్నితే
కిందాస్యామి మనఃప్రియాణి హనుమన్ సంపూర్ణకామో
భవాన్

సూర్యుని కుమార్తెయైన సువర్చల హనుమంతుని యర్ధాంగి. చెవులకు మాణిక్యములు పొదిగినకుండలములు, కంఠమునందు ముత్యాలహారము, సుగ్రీవాంగదాదులు ప్రక్కల నిలుబడి సేవచేయుచుందురు. ఇట్టి పూర్ణకామునకు నీకునీమనః ప్రీతి కై యేమియీయగలమని శ్లోకార్థము.

తత్రైవ హనుమత్షోడశాక్షరీమంత్రధ్యానే–

శ్లో॥ ఏకేనాఽభయదం పరేణ వరదం భోజ్యం పరంచాపరే
చాన్యేనాపి సువర్చలాకుచయుగం హస్తేన సంబిభ్రితం
కారుణ్యాఽమృతపూర్ణలోచనయుగంపీతాంబరాలంకృతం
సౌమ్యం వాయుసుతం చతుర్భుజయుతం ధ్యాయే హనూమత్ప్రభుం.

చతుర్భుజుడై సువర్చలాకుచాలింగనము చేయుచున్న మూర్తి యీశ్లోకమునందు వర్ణింపఁబడినది.

హనుమద్విలాసే దశమపటలే ధ్వజదత్తచరిత్రే

శ్లో॥ ధ్యాతశ్చహనుమాం స్తేన భక్త్యాభ్యాశ ముపాగమత్
సువర్ణకుండల జ్యోతి ర్దీప్త గండస్థల ద్వయః

శ్లో॥ హేమోపవీత సంవీతో దివ్యపీతాంబరావృతః
సువర్చలాం దధానశ్చ వామభాగే నిజప్రియాం

శ్లో॥ ధ్యాయంతీం హృది భర్తారం పార్వతీమివ శంకరం
మందస్మితాం సువర్ణాభాం సూర్యపుత్రీం సువర్చలాం

శ్లో॥ కౌశేయ పరిధానంచ దధానాంచ కుశేశయం
ఏవం సర్వగుణోపేతాం ప్రేయసీం మారుతాత్మజః

శ్లో॥ వామభాగే వహన్ భార్యాం క్షణాత్ప్రాదుర భూన్మనే

శ్లో॥ కరభ కలభ వాహః స్వర్ణ రంభావనాంతే
ప్రచలదచల శృంగో వ్యక్త చంచత్కరాగ్రాత్
అధికకుతల మాగా త్పుష్కరాధిష్ఠితః శ్రీ
రవిదుహిత్రు సమేతోలంబహారో హనుమాన్.

బంగారు కుండలములకాంతిచే మెఱయుచున్న చెక్కిళ్ళతో, బంగారు జందెముతో పీతాంబరముగట్టి బంగారువలె మెఱయుచున్నదియు, చిరునవ్వు వెదచల్లుచున్నదియు, శంకరుని పార్వతి వలెః దనభర్తయైన హనుమంతుని మనస్సులో స్మరించుచున్నదియు, పట్టుచీరగట్టి చేతిలో బద్మమును ధరించినదియు, సూర్యపుత్రియునైన సువర్చలాదేవిని వామభాగమున ధరించి హనుమద్దేవుడు ప్రత్యక్షమయ్యెను. రవిదుహిత్రు సమేతుడని క్రింది శ్లోకమునందుగూడ నున్నది. దీనివలన హనుమంతుడు గృహస్థుడనియే బహుగ్రంథ సమ్మతమై యున్నది.

అదియునుగాక మంత్రకాండయందు గూడ హనుమ ద్ద్వాదశాక్షర మంత్రము సువర్చలా సమేతమై యున్నది.

పరాశరసంహితాయాం ఏకాదశతమపటలే.

శ్లో॥ తతో విమలదేహస్య గాలస్య విమలాత్మనః
సువర్చలాసమేత శ్రీహనుమద్ద్వాదశాక్షరం

శ్లో॥ మంత్రరాజ మితిఖ్యాతం దిష్టవాన్ కరుణానిధిః

పుష్కరుడుగాలునకీ ద్వాదశాక్షర మంత్రము నుపదేశించెను. పుష్కర చ్ఛాత్రుడైన యిట్టిగాలుని దర్శించుటకు సువర్చలాపతియైన శ్రీహనుమద్దేవుడు కోరెనని ద్వాదశపటల మందున్నది. త్రయోదశ పటలమున—

శ్లో॥ ఇత్యేవం ధ్వజదత్తేన ప్రార్థితో భక్తవత్సలః
సువర్చలాముఖం ప్రేక్ష్య జహాస పవనాత్మజః

శ్లో॥ సువర్చలే! పశ్య నితాంతవల్లభే!
గురుప్రసాదా న్మతిమాంశ్చ తాపసః
మద్భక్తభక్తిం నిరపాయనిర్మలం
పృథగ్జనై ర్దుర్లభనామధేయః.

శ్లో॥ అహన్తు సర్వలోకస్య పూజ్యో భాస్కరనందిని!
మద్భక్తభక్తో మత్తోప్యజానయం పూజ్యతరః ప్రియే!

శ్లో॥ మమ సందర్శనా దేవ సిద్ధిం కైవల్య ముత్తమం
మహాఫలాభిలాషోఽస్య పురుక్తి స్సువర్చలే!

శ్లో॥ సమర్పయ శ్రియం సాక్షా దంశభూతాం తవ ప్రియే!
ఏవం సంబోధితా భర్త్రానుజ్ఞాం ప్రతిగృహ్యాచ.

శ్లో॥ నిజాంశం ప్రేషయామాస ధ్వజదత్తగృహం ప్రతి—

ఈ ప్రమాణవాక్యములందలి విశేషము నరయుడు. ఇందు సువర్చలాపతియని నిర్ధరింప బడుటయేగాక హనుమంతుడు సాక్షాన్నారాయణుడని సువర్చలాదేవి సాక్షాల్లక్ష్మియని నిర్వివాదముగా తేలచున్నది. హనుమద్దేవుని వాక్యమేమన — నా సందర్శనమువలననే ఇతనికి కైవల్యము కలుగును. నాభక్తులకు భక్తుడైనవాడు మిక్కిలి పూజ్యుడు. నీయంశమైన లక్ష్మి నీతని కొసగుము. అని సువర్చలాదేవి రవిసుత లక్ష్మిదేవి సూర్యచంద్రాగ్నిగతయై యుండునని శ్రీసూక్తము చెప్పుచున్నది. 'చంద్రాభాం లక్ష్మీమీశానాం సూర్యాభాం శ్రియ మీశ్వరీం' 'చంద్రసూర్యాగ్నిసర్వాభా' మహాలక్ష్మిమ పాస్మహే.

అని సూర్యగతమైన లక్ష్మియొక్క స్వరూపుడైన హనుమంతు
వరించినదని విజ్ఞులెఱుంగగలరు.

ప రా శ ర సం హి తా యాం

వింశతితమపటలే-

శ్లో॥ జపతోహనుమన్మంత్రం కపిలస్యమహాత్మనః
ఆవిర్బభూవ హనుమా నేకదా భక్తవత్సలః.

శ్లో॥ సువర్చలాపతి శ్రీమాన్ ధ్యాయమానోరఘూద్వహం
తత్రైవత్రయోవింశతి తమపటలే -

శ్లో॥ వామే దేవీంమిహిరతనయాంబిభ్రతం వానరేంద్రం.

ఆంజనేయ పూజావిధానేఽపి-

శ్లో॥ అథధ్యాయే త్కపిశ్రేష్ఠం చతురావరణావృతం
వామభాగస్థితాం పత్నీం సూర్యపుత్రీం సువర్చలాం

శ్లో॥ పశ్యంతీం స్నిగ్ధయా దృష్ట్యాస్మిత వక్త్రముఖాంబుజాం
ఆవాహయామిసర్వేశం సూర్యపుత్రీప్రియంవిభుం

శ్లో॥ అంజనాతనయం దేవంమాయాతీతం జగద్గురుం

ఇట్లనేక ప్రమాణవచనముల యందు సువర్చలాపతి
వామభాగమునందు సూర్యపుత్రికను ధరించి యున్నవాడు
సూర్యపుత్రీప్రియుడని మాయాతీతుడని జగద్గురుడని యభి
ర్ణింపబడియున్న హనుమద్దేవుడు గృహస్థుడని సర్వగృహస్థులచే
బూజింపదగియున్నవాడని సిద్ధాంతము చేయబడియున్నది. ఈ
విషయములో నాచేరచియింపఁబడిన శ్రీహనుమద్విజయం
ప్రదక్షిణకల్పమునందు సువర్చలాహనుమద్వివాహవిషయము,
వివాహమాసతిథ్యాదులు, ఆంజనేయ నవావతార నిరూపణము
కల్యాణప్రవర మున్నగునవి సవిస్తరముగ వ్రాయబడినవి.

బ్రహ్మశ్రీ తంగిరాల వీరరాఘవయ్య గారికి

# శ్రీ హనుమత్ప్రసాదాశీర్వచనము.

శ్లో॥ శ్రీ వీరరాఘవ మహామహా మాదిలక్ష్మీ
కామేశ్వరీం గుణవతీం హితభర్తృభర్త్ర్యా.
శ్రీవత్సగోత్రకలితౌ హనుమాన్ మహేశః
పాయాత్ సుధార్మికపరంపరవంశజాతౌ.

సీ॥ బంగారుగనియని ♦ తంగిరాలకులంబు
తామరతంపరై ♦ తనరుచుండు
అనుమన్మడని వేంక♦టేశ్వరసోమయా
జియు; నమ్మ సోమిదే♦వియును వెలయు
తగుమన్మడంచు సుం♦దరరామసోమయా
జులు రామలక్ష్మియుఁ ♦ గులుకుచుండు
ప్రథితపుత్త్రుఁడని శ్రీ♦రామావధానులు
రామసీతయుఁ బ్రేమ ♦ నోముచుండ్రు.

గీ॥ అనుపూర్వికధార్మిక ♦ యజ్ఞయాగ
ములును బెంపొందుచుండ స♦మ్మదమునొందు
మీదువంశమ్ము సతతమ్ము ♦ మేల్మికల్మి
వీరరాఘవ! ద్విజరాజ! ♦ విశ్వదాత!

ఉ॥ పావనమూర్తివై కరము ♦ భాగ్యము భోగ్యము కల్గియుండుస
ద్భావముతోడ మిత్త్రులకు♦ బంధువర్గజనరాజికెంతయున్
నీవయు యండదండయును ♦ నిత్యముకంటికిఱెప్పవోలె సం
భావనచేసి ప్రోతువు స్వ♦భావ ముదారము వీరరాఘవా!

సీ॥ అవనిగడ్డపురంబు♦నందు సమ్మతముగనై
ఘన వేదపాఠశా♦లను భరించి
నూత్న పద్ధతిని వి♦నోదవిశ్రాంతి స్థ
ల మనుపార్కును గర♦మమరఁజేసి
విజయవాడ బిసెంటు ♦ వీధిలోఁ గళ్యాణ
మందిరమ్మును దాన♦మహిమ నిలిపి
అడిగినవారల ♦ కపుడె లేదన కీప్సి
తంబులు సూక్తులు ♦ దనరఁగూర్చి

గీ॥ అనిశము హనుమత్సప్తాహ ♦ మనుకరించి
యలరు హనుమద్విలాసంబు♦నందుఁ బ్రథమ
భాగమును వెల్వరించిన ♦ ప్రభుఁడవీవు
ప్రజ్ఞమూర్తివి శ్రీ వీర♦రాఘవార్య !

చ॥ నినుఁగొనియాడుచుందురు మ♦నీషులు దీనులు సర్వయాచకుల్
ఘనుఁడవు దాతవీవనుచుఁ ♦ గల్గినవన్నియు సంపదల్ సిరుల్
తనుజునొసంగి ప్రోచుటకు♦ ధ్రువముఖుఁగ హనుమత్ప్రసాద మే
మనినది వేద మూనినది ♦ యంతయు సిద్ధము వీరరాఘవా!

# విషయసూచిక

పుటసంఖ్య

పుటసంఖ్య

పుట సంఖ్య

స మా ప్త ము

—: ఓమ్ :—

శ్రీర్భూయాత్.

శ్రీ సువర్చలాసహితాంజనేయాయ నమః



# హనుమద్విలాసము

## గణేశ ప్రార్థనము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

## ఇష్టదేవతా ప్రార్థన

శ్లో॥ శ్రీరామ పాదార్పితచిత్తవృత్తిః
సమస్తభక్తాను హితప్రవృత్తిః
అశేషదీనార్తి హరన్నివృత్తిః
ప్రాయా ద్ధనూమాన్ సకలాప్తవృత్తిః.

శ్లో॥ సీతారాఘవ దత్తమౌక్తిక లస
ద్ధారావళీశోభితం
హస్తాంభోజనరాభయాంకిత మనే
కాకల్పరత్నోజ్జ్వలం
వాలావేష్టిత మౌళి మీశ్వరతనుం
భక్తానుకల్పద్రుమం
రాజన్మౌంజ్యజినోపవీత మనిశం
శ్రీ ఆంజనేయం భజే.

## గురుధ్యానము

శ్లో॥ విజ్ఞాతసర్వాగమ తత్త్వమూర్తిం
నివారితాంఘ్రిప్రణతాఽఖిలార్తిం
జంధ్యాలవంశోద్భవ మానమామి
శ్రీసూర్యనారాయణ దేశికేంద్రమ్

## పితృధ్యానము

శ్లో॥ శ్రుత్యుక్త కర్మాచరణపవిత్రపూతం
విద్యోపదేశోద్ధృత శిష్యవర్గం
ప్రసిద్ధశిష్టాన్వయరత్నదీపం
గోపాలకృష్ణం పితరం ప్రపద్యే

శ్లో॥ రామాదిలక్ష్మీపదకీర్తనీయాం
పతివ్రతానాం పురతోభిధేయాం
లక్ష్మీసమానాం సుగుణావదాతాం
వందే మదీయాం జననీం శుభాప్త్యై

## పితామహాదిధ్యానము

శ్లో॥ అష్టాదశాప్యనుపమాన్ ప్రథితాగ్రహారాన్
సంపాద్య పూర్వామిహా మంత్రజపప్రభావాత్
కీర్తిం నిజా మకలయ త్కిల యస్సమర్థ
స్తంసాధుమత్పితృపితామహావర్గ మీడే.

# కథాప్రారంభము

## మైత్రేయ పరాశర సమావేశము

మైత్రేయః—

శ్లో॥ స్వామిన్ కృతకృతార్థోఽహం పరాశర జగద్గురో!
తవసందర్శనాన్మానం జగత్కాలత్రయేఽపిచ

శ్లో॥ సాంసారిక కథాగ్రీష్మసంతప్తబహిరంతరం
దేహమాప్లావయత్వంహి ఆంజనేయకథాఽమృతైః

శ్లో॥ కాని దుష్టానిసత్వాని శిక్షితాని మహాత్మనా
కాని శిష్టాని సత్వాని రక్షితాని మహాత్మనా

శ్లో॥ ఏతచ్చాన్యచ్చకృత్స్నం మే బ్రూహిపారాశరప్రభో!
అజ్ఞాతం త్రిషులోకేషు త్రిషుకాలేషు వా త్వయా

శ్లో॥ నకించిద్విద్యతేబ్రహ్మన్ ! హనుమత్కృపయా మునే !
శిష్యేమయి కృపాంకృత్వాభవత్వాదాన తే భృశం

శ్లో॥ ఆఖ్యాహిహనుమద్వార్తాం సర్వలోకశుభావహాం

తా॥ ఓ పరాశరమునీంద్రా! నీదర్శనముచే నేను త్రికాలముందు ధన్యుండనైతిని. సాంసారికగాధయను గ్రీష్మతాపముచే దేహమంతయుబాహ్యాభ్యంతరములందు వేడికలిగినది. హనుమత్కథాఽమృతములో నా దేహమును ముంచుము. ఆంజనేయునిచే శిక్షింపఁబడిన దుష్టు లెవ్వరు? రక్షింపఁబడిన శిష్టు లెవ్వరు? తెల్పఁగోరెదను. హనుమ దనుగ్రహ పాత్రుఁడవగు నీవెఱుంగనిది

ముల్లోకములలోను మూఁడుకాలములలోను లేదు. లోకోపకార కమగు నీగాథను శిష్యవాత్సల్యముతో సంపూర్ణముగాఁ జెప్పు మని మైత్రేయమహర్షి ప్రార్థింప,

పరాశరః :—

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా వ్యాసస్య జనకో మునిః
హృష్టరోమాఽభవత్సద్యో హనుమద్భక్తశేఖరః

శ్లో॥ ఉవాచ వచనం ధీమాన్ మైత్రేయం మునిసత్తమం
కృతార్థోఽసి మహాభాగ! మాంకృతార్థం కరోషిచ

శ్లో॥ యద్విహాయ కథా మన్యాం మనోవాక్కాయకర్మభిః
హనుమత్కథయా కాలో నయతేఽహర్నిశాత్మకః

శ్లో॥ అతోఽహ మవిలంబేన యథామతి యథాక్రమ
హనూమతః కథాం పుణ్యాం వర్ణయామి మహామునే!

తా॥ మైత్రేయుని ప్రార్థన చూలకించి గగుర్పాటుతోఁ బరమానంద భరితుఁడగుచు శ్రీ హనుమద్భక్తాగ్రగణ్యుఁడగు పరాశర మునీంద్రుండు మైత్రేయునిఁ జూచి ఓ మునీంద్రా! మనో వాక్కాయములచే నితరభాషణములను విడచి రాత్రింబవళ్ళు హనుమత్కథాగోష్ఠియందు మునుంగుదుముగాన మనమిద్దరమును ధన్యులమైతిమి కాన నాలసింపక పవిత్రమగు హనుమత్కథను క్రమముగాఁ దెల్పెద సావధానుఁడవు కమ్మని పలికెను.

## పరశివుఁడే హనుమంతుఁడు

శ్లో॥ నాదబిందుకళాతీతం ఉత్పత్తిస్థితివర్జితం
సాక్షాదీశ్వరసద్రూపం హనూమంతం భజామ్యహం.

శ్లో॥ హనుమాన్ రఘునాథశ్చ ద్వావేతౌ హరరూపిణౌ
ఆద్యోవర్ణస్తుహనుమాన్ ద్వితీయోరఘునందనః

శ్లో॥ ఉభయోరప్యర్చనంతు హరారాధనమేవహి

తా॥ నాదబిందుకళల నతిక్రమించినట్టియు, ఉత్పత్తిస్థితులు లేనట్టియు సాక్షాదీశ్వరుఁడేయగు హనుమంతుని నమస్కరించుచున్నాను. 'హర' అనుశబ్దమున 'హ' కారముచే హనుమంతుఁడు 'ర' కారముచే రఘునాథుఁడు చెప్పబడుచుండుటచే నుభయులపూజ హరపూజయే యగును.

శ్లో॥ హనుమాన్ సర్వలోకేశ స్సజీవో భవతి ధ్రువం
కిమీశ్వరో మహాదేవ స్సాక్షాత్సంసారమోచకః

శ్లో॥ అనాదినిధనోఽనంతః విధాతా జగతాంపతిః
ఆనందమక్షరం బ్రహ్మ పూర్ణః పరమపూరుషః

శ్లో॥ మాయాసంబంధరహితః నిష్కళః పరమేశ్వరః
నాదబిందుకళాతీతో హంస ఇత్యుచ్యతే బుధైః

శ్లో॥ సపిండ్యైకాక్షరాద్యా చ మంత్రైర్ధ్యేయ ముదీరితం
భవతా శాంభవైశ్చిహ్నై రంచితో హనుమాన్ ప్రభుః

శ్లో॥ బహురూపో మహామాయః మహాబలపరాక్రమః
ధ్యేయో బ్రహ్మేంద్రవిష్ణ్వాద్యై స్తత్త్వదిష్టార్థసిద్ధయే.

తా॥ సకలలోకప్రభువగు హనుమంతుఁడు చిరంజీవియును సపిండైకాక్షరమంత్రాధిపతియును సర్వసంసారబాధల నుండి విడిపించువాఁడును అంతములేనట్టివాఁడును లోకప్రభువైన వాఁడును సచ్చిదానందస్వరూపుఁడును మాయాతీతుఁడును నాద బిందుకళల నతిక్రమించినవాఁడును హంసస్వరూపుఁడును శంకరుని లక్షణములతో నొప్పువాఁడును గొప్పపరాక్రమవంతుఁడును అపారమాయాసమన్వితుఁడునై విరాజిల్లుచున్న సాక్షాచ్ఛివస్వరూపుఁడగు హనుమంతుఁ డభీష్టసిద్ధికై బ్రహ్మాదిదేవతలచే ధ్యానింపఁబడుచున్నాఁడు.

## ప ర మ శి వు న కు రా మ దా స్య మె ట్లు ?

మైత్రేయః:—

శ్లో॥ కథ మేవంవిధ స్స్వామిన్! శివః పరమకారణం
అగమ ద్రామదాసత్వం తదాజ్ఞాం కింకరోత్యతః
ఏతం మే సంశయం విద్వన్! ఛింది జ్ఞానాసినా మునే!

తా॥ పరాశరమునీంద్రా! పరమశివునకు రామదాస్యమెట్లు? రామాజ్ఞ నెందుకు నిర్వర్తించుచున్నాఁడు? ఈసందియమును బోగొట్టుడని మైత్రేయుఁడు ప్రార్థింప,

పరాశరః:—

శ్లో॥ సాధుసాధు! మహాప్రాజ్ఞ! మైత్రేయ!మునిపుంగవ!
ఏతల్లోకోపకారాయ పృచ్ఛతేచోచ్యతే మయా

తా॥ బుద్ధిశాలివగు నో మైత్రేయా! లోకోపకారార్థమై నీవు ప్రశ్నించితివి కానఁ జెప్పెద వినుము.

శ్లో॥ పురాఽసీ ద్రాక్షసశ్రేష్ఠో నామ్నా గార్ధభనిస్స్వనః
మహాభీమః మహాకాయః మహాబలపరాక్రమః

శ్లో॥ యస్మిన్ ముచ్యతి నిర్హ్రాదం బ్రహ్మాండోద్భేదశంకయా
బ్రహ్మాదయ స్సురా స్సర్వే విత్రాసంతి దివానిశం

శ్లో॥ దేవదానవయక్షాద్యై రజేయ్యో లోకకంటకః
దేవబ్రాహ్మణసంహర్తా యజ్ఞవిచ్ఛేదకారకః

శ్లో॥ ఇంద్రాదయో లోకపాలాః ఖిద్యంతిచ ముహుర్ముహుః
బ్రహ్మణా విష్ణునా సార్థం యయుః కైలాసమందిరం

శ్లో॥ యత్ర సాక్షాన్మహాదేవః పినాకీ వృషభధ్వజః
ఉమయా రమతే నిత్యం స్వాత్మానందపరాయణః

శ్లో॥ ప్రీతం స్తుత్వా మహాత్మానం ప్రణిపాతపురస్సరం
తేనాభినందితా స్తద్వత్కృతాసన పరిగ్రహాః

శ్లో॥ అన్యోన్యం కథయామాసుః కథా శ్చిత్రా స్సురేశ్వరాః
అథ శ్రద్ధాసనాసీనం విలోక్య మధుసూదనం

శ్లో॥ శంకరః ప్రహసన్ ప్రాహ కింత్వయాఽద్యాగతం హరే!
ఇతి శ్రుత్వా హరస్యోక్తం ప్రోవాచ కమలాపతిః

శ్లో॥ అతిగంభీరయా వాచా శంకరం లోకశంకరం
కిం నవేత్సి మహాదేవ! దైత్యం గార్ధభనిస్స్వనం

శ్లో॥ దేవా న్సంపీడయంతం వై లోకసంక్షయకారణం
వినశ్యేత్స యథా దైత్య స్తముపాయం వదస్వ నః

తా॥ ఓ మైత్రేయ మునీంద్రా! నీవు లోకోపకారము కొఱకు ఈ విషయమును నన్ను అడిగినావు. అది మిక్కిలి బాగుగానున్నది. నేను చెప్పుచున్నాను వినుము.

పూర్వమునందు గార్దభనిస్స్వనుఁడు అను రాక్షసపుంగవుఁడు కలఁడు. వాఁడు మిక్కిలి భయంకరుఁడు. పెద్ద శరీరము కలవాఁడు. విశేషబలపరాక్రమములు కలవాఁడు. వాఁడు ఒక కేక వేసినచో బ్రహ్మాండమంతయు భేదిల్లునేమోయను శంకచే రాత్రింబవళ్ళు బ్రహ్మాదిదేవతలు మిక్కిలి భయపడుచుండువారు. వీనిని దేవతలుగాని దానవులుగాని యక్షులు మొదలగువారు గాని జయింపలేకపోయినారు. లోకమునకంతకును కంటకుఁడై బాధించుచున్నాఁడు. దేవతలను బ్రాహ్మణులను సంహారించుచున్నాఁడు. యజ్ఞములను బాడుచేయుచున్నవాఁడు. ఇట్లు బాధించుచుండఁగా ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకులు మిక్కిలి విచారమును పొంది బ్రహ్మను, విష్ణువును వెంటనిడుకొని కైలాసమునకు వెళ్ళినారు. అక్కడ శంకరుఁడు పినాకధనుస్సునుధరించి వృషభవాహనమందు పార్వతీసహితుఁడై సంతోషముగానున్నాఁడు. ఇట్లు కైలాసమందు శంకరుని బ్రహ్మాదిదేవతలు స్తోత్రముచేసినారు. శంకరుఁడు వీరిస్తోత్రములు విని సంతోషించి వారివారికిఁ దగిన ఆసనములు ఇచ్చినాఁడు. దేవతలందఱు అనేకవిధములుగా ముచ్చటించుకొనుచు సుఖముగానున్న సమయములో శ్రీవిష్ణుమూర్తిని గూర్చి శంకరుఁడు ఓ విష్ణూ! మీరు అందఱునుకలసి ఇట్లు వచ్చుటకుఁగారణ మేమనియడుగఁగా నంతట విష్ణుమూర్తి ఓ మహేశ్వరా! గార్దభనిస్స్వనుఁడు అను ఒకరాక్షసుఁడు దేవత

లను మిక్కిలి బాధించుచున్నాఁడు. లోకమంతయు నశించు చున్నది. ఈలోక కంటకుఁడగు రాక్షసుఁడెట్లు వినాశము పొందునో ఆ విషయము సెలవీయవలసినది అని అడిగెను.

పరమేశ్వరః :—

శ్లో॥ ఇతి తస్య వచశ్శ్రుత్వా శంభురాహ దయానిధిః
దైత్యోఽయం భక్తిసంపన్నః కథం హన్యః మయాఽచ్యుత!

శ్లో॥ నహి మృత్యుస్తస్య కింతు దయాపరవశోఽస్మ్యహం
కిముతాఽతిప్రియం భక్తః మత్పూజైక పరాయణః

శ్లో॥ భవాదృశానాం కాశక్తిః? తస్య దైత్యస్య నాశనే
పరిహాసవచశ్శంభో రితిశ్రుత్వా రమాపతిః

విష్ణుః:—

శ్లో॥ జగామ కోపతామ్రాక్షః శస్యతే శివభాషితం
భక్తోఽహమపి తే శూలిన్! సదా త్వత్పూజనే రతః

శ్లో॥ దృఢభక్తం పరిత్యజ్య మాం దైత్యం బహుమన్యసే
కదాచిత్తమసా విష్ణో దైతేయాన్ బహుమన్యసే

శ్లో॥ కదాచిద్రజసా శంభో! గౌర్యాం వహసి సమ్ముదం
కదాచిత్సత్త్వసంపన్నః కారయస్యఖిలాన్ మునీన్

శ్లో॥ విచిత్రం చరితం శంభో! తవ శక్తిం న వేత్తి కః
జానాసి లోకచరితం సాధూన్ రక్షాంసి మన్యసే

శ్లో॥ లోకానాం మోహనార్థాయ కిమేతచ్చరితం తవ
కిమత్ర బహునోక్తేన విహారాత్ప్రంబయా సహ

శ్లో॥ అహమేవ వధిష్యామి తమేనం దేవకంటకం
దేవారిం నాశయిష్యామి క్షణాదేవ మహేశ్వర !
శ్లో॥ పశ్య మే పౌరుషం దేవ ! సత్యం త్వచ్ఛరణేష్వపి
ఇతి తస్య వచశ్శ్రుత్వా ప్రాహ శంభు స్స్వయంపునః

శివుఁడు విష్ణుమూర్తికిఁ బ్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు. ఈరాక్షసుఁడు నాయందు మిక్కిలి భక్తికలవాఁడు. వీనిని నేనెట్లు చంపఁగలను ? ఓ అచ్యుతా ! ఇతనికి మృత్యువు దుర్ఘటము. నాకును ఇతనియందు దయ యెక్కుడు. నాయందుభక్తి కలవారిని వధించుటకు మాబోటులకు వశముకాదు. అని ప్రత్యుత్తరము చెప్పిన పరమేశ్వరునకు విష్ణువు ఇట్లుచెప్పెను.

ఓపరమేశ్వరా! నీవు పలికినపలుకులు వినిన నాకు మనస్సు సంచలించినది. ఓశంకరా ! నేనును నీకు భక్తుఁడను. నీపూజ నేను ఎప్పుడును వీడక చేయుచున్నాను.

ఎక్కువ దృఢభక్తిగల నాకంటె ఆరాక్షసునే మన్నించుచున్నావు. ఓ మహాదేవా ! నీచరిత మతివిచిత్రము. నీవు లోకమంతయును నిండియున్నావు. ఒకప్పుడు రాక్షసులను గౌరవించుచుందువు. నీవు తమోగుణమును ఆశ్రయించి మెట్టి దుష్టులనైన రక్షించుచుందువు. ఒకప్పుడు రజోగుణమును ఆశ్రయించి పార్వతీదేవిని సంతోషింపఁ జేయుచుందువు. ఒకప్పుడు సత్వగుణమును ఆశ్రయించి మునీశ్వరులనుగూడ లెక్కింపవు. కావున నీ చరిత్రము అతి విచిత్రమైనది. నీవు లోకము యొక్క పరిస్థితులను తెలిసికొనుచుందువు. మంచివారిని రాక్షసులను నొకేమాదిరిగా గౌరవించుచుందువు. నీవు లోకమును

మోహింపఁ జేయుటకుగాను అనేకరీతులుగాఁ బ్రవర్తించు చుందువు. ఇన్నిమాటలతోఁ బనియేమి ? నీవును అంబయును కులాసాగా నుండుడు. నేనే ఆరాక్షసుని తప్పక వధించితీరెదను. నేను నీయందు మిక్కిలి భక్తిగలవాఁడను. కావుననే నీ పాద సాక్షిగా ఆరాక్షసుని సంహరించెదను. నా పౌరుషము కను గొనుచుండుము. అని విష్ణువు సంభాషించుచుండఁగా శంకరుఁడు తిరిగి యీవిధముగాఁ జెప్పెను.

శంకరః:—

శ్లో॥ తిష్ఠంతి కే తాదృశస్య మద్భక్తస్య పురో హరే !
మద్భక్తివర్మయుక్తానాం కో హంతుం ప్రభవే ద్భువి

శ్లో॥ తదలం భో ! హరే ! బద్ధప్రతిజ్ఞాభి స్త్వవాధునా
మిథ్యావాద మద్వైవత్యం మాయా ష్టం హి భవద్వచః

శ్లో॥ ఇతీశ్వరేణకథితం రోషపుష్టం తమోయుతం
శ్రుత్వా కోపసమావిష్టః పున రిత్యబ్రవీ ద్ధరిః

శ్లో॥ మహాదేవ ! మహాబాహో ! సర్వజ్ఞ ! కరుణానిధే !
కిం నజానాసి ? మే శక్తిం త్వత్కృపాద్విగుణీకృతం

శ్లో॥ త్వద్భక్తివర్మసంఛన్నోఽ పైత్య స్సత్యం న సంశయః
అథాతిభక్తివర్మాస్య శిథిలం పాపకర్మణా

శ్లో॥ అత స్తే పాదయో శ్శప్త్వా క్షణేన త్వయి పశ్యతి
హనిష్యామి మహాదైత్యం పశ్య మే దేవ ! పౌరుషం

తా॥ ఓవిష్ణూ ! అట్టిమహాబలుండగు నా భక్తునిముం దెవ్వండు నిలువంగలండు ? నాయొక్క భక్తి అనెడుకవచమును కలిగియున్నవారిని నెవ్వరు సంహరింపఁగలరు ?

కావున నోహరీ ! నీవు ఊరక ప్రతిజ్ఞలను బలుకకుము. నీ పలుకు అసత్యమైనది. అసంబద్ధమైనది. మాయలో మునిగి యున్నది. అని చెప్పుచున్న శంకరునకు విష్ణుం డిట్లుపలికెను. ఓశంకరా! నీవాక్యము కోపభూయిష్ఠ మయినది. ఓ మహాదేవా! ఓమహాభుజా! ఓసర్వజ్ఞా! నేను స్వయముగా బలముగలవాఁడను. నీయందలికృపచేసి రెట్టింపుబలము కలిగియున్నవాఁడను. ఆరాక్షసుఁడు కూడ నీయొక్క-భక్తియనెడి కవచముతో నిండియుండు ననుమాట సత్యమే. అయినను పాపపుఁగార్యము లొనరిఁచుట చేత ఆ భక్తివర్మము శిథిల మయినది.

కావుననే నీపాదములు సాక్షిగా ఒక క్షణములో ఆ రాక్షసుని సంహరించి తీరెదను. నీవు ఇప్పుడైనను నా పౌరుష మును కనుగొందువుగాక;

శంకరః :—

శ్లో॥ ఇత్యాకర్ణ్య హరే ర్వాక్యం స్నేహనిర్భరమానసః
అబ్రవీ ద్వచనం శంభు రితి ప్రోత్సాహయన్ హరిం

శ్లో॥ హనిష్యసి యది శ్రీశ! దైత్యం దైవతకంటకం
దాస్యం కరిష్యామి తవ ప్రతిజ్ఞేయం కృతా మయా

హరిః ;—

శ్లో॥ అహత్వా యది దైత్యేంద్రం నివర్తిష్యే మహేశ్వర!
సదా కైలాసశిఖరే యాస్యే త్వద్దాసదాసతాం

శ్లో॥ పరస్పరం ప్రతిజ్ఞాయ తావేవం హరిశంకరౌ
బ్రహ్మాదిభి స్సురైస్సార్థం జగ్మతు ర్దైత్యసన్నిధిం

శ్లో॥ అథ స్త్రీరూపమతులం చక్రే చక్రధర స్స్వయం
అతీవ రూపసంపన్నం యోగినామపి మోహకం

శ్లో॥ యాం విలోక్య స్మరహర స్స్మరావిష్టో భవత్స్వయం
అపశ్య దబలాం దైత్యో విహరంతీం స్వకే వనే

తా॥ అనిచెప్పిన విష్ణువుయొక్క వాక్యమును శంకరుఁడు విని ప్రోత్సహించుచు నిట్లు పలికెను.

నీవు దైవత కంటకుఁడగు గార్దభరాక్షసుని జంపితివేని నేను చేయు ప్రతిజ్ఞను వినుము. "నీకు దాసుఁడనై యుందును," అనెను.

విష్ణువు ఇట్లుచెప్పెను. నేను ఆ గార్దభునిఁ జంపలేకపోతి నేని "కైలాసపర్వతమందు నీదాసులకు దాసుఁడనై సంచరించు చుందును" అని ప్రతిజ్ఞచేసెను.

ఇట్లు హరిహరు లుభయులు ప్రతిజ్ఞలు చేసికొని బ్రహ్మాది దేవతలతోఁగూడి దైత్యుని సన్నిధికి వెళ్ళినారు. పిమ్మట శ్రీహరి తాను అసామాన్యమగు స్త్రీ రూపమును ధరించెను.

మిక్కిలి మంచి రూపసంపదలు కలిగి యోగీంద్రులను గూడ మోహమున ముంపఁజాలి తనను గనుగొన్న మాత్ర మున శంకరునిఁగూడ మన్మథావేశ పరవశునిఁగాఁ జేయఁజాలి మంచి యౌవన దశయందు విరాజిల్లుచుండెను.

గార్దభదైత్యుఁడు తనవనములో నొంటరిగా విహరించు చున్న మోహనరూపముతోనున్న విష్ణువుయొక్క స్త్రీరూప మును జూచెను.

శ్లో॥ ప్రాజ్ఞ యౌవన విశ్రాంతిభూమిం సమ్యాద్భమికాం మివ
మదనస్య మహానాట్యపవిత్రనమహోత్సుకాం

శ్లో॥ నీలకుంచితకేశాంత విరాజత్ఫుల్లమల్లికాం
అథ చంద్రపరిస్పర్ధినిటలాం పటులోచనాం

శ్లో॥ హేమానుకారివదనాం పూర్ణచంద్రనిభాననాం
మందస్మితప్రభావాంచ న్మ్మఖరాకేందుమండలాం

శ్లో॥ బింబోష్ఠీం కంబుకంఠీంచ పీనోన్నతపయోధరాం
మృణాలబాహులతికాం పల్లవోద్యత్కరాంబుజాం

శ్లో॥ త్రివళీవలనోదారాం తనుమధ్యాం తలోదరీం
సునాభిం సైకతశ్రోణిం వృత్తోరుం చారుజంఘికాం

శ్లో॥ పద్మానుకారిప్రమదాం ప్రమదాం మదవిహ్వలః
ఇతి ప్రోవాచ విధురః మదనోజ్జ్వలమానసః.

తా॥ ఆ విష్ణువుయొక్క స్త్రీరూప మిట్లు విలసిల్లు చున్నది. చక్కని జవ్వనముకలిగియున్నది. మంచిసుఖమును గాంచుటకు వీలుగానున్నది. మన్మథవిహారమునకు సమున్నతిని వహించియున్నది, నల్లని కుంచెలవలె నీలకేశములు విరాజిల్లు చున్నవి, మిక్కిలి వికసించిన మల్లెపూవు లందు శోభిల్లుచున్నవి. బంగరువలెను నిండుచందురునివలెను మోము వికసించుచున్నది. ఆ మోముచందురునందు చిఱునవ్వు మిక్కిలి రమ్యముగా నున్నది. తామరతూడులవంటి బాహువులు, దొండపండువంటి పెదవులు, శంఖమువంటి కంఠము, మంచిసౌందర్యముగాను వర్తులముగానుండుపయోధరములు, చిగురులంబోలు కెంపుగేల్దోయి, వళిత్రయముఁగల యుదరము, మిక్కిలి సూక్ష్మమగునడుము.

అందమగు పొట్టయును మంచినాభియును, ఇసుకతిన్నెలను మించు పిఱుదులును, గుండ్రనితొడలు, అందమగు పిక్కలు గలిగి లక్ష్మీదేవినిమించిన యాకారమునొంది కన్నులయెదుట సంచరించుచున్న వనితారత్నమును గనుంగొని చలించిన మనస్సుగలవాఁడై చంచలమగు వ్యాపారముగలవాఁడై ఆ యన్నులమిన్నతో నిట్లుపలుకం గడంగెను.

శ్లో॥ కా త్వం? కమలపత్రాక్షి! దైవీ వా? మానుషీచవా?
గాంధర్వీ వా? కిన్నరీ వా? తవ వై శేషికం వద.

శ్లో॥ భజస్వ మాం వరారోహే! దాస్యం తే కరవాణ్యహం
త్రైలోక్యాధిపతి స్సోహం దాసో మే సురనాయకః

శ్లో॥ భజస్వ మాం పదేవ్యద్య త్రైలోక్య శ్రియ మూర్జితాం
ఇత్యాకర్ణ్య వచ స్తస్య కించి ల్లజ్జావతీవ సా

శ్లో॥ పరాఙ్ముఖీ సస్మితాస్యా విలాసపరిచేష్టితా
గార్దభాసురముద్వీక్ష్య ప్రోవాచ సుమనోహరం.

తా॥ ఆరాక్షసుం డిట్లు అనెను.

నీవెవ్వరవు? తామర పూవు రేకులవలె నందములగు కన్నులుగలదానా! నీవుదేవతాస్త్రీవా? మనుష్యస్త్రీవా? గంధర్వస్త్రీవా! కిన్నరస్త్రీవా! నీయొక్క విశేషమును విపులముగాఁ జెప్పుము. నన్ను అనుసరించి నాకోర్కెలను దీర్పుము. నీకుసేవకుఁడనై యుందును. నేను ఈమూఁడు లోకములకు అధిపతిని. దేవతలందఱును నాకు దాసులై యున్నారు. నన్ను అనుసరించి యుంటివేని ఈ త్రైలోక్య లక్ష్మిని నీవు పొందఁగలవు. అనిచెప్పిన

గార్ధభాసురునిఁ గనుంగొని కొంచెము వినయము కలదివలె నును
సిగ్గు తెచ్చుకొని క్రీగంటిమోము చెన్నలరఁ జిఱునవ్వు మొలక
లెత్త గార్ధభాసురునిం జూచి యిట్లు పలుకఁ దొడంగెను.

శ్లో॥ సాధుదైత్యేంద్ర! హే తాత! దేవీయంచ భవిష్యతి
రతిప్రియా సునిపుణా భవా న్యది భవిష్యసి.

ఓరాక్షసేంద్రా! నేను దేవతాస్త్రీని. నేను రతిప్రియను,
మంచి నైపుణ్యము గలదానను, నీవును అట్టివాఁడవే నా?

గార్ధభదైత్యః—

శ్లో॥ చతుష్షష్టికళాభిజ్ఞో వనితాసు రతిప్రియః
షడశీతిమహాబంధః చతురోఽహం వరాననే!

శ్లో॥ కళాశాస్త్రపరిజ్ఞానే గానవిద్యాదినైపుణే
సర్వవిద్యాసు రమ్యేషు వచనేషు సదా శుచిః

శ్లో॥ రత్యాంచ మత్సమానోఽన్యో లోకే నాస్తి వరాననే!
రతిక్రియాసు బహుధా జితా అప్సరసో మయా

శ్లో॥ అహంహాలా మదోద్వేలం కుర్యాత్త్వయది సంగమం
కథం సహేరియంబాలే! మయాగాఢ ప్రమోదినా

తా॥ నేను అఱువది నాలుగు విద్యలయందు నిపుణుఁడ
ను. సురతమునందు మంచి యనుభవజ్ఞానము కలవాఁడను. ఎను
బదియాఱు బంధములు నేర్చినాను. కళాశాస్త్రమునందు మిక్కిలి
సమర్థుఁడను. గాన విద్యలో నెక్కువ ప్రజ్ఞగలవాఁడను. అన్ని విద్య
లును తెలియును. చక్కగా మాటలాడుటయందు మంచి వాగ్జా
లము కలవాఁడను. సురతము విషయములో నాకు సమానుఁడు

ప్సరసలందఱును రతిక్రియలలో నాచే జయింపఁబడిన
ు తే ఒక్కటి చాలవిచిత్రముగా నున్నది. నేను మిక్కిలి
శరీరపరిమోదము గలవాఁడను. నీవు మంచి సుకు
ఎట్లు రతిప్రసంగమునందు సహింప గలవో! యని
మచున్నా ననెను.

—

వాస్తు మహాబాహో! పిబే మాం మదిరాం శుభాం
యాం మామభీష్టా మలమేతద్విలంబనం

క్త్వా సా దదౌ తస్మై చషకం స్వాకరస్థితం
పూర్ణం పపౌ నేత దానీయ దనుజేశ్వరః

వ్రజంతీ మగ్రేతాం గ్రహీతుం వరవర్ణినీం
త్యా వ్రిజః మత్తః పపాత విస్మృతః క్షితౌ.

॥ నీవు మహాబలుండవు. అయినను నేను నీకిచ్చుచు
రతియందు మిక్కిలి ఆప్యాయమును కలిగించుచున్న
మదిరమును నన్నును అనుభవించుము. ఆలస్యము
. అని చెప్పి తన చేతిలోనున్న కల్లు కలశము నిచ్చెను.
వనే గార్ధభాసురుఁడు మిక్కిలి ప్రేమముతోఁద్రావెను.
ళ్ళిపోవుచున్న యామోహినీదేవి ననుసరించి వెళ్లుచు
ియనివాఁడై నేలమీఁదఁ బడి పొరలుచుండెను.

దేహాస్మరణాః నిశ్చేష్టాః దుష్టరాక్షసః
నినవం మధ్యం మహీమ్నా విచర ద్భువి.

శ్లో॥ అథ విష్ణుః పరిత్యజ్య స్త్రీరూపం వృకరూపధృత్
మహాదంష్ట్రో మహాకాయో మహాసత్త్వ ముపస్థితః

శ్లో॥ మహావాలో మహాపాదః వృకః పర్వతసన్నిభః
నిరక్షరత్యై దైత్యేంద్ర మధర్షయత తం బలాత్

శ్లో॥ సంపూర్ణదైత్యరాజానం భుక్త్వా గార్దభనిస్వనం
నిజరూపం దధారాసౌ భగవాన్ శంఖచక్రధృత్.

శ్లో॥ పీతాంబరధరో లక్ష్మ్యా వనమాలావిభూషితః.

తా॥ ఇట్లు శరీరస్మృతి తప్పి గొప్ప కేకలు వేయుచు దిః
గుచుండెను. అంత విష్ణుమూర్తి మోహినీ స్త్రీరూపమును విడి
ఒక పెద్ద శరీరము గలిగినట్టియు, గొప్ప బలము గలిగినట్టియ
గొప్ప దంతములు గలిగినట్టియు బెద్దతోక గలిగినట్టియు బొడ
లగు పాదములు కలిగినట్టియు పర్వతమువంటియు బెద్దతోడే
అయియుండెను. ఆయాకారమును జూచి గార్దభాసురుడు ఆ
దమస్తకము మిక్కిలి భయమును జెందుచుండెను. ఆవృకమ
గార్దభాసురుని మింగి భక్షించి శంఖచక్రధారియై పీతాంబ
ధరుండయి వనమాలాభూషితుండయి లక్ష్మితోసహా నిజరూ
మును ధరించెను.

శ్లో॥ అథ దేవా స్సగంధర్వా స్తుష్టువు స్సిద్ధచారణైః
వవృషుః పుష్పవర్షాణి ననృతు శ్చాప్సరోగణాః

శ్లో॥ అథాంతరే మహాదేవః ప్రణిపత్య జనార్దనం
ప్రాహ గంభీరయా వాచా "దాసోహం తవమాధవ"

గరిః:—

శ్లో॥ త్వత్తో నను మహాదేవ జగతః ప్రభవో యయా।
శ్లో॥ త్వదంశసంభావాహ్యత్తే వయం బ్రహ్మాదయస్సురాః
త్వన్మహిమ్నా హతశ్చాయం దైత్యో గార్దభ నిస్స్వనః॥
శ్లో॥ త్వదధీనా వయం నాథ! బ్రహ్మదేవేశ్వరాదయః
తస్మాద్భవంతం సర్వేశ! కథం దాసం కరోమ్యహం॥

తా॥ సిమ్మట దేవతలు గంధర్వులు సిద్ధులు చారణులు
ంతోషించి పుష్పవర్షమును గురిపించిరి. అప్సరసలు నాట్య
ను చేసినారు. ఇట్లుండగా మహాదేవుఁడువచ్చి హరికి నమస్క
చి నీకు ఇంతటి నుండియు నేను దాసుండనైతినని చెప్పెను.

అందుకు విష్ణుమూర్తి యిట్లు పలికెను.

ఓమహాదేవా! నీవల్లనే యీజగమంతయును నుద్భవించి
. బ్రహ్మమొదలగు మేమందరమును దమ యంశ వల్లనే
భవించినాము. తమమహిమముచేతనే యీ గార్దభాసురుఁడు
ంచినాఁడు. ఓ మహేశ్వరుఁడా! బ్రహ్మమొదలగు మేమంద
ు నీవే అధిపతిగాఁ గలవారము. కావున మేమెట్లు నీచే
నుఁ చేయించుకోఁగలము, అనెను.

అతో రావణనాశాయ యదా దశరథాత్మజః
భవామ్యహం రామరూపో దాసస్త్వం పరమేశ్వర!
హనుమదాఖ్యరూపస్త్వం కురు మే సఖ్యమీశ్వర!
ఏవం సతి ప్రతిజ్ఞా తం సత్యం భవతి నాన్యథా
తదుల్లంఘన మస్మాకం నభవేదితి సువ్రత!
సాక్షాత్త్వవ మహాదేవ! దాసభావో నిరూప్యతే॥

తా॥ ఇందువల్ల ఎప్పుడు నేను రావణ వధార్థము దశరథాత్మజుఁడనై రామరూపమును బొందుదునో అప్పుడు హనుమంతుని రూపమును ధరించినవాడనై నాకు సఖ్యుడవు అగుదువు. ఇట్లయినచో నీకును దాసత్వము సిద్ధించును. మునుప్రతిజ్ఞలు నెరవేరినవగును. కావున వీనిని ఉల్లంఘనము చేయుటకు ఎంతమాత్రమును తగదు.

పరాశరః —

శ్లో॥ ఏవమస్త్వితి తంప్రాహ భగవాన్ వృషభధ్వజః
పరస్పరం సమాలింగ్య ప్రయాతౌ శ్రీధరాభవౌ ॥

శ్లో॥ తదద్భుతం సమాలోక్య సురా జగ్ముర్యథాగతం
పరస్పరం ప్రశంసంతః శివకేశవ తుల్యతాం

శ్లో॥ ఏతత్తే పరమః విప్రా రహస్యం పరమం మను
శోచనీయం ప్రయత్నేన హనుమత్త్వముత్తమమ్

శ్లో॥ తదాప్రభృతి హనుమాన్ విఖ్యాతో భువనత్రయే
రామదాసో రామదూతో రామభక్త ఇతి స్మృతః

తా॥ ఆవిచిత్రసమాచారమును గనుంగొని దేవతలు శివకేశవులు ఇద్దఱును సమానులే యనుకొనుచు ఇంటికి వెళ్ళినారు.

కావున ఓ మునీంద్రులారా! ఇది మిక్కిలి రహస్యమైనది. అయినను మీకు విపులముగాఁ జెప్పినాను. ఈ హనుమత్తత్వము మంచి ప్రయత్నముచేతనే తెలిసికొనదగియున్నది. అది మొదలుకొని యీశ్వరుని ఈ అవతారములో రామదూత అనియు రామదాసులనియు, రామభక్తుడనియుఁ బేరొందును చుందురు.

ఇంకొక నిదర్శనము

శ్లో॥ అన్యద్రహస్యం వక్ష్యామి కథాం పాపప్రణాశినీం
సావధానమనో భూత్వా శృణుష్వ మునిపుంగవ !

శ్లో॥ పురా త్రిపురసంహారే స్వబాణత్వముపేయుషే
విష్ణవే రామరూపాయ కరిష్యన్ ప్రత్యుపక్రియాం

శ్లో॥ అఖిలైః ప్రమథై శ్శంభుః హనుమద్రూప మాయయౌ
తథా ప్రత్యుపకారం సః విధాయాతికృతజ్ఞతాం॥

శ్లో॥ స్వచ ప్రకటయన్నాస్తే రామనామజపప్రియః
శివఏవ హరిస్సాక్షాత్ హరిరేవ శివస్స్మృతః

శ్లో॥ ఉభయో రంతరంనాస్తి భేదకృత్పాపమశ్నుతే
తస్మాద్ధరిహరాభేదో విజ్ఞేయో మోక్షకాంక్షిభిః॥

తా॥ ఇంకొక రహస్యము పాపనాశనమును అగుకథను చెప్పుచున్నాను, వినుము. ఓ మైత్రేయమునీశ్వరా ! పూర్వకాలమందు ద్రిపురసంహారమునందు బాణరూపమును ధరించిన విష్ణువునకు రామరూపునందుఁ బ్రత్యుపకారము చేయఁదలఁచి యీశ్వరుఁడు ప్రమథగణములతోను హనుమద్రూపమును పొందెను. ఈ హనుమంతునిరూపముతో రామునకు మిక్కిలి సాయము చేసెను. రామజపమును చేయుచుండెను. కావున శ్రీ శివుఁడే శ్రీ విష్ణువు. శ్రీ విష్ణువే శ్రీ శివుఁడు. శివకేశవులకు భేదమేమాత్రమును లేదు. అట్లు భేదమున్నదని వాదించినవాఁడు మహాపాపియగును. కావున మోక్షము జూరగోరువారు హరిహరాభేదమునే నిరూపించుచుందురు.

శ్లో॥ విజ్ఞాత మనయోర్వృత్తు రూపం తదుభయాత్మకం
ఉపాస్య హనుమత్సంజ్ఞం భోగమోక్షప్రదం నృణాం.

శ్లో॥ యతస్తా శంభుచిహ్నైశ్చ విష్ణుచిహ్నై రలంకృతౌ
అత స్తదుభయాత్మాహి విజ్ఞాతవ్యో మనీషిభిః

తా॥ ఈ యుభయ స్వరూపమగు తత్వమును ఉపాసించిన మనుజులకు మోక్షము అరచేతిలోనుండును. విష్ణుచిహ్నములతోను శివచిహ్నములతోను విరాజిల్లుచున్న హనుమంతుని రెండుతత్వములచేతను మనీషులు తెలుసుకొనుచుందురు.

శ్లో॥ హరస్వరూపోఽపి హరిస్వరూపః
భవే ద్ధనూమానితి యస్య చిత్తే
దృఢోఽభవత్ లోకహిత స్సఏవ
సఏవసంసార మపేతసారం॥

తా॥ హరుడే హరియనియు, హరియే హరుడనియు, నీయిద్దఱును హనుమంతుడనియు నెవ్వనిచిత్తమందు దృఢమగు నమ్మకముకలదో అతడే లోకహితుడు. అతడే సంసారమును సారములేనిదానినిగా గుర్తెఱుగుచున్నాడు.

మైత్రేయః—

శ్లో॥ అవతారేష్వనంతేషు రామస్య పరమాత్మనః
భూతేషుచ భవిష్యత్సు ప్రతికల్పం మహామునే.

శ్లో॥ ప్రకాశయ హనూమంతం బహుధా జాయతే నవా
ఏతన్మే సంశయం విద్వాన్ పరాశర! నివారయ.

తా॥ ఓ మహామునీ! పరమాత్మయగు రాముఁడు అనంతములగు అవతారములు ధరించినాడుకదా! భూతకాలమునందు రామావతారములు పెక్కులున్నవి. భవిష్యత్కాలమునందు రామావతారములు పెక్కులు కలుగబోవుచున్నవి. ప్రతి కల్పమునందును అనేక రామావతారములు కలుగుచున్నవి. ప్రతి రామావతారమునందును హనుమంతుఁడు ఒకడేనా? అనేక హనుమంతులున్నారా? ఇందు నాకు సంశయము కలుగుచున్నది. ఓ పరాశరమునీంద్రా! ఈ సంశయమును నీవే నివారింపవలయును.

పరాశరః:—

శ్లో॥ బహురామావతారాణాం ప్రతికల్పంచ భావినాం
హనుమానేక ఏవాస్తి కుర్వశ్చ ప్రకృతిం పరాం

శ్లో॥ చతుర్ముఖత్వమాపన్నా స్తదంశాఏవ కేవలాః
బ్రహ్మాండే సృష్టికర్తారః కల్పేకల్పే భవంతి తే॥

శ్లో॥ ఆధారయంతే హనుమత్పదాబ్జే
కథంను దైన్యం కలయామి లోకే
ఆశ్రిత్య కల్పద్రుమమూలవేది
మాతప్యతే కఃఖలు భానుభాభిః.

తా॥ ప్రతికల్పమునందును రామావతారములు అనేకములున్ననూ ప్రకృతిని గలిగించుచు హనుమంతుఁడు మాత్ర మొకఁడే యవతరించి యున్నాఁడు. హనుమంతుఁడు చతుర్ముఖుఁడై యుండి యాతని యంశములే బ్రహ్మాండమునందును బ్రతికల్పమునందును సృష్టిని కలిగించుచున్నవి.

హనుమంతుని పాదారవిందములు నమ్మినవారికి లోకమందు ఏభయమును గలుగదు. దైన్యము నుండనేయుండదు. లోకములో ఎవ్వండైననూ కల్పవృక్షముయొక్క మూలవేదికయందుండి సూర్యుని కిరణములకు బాధ నొందునా? పొందదు. అటులనే శ్రీహనుమంతుని పాదసేవకునకు ఏభయమును గలుగదు.

ఇతి శ్రీపరాశరసంహితాయాం పంచముఖహనుమ
న్మంత్రవివరణే శ్రీ పరాశరమైత్రేయసంవాదే
రామదాసత్వప్రకార కథనం.

# ఈశ్వరత్వమున కొరియొక నిదర్శనము.

(ఆనందరామాయణాంతర్గతము.)

విష్ణుదాసఉవాచ:—

శ్లో॥ కించిద్వృత్తం హనుమతస్త్వం మాం వక్తుమిహార్హసి.

తా॥ హనుమంతుని వృత్తవిధానమును నాకు దెలియ జేయుము.

రామదాసఉవాచ:—

శ్లో॥ యదా రామ స్త్రికూటాద్రౌ నాగపాశైస్తు పీడితః
నారదస్య వచశ్శ్రుత్వా సస్మార వినతాసుతమ్॥
శ్లో॥ తదాసౌ కాశ్యపో వీర స్సమాగత్య రణాంగణే
ప్రణామ మకరోత్తస్మై రామాయామిత తేజసే॥
శ్లో॥ నివార్య పన్నగాస్త్రం తన్మేఘనాదసమీరితమ్
తుష్టావ రఘువీరం తం ససైన్యం సహలక్ష్మణమ్
శ్లో॥ ఉవాచ ప్రణిపత్యాథ రామభద్రం ఖగేశ్వరః.

తా॥ త్రికూటాద్రియందు నాగపాశబద్ధుండై శ్రీరామచంద్రమూర్తి నారదుని వచనానుసారముగా వినతయొక్క కుమారుండగు గరుత్మంతుని స్మరించెను. అంతనే వీరుండగు కశ్యపుని కుమారుండైన గరుత్మంతుండు వచ్చి యుద్ధాంగణమందు అమితబలపరాక్రమమును కలిగిన రామచంద్రునకు నమస్కరించెను. మేఘనాధునిచే బ్రయోగింపఁబడిన పన్నగాస్త్రమును నివారింపఁజేసి లక్ష్మణుని శ్రీరాముని సంతోషింపచేసి పిమ్మట శ్రీరామచంద్రుని పాదములు పట్టుకొని యిట్లనియె.

గరుడ ఉవాచ:—

శ్లో॥ ఆశ్చర్యమిద మత్యంతం యద్భవా నస్మరద్ధి మాం
సతి వీరే మహారుద్రే సగణే శ్రీహనూమతి॥

శ్లో॥ సుగ్రీవేచ నలేనీలే సుషేణే జాంబవత్యపి
అంగదే దధివక్త్రేచ తారేచ తరళే తథా॥

శ్లో॥ మైందేసతి మహావీర్యే కిమితాస్తి ప్రయోజనమ్॥

తా॥ ఓరామచంద్రా! మహావీరుండగు సాక్షాద్రుద్రావతారుండయిన హనుమంతుండు గణములతోఁ గూడి యుండఁగా, సుగ్రీవుఁడు, నలుఁడు, సుషేణుండు, జాంబవంతుఁడు, అంగదుఁడు, దధివక్త్రుఁడు, తారుండు, తరళుండు, మహావీరుండగు మైందుండు మొదలగువారు ఇక్కడనుండఁగా నన్నుఁ బిలచుట మిక్కిలి విచిత్రముగానున్నది.

శ్రీరామఉవాచ:—

శ్లో॥ భవద్భీతి ముపాగమ్య విద్రుతాశ్చ భుజంగమాః
ఏతేషు సత్సు వీరేషు కిము సైన్యమపీడయన్॥

తా॥ వీరులగు వీరందఱు ఉన్నను సైన్యమును నాగపాశము పీడించుచునేయున్నది. నీవు రాఁగానే నీయందలి భయముచేఁ ద్రాఁచుపాములన్నియు మిక్కిలి వడకుచు ఎక్కడి వక్కడనే చెల్లాచెదరై పారిపోయినవి.

గరుడ ఉవాచ:—

శ్లో॥ రామదేవ! మహాబాహో! కపీనాం చరితం శృణు
ఆత్మనోపి సమావిష్టాన్ మాతు రుష్ట్వాత్ర గర్హణమ్॥

శ్లో॥ సాక్షాత్త్వం భగవాన్విష్ణుః లక్ష్మీ స్త్వం జనకాత్మజా
సౌమిత్రిః ఫణిరాజోఽయం రుద్రాశ్చ కపయస్స్మృతాః॥

శ్లో॥ సుగ్రీవో వీరభద్రోఽయం శంభురేష స్మృతోనలః
విద్ధి దాశరథే నూనం గిరీశో నీల ఏవచ॥

శ్లో॥ మహాయశా స్సుషేణోఽయం జాంబవాం శ్చాప్యజైకపాత్
అహిర్బుధ్న్యశ్చ త్వంగదస్తు దధివక్త్రః పినాకధృత్॥

శ్లో॥ అయుతాజిత్త్వయం తారః స్థాణుశ్చ తరభో మతః
మైందో భర్గతను స్సాక్షాత్ హనుమాన్ భగవాన్ స్మృతః॥

శ్లో॥ అవతీర్ణా మహారుద్రా స్త్వదర్థం రఘునందన!
అవసన్ సర్వదేశేషు నానాపర్వతమధ్యతః

శ్లో॥ ధృత్వాచ కపిరూపాణి జీవ తేరు ర్మహీతలే
సర్వేపి కపితాం ప్రాప్తాః కారణం తద్ర్బవీమి తే॥

తా॥ ఓ శ్రీరామచంద్రమూర్తీ! కపులయొక్క చరిత్రమును సావధానముగా వినుము. నేనుండఁగా వారిని జులకనగా జూడకుము. సాక్షాత్తు విష్ణుమూర్తివే నీవును, లక్ష్మీదేవి సీత, ఆదిశేషుడు లక్ష్మణుండు. రుద్రగణములు వానరులు. వీరభద్రుండు సుగ్రీవుఁడు. శంభునామకుఁడు నలుఁడు. ఓరామా! గిరీశుండు, నీలుఁడు, మహాయశుండు సుషేణుండు, అజైకపాదుండు, జాంబవంతుఁడు, అహిర్బుధ్న్యుఁడు, అంగదుఁడు, పినాకపాణి, దధివక్త్రుఁడు, అయుతజిత్తు తారుఁడు, స్థాణుండు, తరభుండు భర్గుండు, మైందుండు, సాక్షాత్ సాంబమూర్తి, హనుమంతుఁడు రుద్రగణమంతయు ఇట్లు నీనిమిత్తము వానరరూపులై అవతరించినారు. అందఱు అన్నిప్రదేశములలోను పర్వతములలో దిరుగుచున్నారు. ఇట్లు వీరందఱును వానరు లగుటకుఁ గారణమును జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ పురా దేవాసురై స్సింధో ర్మథితా ద్వ్యాధయోఽ భవన్
నానాపీడాకరా స్సర్వా లూతా విస్ఫోటకాదయః॥

శ్లో॥ తైరేవం వ్యాధిభి స్సర్వం పీడితం జగతీతలం
ఋషయోఽపి నృపాలాశ్చ బ్రహ్మాణం శరణం యయుః॥

తా॥ పూర్వము దేవతలు రాక్షసులు సముద్రమును మథించుచుండఁగా మసూచి మొదలగు వ్యాధులు కలిగి చాల బాధించు చున్నవి. లోకమంతయు ఈ విధముగా బాధలో మునిగియుండఁగా మునులు మొదలగువారు బ్రహ్మను శరణు పొందిరి.

శ్లో॥ ఊచుశ్చ జగతాం నాథం బ్రహ్మాణం కమలోద్భవం
త్రాహి త్రాహి జగన్నాథ! వ్యాధిభ్యో జగతీమిమాం॥

శ్లో॥ పీడితాం దారుణైర్దోషై ర్జ్వరాద్యైశ్చ విషోల్బణైః
త్రిదోషై ర్జర్జరీభూతాం విభ్రమై ర్వ్యాకులీకృతాం॥

శ్లో॥ ఔషధాని నసిధ్యంతి మంత్రయంత్రాణి చైవహి
పీడయంతి మహారోగా మానవాన్ నాశకారిణః॥

శ్లో॥ ఏతత్తే కథితం బ్రహ్మన్ సర్వం త్వత్పురత స్సుధీః
తత్తేషాం వచనం శ్రుత్వా రుదన్ సంప్రార్థయద్విధిః॥

తా॥ దేవతలందఱును బ్రహ్మదేవుని ధ్యానించు చున్నారు. ఓ జగన్నాథా! లోకములోనివారందఱును దారుణములగు దోషములచే, విషమును వెల్లించు జ్వరాదులచేతను త్రిదోషములచేతను మతిభ్రమలచేతను శిథిలమై వ్యాకులమును బొందుచున్న యీలోకమును ఉద్ధరింపుము. తప్పక రక్షింపుము. గొప్పగొప్ప యీ రోగములు మందులు ఉపయోగించినను మంత్రములు ఉపాసించినను నివారణమవుట లేదు. మిక్కిలి

బాధించుచున్నవి. కావున మేము ఈ బాధలుపడలేక మీతో మనవి చేసికొనుచున్నాము. అని చెప్పిన వాక్యములు బ్రహ్మదేవుడు విని మిక్కిలి విచారించి యిట్లు చింతించెను.

శ్లో॥ తేఽపి శ్రుత్వా బ్రహ్మవాక్యం రుద్రా ఏకాదశామలాః
సమాశ్వాసు ర్విరించిం తే వీరభద్రాదయ స్సురాః
శ్లో॥ సంభూయ వానరేష్వేవ సుగ్రీవప్రముఖా ఇమే
పర్యటన్ పర్వతాగ్రాణి మండలానిచ సర్వశః
శ్లో॥ నాదయంతో జగత్సర్వం బుభుక్కారై స్సుదారుణైః
క్ష్వేళితైః కిలకిలై స్తేషాం వ్యాధయో నాశమాప్నుయుః
శ్లో॥ తతస్తు సకలాం దృష్ట్వా వానరై ర్వేష్టితాం భువం
తుతోష భగవాన్ బ్రహ్మ దదౌ తేభ్యో వరాన్ బహూన్”

తా॥ ఇట్లు విచారించుచున్న బ్రహ్మదేవునింగని ఏకాదశ రుద్రులు వీరభద్రుండు మొదలగు దేవతలు అందఱునూ జాలి గలవారై యోదార్చిరి. పిమ్మట సుగ్రీవుండు మొదలగు వానరులందఱును పర్వతములు వనములు దేశములు మున్నగా నఖిల ప్రదేశములు సంచరించుచు భయంకరములగు బుభుక్కారముల చేతనూ, కిలకిలారావములచేతను, పెద్ద పెద్ద కేకలు వేయుచు మిక్కిలి హెచ్చరికగా నుండఁగా నంతట వారలయొక్క రోగములన్నియు నివారణ మాయెనవి. పిమ్మట భూమి నంతటను దిరుగాడుచుండు వానరులను గనుంగొని బ్రహ్మదేవుండు మిక్కిలి సంతోషించెను. వారలకు అమితము లగు అమూల్యములగు వరముల నొసంగెను.

బ్రహ్మోవాచ:-

శ్లో॥ యుష్మాస్వపిచ రుద్రాఽస్తు మృతసంజీవినీకలా
ఆజ్ఞాఽస్తు సర్వజగతి వేగోఽస్తు మనసస్సమః

శ్లో॥ యుష్మాన్ స్మరంతి యే మర్త్యాః పూజయంతి భవత్తనూః
పతాకా వివిధాః కృత్వా చిత్రతోరణసంయుతాః॥

శ్లో॥ భక్ష్యాణి భోజ్యాని ఖాద్యం లేహ్యం పేయంచ సర్వశః
యుష్మానుద్దిశ్య యే మర్త్యాః జుహ్వంతిహి హుతాశనే

శ్లో॥ హవిః పుణ్యతమం రుద్రాస్తేషాం సిద్ధి ర్న సంశయః
పాయసేనైవ సాజ్యేన తథైవ తిలసర్పిషా॥

శ్లో॥ యజంతి భవతాం వృంతం తే యాంతి పరమంపదం
ఏవంవై రుద్రమఖిలం గాథా వైశ్వావరీ స్తథా.

శ్లో॥ మానస్తోకేతివా మంత్రో మనోజ్యోతి రథాపివా
భవతాం యజనంచాత్ర గాయత్ర్యావా ప్రకీర్తితం

శ్లో॥ ఏవం యే మానవా లోకే విధానం పరికుర్వతే
వ్యాధిం ముక్త్వా సుఖాసీనా స్త్వంతే యాంత్యక్షయంపదం॥

తా॥ బ్రహ్మదేవుఁడు వానరులతో నిట్లు చెప్పుచున్నాఁడు. ఓ వానరులారా! మీయందు సంజీవిని నిలుచుచుండును. మీ వాక్యంబులు అమోఘములై ప్రజలను వ్యాధులనుండి తొలగించుచుండును. మీకు మనస్సుతో సమానమగు వేగము కలుగుచుండును. మీ శరీరములను ఎవ్వరు పూజించుచుందురో మిమ్ములను ఎవ్వరు ధ్యానించుచుందురో పందిళ్లువేసి, తోరణములు కట్టి భక్ష్యములు భోజ్యములు చోష్యములు పానీయములు, లేహ్యములు మొదలగు హోమ పదార్థములు మిమ్మును ఉద్దేశించుకొని అగ్నిహోత్రమందు హోమము చేయుచుందురో వారలకు కార్యములన్నియును ఫలసిద్ధిని గాంచుచుండును. పరమాన్నమును నేతితో ముంచిగాని, నూనెతో ముంచిగాని

యెవ్వరు హోమము చేయుచున్నారో వారు పరమ పదమును నొందురు. ఇట్లు రుద్రగాథలు అనేకములు కలవు. "మానస్తోకే" అను మంత్రముచేతఁగాని, "మనోజ్యోతి" అను మంత్రము చేతఁగాని గాయత్రీమంత్రముచేతఁగాని మీధ్యానముచేయు చుందురో మీపూజల నొనరించుచుందురో వారు తప్పక స్వాభిమతసిద్ధిని గాంచుచుందురు. వారివారి వ్యాధులు అన్ని యును నివారణమై సుఖమునుగాంచి పిమ్మట అక్షయలోకమును పొందుచుందురు.

గరుడ ఉవాచః—

శ్లో॥ ఇతి రామ పురావృత్తం కపీనాం కథితంమయా
ఏషు రుద్రేషు సర్వేషు హనుమాన్ భద్రనాయకః.

శ్లో॥ విధానం తత్రకర్తవ్యం యత్రాస్తే హనుమత్తనుః
గోపురే హనుమన్మూర్తి శ్శిలాయాంచ ప్రతిష్ఠితా.

శ్లో॥ తత్రసర్వం ప్రకర్తవ్యం విధానం సురసత్తమ!

తా॥ ఓ శ్రీరామచంద్రమూర్తీ! ఈ కపీశ్వరులయొక్క చరిత్రము సమగ్రముగాఁ దమకు విన్నవించు కున్నాను. ఈ రుద్రరూపులగు వానరులందఱిలో హనుమంతుఁడు భద్రనాయకుఁడు ఎక్కడెక్కడ హనుమంతుని శరీరము కనఁబడుచుం డునో అక్కడక్కడ ఈవిధానము సక్రమముగాఁజేయు చుం డినచో ఫలసిద్ధి కలుగుచుండును. గోపురమునందు శిలమీఁద శ్రీహనుమంతుని స్వరూపము ప్రతిష్ఠింపఁబడి యున్నది. అచ్చట నే చెప్పిన విధానముప్రకారము చేయుఁడు.

శ్రీరామ ఉవాచ:—

శ్లో॥ కేనకేన ప్రకారేణ క్రియతే కపిపూజనం?
పతాకాః కీదృశా స్తత్ర? కతికార్యా? విహంగమ!

శ్లో॥ హవనం కతిసంఖ్యాకం? కంద్రవ్యం? కో జపోఽత్రవై?
కిందానం? కేనవిధినా? తన్మమాచక్ష్వ సువ్రత!

తా॥ కపిపూజ ఎట్లుచేయవలయును? పతాకలు ఎట్టివి యుండవలెను? ఏ యే కర్మ కలాపము చేయుచుందురు? హోమము ఎంతచేయవలయును? కావలసిన వస్తుసామగ్రియెట్టిది? ఎంతజపము అవసరము? దానము ఎట్లు నిరూపింపఁబడినది? చేయవలసిన పూజావిధానమేమి? ఈ సర్వమును చక్కఁగా వివరించి చెప్పుము. అని శ్రీరామచంద్రుండు శ్రీ గరుత్మంతుని అడిగెను.

గరుడ ఉవాచ:—

శ్లో॥ జనమారే సముత్పన్నే గ్రహేవా పత్తనేఽపివా
ప్రభవత్యేవధంనైవ మణిమంత్రపురఃక్రియా.

శ్లో॥ విధానం తత్ర కర్తవ్య మేకాదస్యాం తిథౌ నృప!
ప్రాతఃకాలే సముత్థాయ కృతశౌచో ద్విజోత్తమః

శ్లో॥ స్నాత్వా గంగాజలేపుణ్యే తిలామలక సంస్కృతః
ఏకాదశద్విజాన్ శ్రేష్ఠాన్ సోపవాసా న్నిమంత్రయేత్

శ్లో॥ జాగరస్తైస్తు కర్తవ్య స్సర్వోపస్కారసంయుతః
ఆదౌతు మండపంకృత్వా సర్వతాపి సుశోభితం

శ్లో॥ పుష్పమండపికామధ్యే మండపే స్థాపయేద్ధవన్

శ్లో॥ పంచామృతైస్తు స్నపనం రుద్రేభ్యః పరికల్పయేత్
తతస్తు కుసుమైః పూజా శతపత్రాదిభిః శుభైః.

శ్లో॥ చందనంచ సకర్పూరం దేయం రుద్రాంస్తు లేపనం
దశాంగధూప మాదద్యా ద్దీపై ర్నీరాజయే త్తతః
శ్లో॥ నైవేద్యం వివిధం దద్యా త్తాంబూలేన సుసంయుతం
ఏకాదశపతాకాస్తు పత్రై స్సుపరికల్పయేత్
శ్లో॥ యాయా యస్మై సముద్దిష్టా పతాకాచ సుశోభనా
తస్యతస్యైవ రూపంతు తస్యామేవ ప్రలేపయేత్
శ్లో॥ ఏవంకృతే విధానేచ పతాకాభిస్తు తోరణైః

తా॥ ఓ రామచంద్రమూర్తీ! గ్రామమందుఁగాని, పట్టణ మందుఁగాని, జననాశనకరమగు మారిగాని, మహామారిగాని, విషూచిగాని, మశూచిగాని, మఱియేవిధములగు మహావ్యాధు లు సంభవించినను వాటికి మందులు మూలికలు ఏవియుఁ బని చేయఁజాలవు. మణులు మంత్రములు కూడ ఏవియును లాభ ములు కావు. ఈ హనుమంతుని పూజా విధానము మాత్రము చాల మేలును కలిగించును. దాని విధానమును చెప్పెదను వినుము. ఏకాదశి తిథియందు ఉదయముననే లేచి స్నానము చేసి, ఉసిరికపప్పు తైలములతోఁ దలయంటుకొని, యోగ్యులగు పదకొండుగురు బ్రాహ్మణులను నియమించుకొని, రాత్రిమేల్కొని, జాగరములుచేసి, అన్ని యుపకరణములు సిద్ధము చేసుకొని, మండపమును పరిశుభ్రము చేసికొని, ఆ మండపములోఁ బువ్వుల మంటపమును నిర్మించుకొని, రుద్రులకొఱకుఁ బంచామృతస్నాన ము చేయించి, తామర పూవులచే అష్టోత్తరశత పూజ చేయించి, మంచిగంధము కర్పూరము అగరుదీపములు సమర్పించి, నీరా జనంబిచ్చి నైవేద్యముచేసి, తాంబూలము సమర్పింపవలయును. ఏయే దేవతకు ఏయే జండా నియమితమై యుండునో; ఆయా

దేవతకు ఆయా జండాలు మంచి పట్టుబట్టలతో పదుకొండు తయారుగ చేసికొనవలయును. మంచి మంచి తోరణములు చిత్ర విచిత్రములుగా నమర్చు కొనవలయును.

శ్లో॥ ప్రాతఃకాలేతు రాంజేంద్ర! జాగరాంతే ద్విజోత్తమ!
కృతస్నానో నదీతోయే హోమం కుర్యాత్సమాహితః
శ్లో॥ పాయసేనతు సాజ్యేన తథైవ తిలసర్పిషా
అయుతం హవనం కృత్వా పునఃపూజాం ప్రకల్పయేత్
శ్లో॥ పతాకాం హనుమద్ద్వారే తస్యైవచ నిధాపయేత్
రాజద్వారేతు సౌగ్రీవీం సౌషేణీ మారుణే న్యసేత్
శ్లో॥ నల నీల పతాకేతు శివద్వారేతు విన్యసేత్
స్మరస్య తరళీస్యాపి మైందస్య హ్యాంగదస్యచ
శ్లో॥ గ్రామా ద్బహి శ్చతుర్దిక్షు మార్గేషు స్థాపయే ద్ధియా
జలస్థానే జాంబవతో దధివక్త్రం చతుష్పథే
శ్లో॥ స్థాపయే త్పరమాం దివ్యాం మహావాద్యాదిమంగళైః
ద్వారదేశే జనానాంచ రుద్రమూర్తిం విలేఖయేత్
శ్లో॥ చిత్రితా పంచవర్ణైశ్చ గ్రామసూత్రైశ్చ వేష్టయేత్

తా॥ ఓ శ్రీరామచంద్రమూర్తీ! జాగరణ అయినపిమ్మట ఉదయముననే లేచి పరిశుభ్రుండై నదీజలములో స్నానమును జేసి సావధానమనస్సు గలవాండై నేతితో నిండిన పాయసమును నూనెతోఁగూడిన పరమాన్నమును హోమము చేయవలెను. వెయ్యిసారులు నియమముగా హోమముచేసి పిమ్మట పునః పూజ చేయవలయును.

హనుమద్ద్వారమునందు హనుమత్పతాకమును లిఖింపవలయును. రాజద్వారమునందు సుగ్రీవ పతాకమును చిత్రింపవలయును. బజారులో సుషేణపతాకమును వ్రాయవలయును.

శివద్వారమునందు నలపతాకమును నీలపతాకమును నమర్చవల యును. గ్రామమునకు వెలుపల నాలుగు దిక్కులయందును స్మరపతాకమును, తారళపతాకమును, మైందపతాకమును, అంగద పతాకమును నిర్మించవలెను. జలస్థానమునందు జాంబవత్పతాక మును, నాలుగు వీధులు కలియుచోట దధివక్త్ర పతాకమును ఏర్పరుచవలెను. ద్వారప్రదేశమున మంగళ వాద్యములతో పరమోత్కృష్టమగు రుద్రపతాకమూర్తిని మంచి రంగులు సంపాదించి విచిత్రముగా నలరునట్లు చేయవలయును.

పంచవర్ణములతోను గ్రామసూత్రములతోను గ్రామ మును అలంకరించవలెను.

శ్లో॥ ప్రత్యహం కారయే ద్విప్రాన్ భక్త్యా భోజనతర్పణం
దద్యా ద్వస్త్రాణి ఋత్విగ్భ్య స్సాలంకారాణి భూపతిః
శ్లో॥ ఛత్రాణి కరపత్రాశ్చ పాదుకాశ్చ విశేషతః
ధేనుం పయస్వినం దద్యా దాచార్యాయ సవత్సకాం
శ్లో॥ సదక్షిణాం సవస్త్రాంచ సాలంకారాం గుణాన్వితాం
ద్విజాయ మహిషీం దద్యాత్ తథైవ పృథివీపతిః
శ్లో॥ అన్యేభ్యో బ్రాహ్మణేభ్యశ్చ సప్త ధాన్యాని భూరిశః
లవణం సఘృతం దేయం తైలంచ సగుడం తథా
శ్లో॥ శయ్యాదానాని భూరీణి ఛత్రాణి వివిధానిచ
ఏత త్కృత్వా విధానంచ రాజా క్షేమ మవాప్నుయాత్
శ్లో॥ రుద్రపాత్ర నిర్దిష్టో జపే సర్వ స్సులక్షణః
అథవా హావనం శస్తం మాసన్తోక ఇతి స్ఫుటం

తా॥ ప్రతిరోజును బ్రాహ్మణాది ప్రజలను భక్తిచేతను భోజనము నొసంగి సంతృప్తి పరచుచుండవలయును. ఋత్వి క్కులకు వస్త్రములు అలంకారములు ఒసంగి సంతృప్తి కలి

గించుచుండవలయును. గొడుగులు విసనికఱ్ఱలు పాదుకలు సమ
ర్పించుచుండవలయును. ఆచార్యునకు మూడకలిగిన పాడియావు
ను ఇయ్యవలయును. వస్త్రముతోడను దక్షిణతోడను అలం
కారముతోడను కలిగిన పాడిబఱ్ఱెను ఒకబ్రాహ్మణునకు సమ
ర్పించవలయును. బ్రాహ్మణుల కందఱకు అన్ని ధాన్యములు
ఇయ్యవలయును. లవణము నెయ్యి బెల్లము శయ్యలు బంగారము
అనేకరకములుగల ఛత్రములు బ్రాహ్మణులకు సమర్పించు
చుండవలయును. ఇట్లు చేసినచో రాజు సకలసంపదలను పొంది
క్షేమముగా నుండును. ఈ విషయములో అందఱును కలసి
రుద్రజపమునైనను జేయవచ్చును. లేక మానస్తోక మను
మంత్రముచే హోమమునైనను జేయవచ్చును.

(ఇది హనుమత్పతాకాభిధానం వ్రతం)
శతకోటి రామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే
వాల్మీకీయే ఆదికావ్యే మనోహరకాండే
హనుమత్పతాకారోపణవ్రతవర్ణనమ్.

---

# శ్రీ హ ను మ న్మ స్త్ర మా హా త్మ్య ము

మైత్రేయః:

శ్లో॥ ప్రాప్తం కలియుగం ఘోరం లోభ మాయా సమాకులం
అధర్మాఽనృతసంయుక్తం దారిద్ర్య వ్యాధి పీడితం
శ్లో॥ తస్మిన్ కలియుగే ఘోరే కింసేవ్యం? శివ మిచ్ఛతాం
దస్యుప్రాయా స్సదా భూపా స్సాధవో విపదన్వితాః
శ్లో॥ పీడితాః కలిదారిద్ర్యా ద్వ్యాధిభి శ్చాపరే జనాః
కింపఠ్యం? కింప్రజప్తవ్యం? సద్యో విజయకారణం

శ్లో॥ సంసారతారకం కింవా? భోగస్వర్గాపవర్గదం
తస్మా దుత్తీర్యతే పారం సద్య ఆపత్సముద్రితః
శ్లో॥ శిష్యం మాం కృపయా వీక్ష్య వద సారం కృపానిధే!

తా॥ లోభమోహమును మాయామోహమును నిండియు న్నట్టియు, అధర్మముచేతను అనృతముచేతను వ్యాపించియు న్నట్టియు, దారిద్ర్యమువల్లను వ్యాధులవల్లను బాధింపఁబడు చున్నట్టియు, మిక్కిలి భయంకరమగు కలియుగము వచ్చు చున్నది. కలియుగములో సుఖము కోరువారు సేవింపదగిన విధానమును తెలుపుడు.

మఱియును కలియుగములో రాజులు దొంగతనముతో సంచరించుచుందురు. సాధువులు ఆపత్తులతో బాధపడుచుందురు. ఇతరులందఱును పాపముచేతను దారిద్ర్యముచేతను వ్యాధుల చేతను బాధింపఁబడుచుందురు. ఇట్టి వీరలందఱు సంసారము నుండి తరించుటకు సాధనమైనట్టియు, భోగములు అనుభ వించుటకు వీలైనట్టియు, స్వర్గమును మోక్షమును పొందుటకు అనుకూలమైనట్టియు, ఆపత్సముద్రమునుండి వెంటనే బయలు చేర్చునట్టియు, వెంటనే అన్ని కార్యములు సిద్ధించునట్లు చేయ గలిగినట్టియు, సులభముగా జపింపఁగలదియు, తేలికగాఁజదువు కొనుటకు వీలుగానుండినట్టియు, ఒక యుపాయమును శిష్యుం డనగు నాయందు వాత్సల్యముంచి దయామయుండవగు నీవు తెలుపవలయును.

పరాశరః :-

శ్లో॥ సాధు పృష్టం త్వయా వత్స! సాధూనా ముపకారకం
సద్యస్సిద్ధికరం వక్ష్యే శృణు స్వావహితో భవ.

శ్లో॥ తీర్థయాత్రా ప్రసంగేన పరం యాంతి పరాంగతిం
మాంవీక్ష్య కృపయాన్వితో వసిష్ఠో మే పితామహః

శ్లో॥ ఉపాదిదేశ విద్యాం మే సద్యస్సిద్ధివిధాయినీం
శైవే వైష్ణవ శాక్తార్క గాణాపత్యేందుసంభవాః

శ్లో॥ న శీఘ్రసిద్ధిదా మంత్రా శ్చిరకాలఫలప్రదాః
లక్ష్మీనారాయణీ విద్యా భవానీశంకరాత్మికా

శ్లో॥ సీతారామమహావిద్యా పంచవక్త్రహనూమతః
విద్యా చతుర్థా సంప్రోక్తా నృసింహానుష్టుభాఽభిధా

శ్లో॥ బ్రహ్మాస్త్రవిద్యా షష్ఠీస్యా ద్దష్టార్ణా మారుతేః పరా
సామ్రాజ్యలక్ష్మీ స్త్వపరా సద్యస్సిద్ధిమహాపదః

శ్లో॥ మహాసౌరాభిధావిద్యా దక్షిణాకాళికా పరా
చింతామణిమహావిద్యా ద్వాదశీ పరికీర్తితా

శ్లో॥ ఏతా ద్వాదశవిద్యాస్తు మంత్రసామ్రాజ్య ఈరితాః
ఏతాస్వపి మహావిద్యా శీఘ్రసిద్ధిప్రదా శ్రుణు

శ్లో॥ దక్షిణాకాళికావిద్యా పురశ్చరణతః పరం
అనాచారా దేకరాత్రా సిద్ధిదా చిరసాధనాత్

శ్లో॥ అష్టాఖ్యా మారుతేః ప్రోక్తా తతోఽప్యచిరసిద్ధిదా
పంచాశదక్షరాణ్యత్రానులోమప్రతిలోమతః

శ్లో॥ విశిష్య మాలయా జప్త్వా గురుసంతోషయత్నతః
గృహీత్వా గురుసాన్నిధ్యా ద్బగలా పరమేశ్వరీ

శ్లో॥ ప్రజప్య సిద్ధిదా ప్రోక్తా విద్యా బ్రహ్మాస్త్రసంజ్ఞికా
అనుష్టుపాఖ్యం నృహరేః తతోఽప్యచిరసిద్ధిదా

శ్లో॥ తతోపి పంచవక్త్రస్య మారుతే ర్జగదీశితుః
విద్యాసిద్ధికరీ శీఘ్రం గుర్వనుగ్రహతో మునే!

తా॥ ఓ మైత్రేయా! నీవు సాధువులకు అందఱకు మేలుకలుగఁజేయుటకుఁగాను అడిగితివి. నేను మిక్కిలి సంతో

షించినాను. ఏ జపముచేసినయెడల వెంటనే కార్యసిద్ధికలుగునో? ఆ జపవిధానమును చెప్పుచున్నాను వినుము. ఈ విషయమునే ఏదోసందర్భములో వశిష్ఠమహాముని తీర్థయాత్రాప్రసంగము నందు నాయందు దయగలిగి సద్యస్సిద్ధిప్రద మైనటువంటి సద్విద్యను నాకు ఉపదేశముచేసెను. ఆ విద్యను నీకు ఉపదేశము చేయుచున్నాను వినుము. శివమంత్రములుగాని, విష్ణుమంత్ర ములుగాని. శక్తిమంత్రములుగాని, సూర్యమంత్రములుగాని, గణపతిమంత్రములుగాని, వెంటనే ఫలములీయ లేవు. 1. లక్ష్మీ నారాయణమంత్రము, 2. గౌరీశంకరమంత్రము, 3. సీతారామ మహావిద్యామంత్రము. 4. పంచవక్త్రహనుమన్మంత్రము, 5. నరసింహామంత్రము, 6. బ్రహ్మాస్త్రమంత్రము, 7. అష్టాక్షరీ హనుమన్మంత్రము, 8. సామ్రాజ్య లక్ష్మీమంత్రము, 9. ఆప దుద్ధారకమంత్రము, 10. మహాసౌరమంత్రము, 11. దక్షిణ కాళికామంత్రము, 12. చింతామణిమంత్రము. ఇవి 12 మహా మంత్రములు మంత్రసామ్రాజ్యమునందు చెప్పఁబడినవి. వీనిలో దక్షిణకాళికావిద్య శీఘ్రఫలసిద్ధిని కలిగించును. అనాచార తంతు వల్ల ఒకరాత్రిలోనే సిద్ధించును. అష్టాక్షరీ హనుమన్మంత్రము కూడ వెంటనే ఫలసిద్ధిని గలిగించును. బ్రహ్మాస్త్రవిద్య లేక బగళామంత్రమును నృసింహామంత్రమును శీఘ్రఫలసిద్ధిని కలుగ జేయును. వీనిలో నన్నింటియందును పంచవక్త్రహనుమన్మంత్ర ము మిక్కిలి వెంటనే శీఘ్రఫలసిద్ధిని కలుగఁజేయును. సామాన్య ముగా ఈ మంత్రములలో దేనినైనను 108 పర్యాయములు జపించుచుండవలయును. ఈ మంత్రములకు గుర్వనుగ్రహము మిక్కిలి మంచిది.

శ్లో॥ చులుకోదకవ త్పీతా స్సాగరా స్సప్త యోగినా
అగస్త్యేన పురా జప్య విద్యా మేనాం హనూమతః

శ్లో॥ పార్థస్య జయసామర్థ్యం భీమస్యారినిబర్హణం
అస్యాఏవ ప్రభావేన సత్యంసత్యం వదామ్యహం

శ్లో॥ శ్రీరామానుగ్రహా దేనాం విద్యాం ప్రాప్య విభీషణః
అచలాం శ్రియ మాప్నోతి లంకారాజ్యేన సర్వదా

శ్లో॥ అనయా సదృశీ విద్యా నాస్తి సత్యేన తే శపే
ప్రీత్యర్థం నప్రశంసాతు క్రియతే సత్యమేవహి

శ్లో॥ విజయో బహుసమ్మానం రాజవశ్య మనుత్తమం
స్త్రీవశ్యం జనవశ్యంచ మహాలక్ష్మీ రచంచలా

శ్లో॥ శత్రూణాం జయమాప్నో త్యనుగ్రహో నిగ్రహోఽపివా
వాక్సిద్ధిః పుత్రసంపత్తి ర్భోగా అష్టావిధా అపి

శ్లో॥ యద్య దిష్టతమం లోకే త త్సిధ్యతి నసంశయః
గురుసంతోషత స్సిద్ది శ్శీఘ్రమేవ భవిష్యతి

తా॥ ఈ పంచవక్త్ర హనుమన్మంత్ర ప్రభావముచేతనే అగస్త్యముని సప్తసముద్రము లందలి నీటిని పుక్కిటఁబట్ట గలిగినాఁడు. అర్జునుఁడు లోకమంతయును జయించినాఁడు. భీముఁడు శత్రుసంహారమును చేసినాఁడు. ఇందులో సంశయము ఏమాత్రమును లేదు. శ్రీరాముని అనుగ్రహమువల్ల విభీషణుఁడు ఈ విద్యను ఉపదేశమునొంది లంకారాజ్యములో శాశ్వతమగు లక్ష్మిని పొందినాఁడు. ఈ పంచవక్త్ర హనుమన్మంత్రముతో సమానమగు మంత్రము లేనే లేదు. ఈ విషయము అభిమానము చేతఁగాని, ప్రశంసకొఱకుఁగాని చెప్పినది కాదు. ఇది యంత యును సత్యము, యథార్థము. ఈ పంచవక్త్ర హనుమన్మంత్రము వల్ల విజయము కలుగును. సమ్మానము కలుగును. రాజవశ్యము

కలుగును. స్త్రీలుయోగ్యురాండ్రై మేలు లొసంగుచుందురు. జనవశ్యము కలుగును. శత్రుజయము కలుగును. అనుగ్రహము గాని ఆగ్రహముగాని యేదియైనను తన యిచ్ఛవచ్చినట్లు కలుగు చుండును. తాను యన్నది అన్నట్లుగా జరుగుచుండును. పుత్ర సంపద మొదలగు అన్ని మేలులు కలుగుచుండును. తనకు ఏ కోరిక కలిగితే ఆకోరిక తప్పక సిద్ధించుచుండును. గురువు సంతోషించిననే శిష్యునకు ఫలసిద్ధి లభించుచుండును.

శ్లో॥ ఏకాక్షర ముదాహారం యో గురుం నాభిమన్యతే
స శ్వయోనిశతం గత్వా చండాలత్వ మవాప్నుయాత్

శ్లో॥ గురుం హుంకృత్య తుంకృత్య ఉల్లంఘ్యాజ్ఞాం గురోరపి
అరణ్యే నిర్జలే దేశే భవతి బ్రహ్మరాక్షసః

శ్లో॥ దరిద్రో గురుశుశ్రూషాం వత్సరత్రయ మాచరేత్
విద్యాం లబ్ధ్వా మహాసిద్ధి మవాప్నోతి నసంశయః

శ్లో॥ యత్కించి ద్ధనధాన్యాది వస్త్రాలంకరణాదిభిః
కళత్రం ప్రీణయిత్వా తం సంతోష్య శ్రీగురుం విభుం

శ్లో॥ గురుత్వా త్సిద్ధి మాప్నోతి నాన్యథా వ్రతకోటిభిః
గురువాక్యేన మంత్రాణాం పురశ్చర్యాదినాపిచ

శ్లో॥ సంతోషః జాయతే తస్మా దిత్యాహ భగవాన్ శివః

తా॥ ఒక్క యక్షరము నేర్పినను వానిని గురువుగా భావింపవలయును గాని వానిని అవమానము చేయరాదు. అవమానము చేసిన యెడల నూరు జన్మలవఱకును కుక్క జన్మ మెత్తును. చండాలుండగును.

గురువును ధిక్కరించినను గురువుయొక్క ఆజ్ఞను వినకున్నను అడవిలో నిర్జల ప్రదేశములో బ్రహ్మరాక్షసియై తిరుగుచుండును. దరిద్రుడు యైనట్లైతే మూడు సంవత్సరములు

గురుశుశ్రూష చేసినచో కార్యఫలసిద్ధి తప్పక కలుగును. ఇందుకు ఏమాత్రమును సంశయము లేదు. తనకు ఉన్నదానినిబట్టి ధనము ధాన్యములు వస్త్రాలంకరణములు గురుభార్యకు సమర్పించుచుండవలెను. ఇట్లు గురుపూజవల్ల ఫలము లభించినట్లు కోట్ల కొలది వ్రతములు చేసినను ఫలము సిద్ధించుట దుర్లభము. మంత్రములకు గురువాక్యములవల్లను, పురశ్చర్యలవల్లను ఫలము కలుగుచుండును. ఇది సాక్షాత్తు శంకరభగవానులు చెప్పినారు.

శ్లో॥ మంత్రోపదేశసమయే ప్రాంజలి శ్శిష్యకో మునే!
స్వామిన్! గురో! మహాప్రాజ్ఞ! యావజ్జీవం మహావిభో!

శ్లో॥ భవచ్చరణకైంకర్యం కరోమ్యాజ్ఞాం కురుష్వ మే
ఇతి స్వభావయోచ్చార్యం ప్రదాస్యాం గురుదక్షిణాం

శ్లో॥ వ్రతసిద్ధి మవాప్నోతి నాన్యథా వ్రతకోటిభిః
మంత్రోపదేశసమయే గురుః శ్శిష్యప్రదం మనుం

శ్లో॥ అష్టోత్తరశతంచాపి త్వష్టావింశతిమేవవా
జప్త్వా శిష్యస్య శిరసి హస్తం నిక్షిప్య దక్షిణం

శ్లో॥ దక్షిణే కర్ణమూలేతు మూలమంత్రం వద న్మునే!
విద్యాసిద్ధ్యైచ మంత్రాణాం జపంకుర్యా త్ప్రయత్నతః

శ్లో॥ అష్టోత్తరశతావృత్త్యా జపే త్సంశుద్ధమానసః
సర్వాసామపి విద్యానాం సాధారణ ఇతిక్రమః

తా॥ మంత్రోపదేశ సమయములో అంజలి ధరించి శిష్యుండు ఓమునీ! ఓగురూ! ఓస్వామీ! ఓమహాప్రాజ్ఞా! ఓ మహావిభూ! నేను యావజ్జీవమును తమ పాదసేవ చేయుచుందును. తమరు చెప్పినప్రకారము నడుచుకొనుచుందును. తమరు అనుజ్ఞ యొసంగుడు. అని ప్రార్థించుచుం దన శక్తికొలది

గురుదక్షిణ సమర్పింపవలయును. ఇట్లు చేసినచో ఫలసిద్ధి కలుగుచుండును. లేదేని దుర్లభము. మంత్రోపదేశ సమయములో గురువు శిష్యున కుపదేశముచేసిన మంత్రమును, 108 పర్యాయములుగాని, 28 పర్యాయములుగాని. జపించుచు శిష్యుని శిరముమీద తన కుడిచేయి యుంచి కుడిచెవిలో మూలమంత్రమును ఉపదేశింపవలయును. ఈవిద్య సిద్ధించుటకు 108 పర్యాయములైనను సావధానముగా జపించుచుండవలెను. పరిశుద్ధమనము కలిగి యుండవలయును. అన్ని విద్యలకును ఇదియే విధానము.

శ్లో॥ విశేషేణ మహావిద్యా పంచవక్త్రిహానూమతః
గురుసంతోషతో లబ్ధ్వా సామ్రాజ్యం ప్రదదాతి హి
శ్లో॥ సహస్రశిరసా సాక్షా చ్ఛేషేనాపి మహామునే!
నశక్యతే తు మాహాత్మ్యం వక్తుం వర్షశతైరపి

తా॥ అన్ని మంత్రముల కన్నను పంచవక్త్రమహామంత్రము మిక్కిలి విశేషము. గురువును సంతోషపరచిన యెడల సామ్రాజ్యపదము లభించును. ఈ మంత్రముయొక్క ప్రభావమును వేయి శిరస్సులు కలిగిన ఆదిశేషువుకూడ నూరు సంవత్సరములు ప్రయాసపడినను చెప్పుటకు సమర్థుడుకాడు.

శ్లో॥ అథాత స్సంప్రవక్ష్యామి మంత్రసాధన ముత్తమం
యస్య విజ్ఞానమాత్రేణ భవే త్సాక్షా ద్దివస్పతిః
శ్లో॥ కృతే త్వేకసహస్రంస్యా త్త్రేతాయాం త్రిసహస్రకం
ద్వాపరే పంచసాహస్రం ప్రజపే దయుతం కలౌ
శ్లో॥ పర్వతాగ్రే నదీతీరే శ్రీగురో స్సన్నిధౌ తు వా
గోష్ఠే బృందావనేవాపి వదీతీరే విశేషతః

శ్లో॥ గురో రనుజ్ఞయా మంత్రం ప్రజపే ద్విజితేంద్రియః
సిద్ధేనానేన మంత్రేణ కామ్యకర్మాణి సాధయేత్
శ్లో॥ పూర్ణానుగ్రహాత్తో లబ్ధ్వా శ్రీగురో ర్దేవరూపిణః
అష్టోత్తరశతం జప్త్వా ద్వాదశాఽహం జితేంద్రియః
శ్లో॥ సిద్ధిం దదాతి మహతీం పురశ్చర్యాక్రియోద్భవం
అథ కామ్యాని కర్మాణి ప్రవక్ష్యామి సమాసతః
శ్లో॥ ఇమాం శ్రీహనుమద్విద్యా మష్టావింశతివా సదా
ప్రజపే న్నిశి సాయంవా మధ్యాహ్నే ప్రాతరేవవా
శ్లో॥ స ఆపత్సంఘనిర్ముక్తః సర్వదుష్కృతవర్జితః
విజయీ సతతం భూత్వా రాజవిద్వత్సభాసుచ
శ్లో॥ సంస్తంభయతి శత్రూన్వై సతతం దుస్తరానపి
దీర్ఘాయుష్యం సదారోగ్యం అచలాం శ్రియ ముత్తమాం
శ్లో॥ ప్రాప్నోతి సుమహాత్తేజో దుర్లభం పరమం యశః
సర్వాభీష్ట మవాప్నోతి త్రిమాసానంతరం ధ్రువం

తా॥ తిరిగి ఇంకొక మంత్రవిశేషమును విశదీకరించు చున్నాను. ఈ మంత్రవిజ్ఞానము కలిగిన వెంటనే దేవేంద్రవైభవ మును పొందుచున్నాడు. ఈమంత్రము కృతయుగములో ఒక వేయి జపము చేసినయెడల సిద్ధికలుగును. త్రేతాయుగములో మూడువేలు జపము చేసినయెడల సిద్ధికలుగును. ద్వాపరయుగ ములో అయిదువేలు జపముచేసినయెడల సిద్ధికలుగును. కలి యుగములో పదివేలు జపముచేసినయెడల సిద్ధికలుగును.

పర్వతముమీదఁగాని, నదీతీరమునందుఁగాని, ఆవులమంద యందుఁగాని, తులసీవనమందుఁగాని, గురుసన్నిధినిగాని, జపము చేయవలయును. నదీతీరమునందు గురుసన్నిధిని విశేష ముగా ఫలసిద్ధికలుగును. జితేంద్రియుండై దేవస్వరూపుఁడగు

గురువుసన్నిధిని రోజునకు నూటఎనిమిదిపర్యాయములు చొప్పున పన్నిండురోజులు జపముచేసినయెడల మిక్కిలి గొప్ప ఫలసిద్ధి కలుగును. పురశ్చర్య చేసికొనవలయును. ఈ మంత్రజపమువల్ల అన్నికోరికలు నెరవేరును. ఈ హనుమన్మహామంత్రమును రాత్రి యందుఁగాని, సాయంకాలమునందుఁగాని, మధ్యాహ్నమునందుఁ గాని, ఉదయమునందుఁగాని ఇరువదియెనిమిది పర్యాయములు చొప్పున ఇరువదిఎనిమిదిరోజులు మంచినియమముతో జపము చేసినయెడల మంత్రసిద్ధి కలుగును. అన్నిఆపదలు నివారణము లగును. అన్నిపాపములు నశించును. రాజసభలలోను పండిత సభలలోను ఎక్కువ జయము కలుగును. ఎటువంటి ఘోరశత్రు వులుకూడ విరోధమును మాని ప్రాణమిత్రులగుదురు. దీర్ఘాయు ర్దాయము కలుగును. ఎల్లప్పుడు ఆరోగ్యము కలుగుచుండును. స్థిరమైనట్టియు, మహోన్నతమయినట్టియు సంపద కలుగును. మిక్కిలి మంచికీర్తిని బలమును పొందును. నిశ్చయముగా మూఁడుమాసములలోపల అన్నికోరికలును తప్పక నెరవేరును.

శ్లో॥ మందవారే జపే న్మంత్రి మష్టోత్తరశతం బుధః
హునే ద్ద్వాదశభాగేన మాజ్యం సుశోభనం

శ్లో॥ అపూపాన్ వటుకాన్ పంచ ప్రీణయే ద్భోజనేనచ
మణ్మాసా త్తస్య లభతే మహాలక్ష్మీ రచంచలా

శ్లో॥ మరణాంతం వశీకుర్యా ద్రాజస్త్రీపురుషాదికం
విజిత్య సకలాన్ శత్రూన్ లభే త్సర్వమనోరథాన్

శ్లో॥ కారాగృహే జపే న్మంత్రం త్రిదినా న్ముచ్యతే జనః
త్రిదినా న్నిగళా న్ముక్తః భవిష్యతి నసంశయః

శ్లో॥ మహారాజభయే ప్రాణసంకటే దుర్గమేపిచ
అష్టోత్తరశతం జప్త్వా గచ్ఛేద్భూపస్య సన్నిధిం

శ్లో॥ దాసవత్సతతం రాజా తద్వశో భవతి ధ్రువం
వైశాఖే మాసి కృష్ణాయాం దశమే మందసంయుతే
శ్లో॥ పూర్వాప్రోష్ఠపదాయుక్తా తథా వైధృతిసంయుతా
తద్దినం హనుమజ్జన్మ దివసం మునిపుంగవ!
శ్లో॥ తస్యాం సంపూజ్య రామస్య ప్రియదూతం మహాబలం
గురుం సంపూజ్య యత్నేన వస్త్రాలంకరణాదిభిః
శ్లో॥ శతమష్టోత్తరం జప్త్వా విద్యా మేనాం హనూమతః
హునే ద్ద్వాదశధా వహ్నౌ గవ్య మాజ్యం సుశోభనం
శ్లో॥ సద్యస్సిద్ధా మహావిద్యా భవతీయం నసంశయః
జప్త్వాయత మిమాం విద్యాం ఖాదిరై రయుతం హునేత్
శ్లో॥ శతూణాం సుమహా దారిద్ర్య మపి సద్యో దహే ద్ధ్రువం.

తా॥ శనివారమురోజున ఈ మహా హనుమన్మంత్రమును నూటయెనిమిది పర్యాయములు జపముచేసి పన్నిండు పర్యాయములు ఆవునేతితో హోమముచేసి అయిదుగురు బ్రహ్మచారులను అపూపములతో భోజనముచేఁ దృప్తి చేసినయెడల ఆరుమాసములలో శాశ్వతమైనట్టి మహాసంపద కలుగును. యావజ్జీవము రాజులు స్త్రీలు పురుషులు అందరును తన మేలునే కోరుచుండువా రగుదురు. శత్రువులు నశింతురు. అన్ని కోరికలు నెఱవేరును.

ఖైదులో నుండువాఁడు ఈ హనుమన్మంత్రమునుమూఁడు రోజులు జపము చేసినయెడల ఆ సంకెలనుండి విడిపింపఁబడును. రాజశాసనమువల్లగాని ప్రాణాపాయ స్థితియందుఁగాని ఎట్టి దుర్గమమగు ఆపత్తుయం దైనను నూటఎనిమిది పర్యాయములు జపము చేసినయెడల రాజు దాసుఁడువలె వశ్యుఁడై తన కష్టములు నివారింపఁజేయును.

వైశాఖమాసములో కృష్ణపక్షమునందు దశమిరోజున శనివారమునందు పూర్వాభాద్ర నక్షత్రమున, వైధృతి మహా యోగమునందు హనుమంతుడు పుట్టినరోజు గాన ఆరోజున నూటయెనిమిది పర్యాయములు మంత్రజపము చేసి వస్త్రాలంకారములచేత గురువును పూజించి ఆవునేతితో పదిరెండు పర్యాయములు హోమము చేసిన యెడల వెంటనే ఫలసిద్ధి కలుగును. ఈ మంత్రము మిక్కిలి పవిత్రమయినది. సద్యస్సిద్ధిని కలిగించునది. ఇందుకు సంశయము లేదు.

చంద్ర సమిధలతో వెయ్యి పర్యాయములు హోమము చేసిన యెడల శతృరాష్ట్రము వెంటనే వశ్యమగును.

శ్లో॥ లంకాయా దాహకం ధ్యాయే త్ప్రజప్త్వాఽయుత మాదరాత్
పాయసేన పునే దగ్నౌ సహస్రం త్రిమధుప్లుతం

శ్లో॥ తస్మిన్నేవ దినే శతృరాష్ట్రం సందహ్యతేఽగ్నినా
లక్ష్మణప్రాణదాతారం ద్రోణశైలస్థితౌపధైః

శ్లో॥ ధ్యాత్వాఽయుత మిమాం జప్త్వా దీర్ఘమాయుష్య మశ్నుతే
రాత్రౌ దివాచ ప్రజపే దష్టావింశతిథా సదా

శ్లో॥ మాసేమాసే మహాయోగీ స్వప్నే తస్యాంజనాసుతం
దదాతి దర్శనం స్వస్య గురు సుష్టో భవే ద్యది

శ్లో॥ ప్రసన్నే రామదూతే స్యాత్ కిమసాధ్యం జగత్త్రయే ?
బ్రాహ్మేముహూర్తే చోత్థాయ స్మృత్వా శ్రీగురు మాదరాత్

శ్లో॥ అష్టావింశతిథా విద్యాం జపే త్కాలోచ్ఛితే శతం
లభతే మహతీం కీర్తి మచలాం శ్రియ ముత్తమాం

శ్లో॥ క్షేమ మాయుష్య మారోగ్యం సర్వాన్ కామాన్ సమశ్నుతే
శత మష్టోత్తరం యస్తు జపే ద్బ్రాహ్మే ముహూర్తకే

శ్లో॥ తస్య శ్రీహనుమాన్ స్వప్నే పక్షేపక్షేహి దృశ్యతే
ధనధాన్యసమాయుక్తో గజ వాజి రథాదులః

శ్లో॥ విజయం రాజసమ్మానం సౌభాగ్యం కాంతి ముత్తమాం
ఏకవర్షే త్రిభిర్వర్షై రథవా జాయతే ధ్రువం

తా॥ లంకను దహించిన శ్రీహనుమంతుని వేయిపర్యాయములు మంచి నియమముతో జపించి ఆవునేయి, తేనె, పంచదారలతో మిశ్రముచేసి అగ్నిహోత్రమునందు హోమము చేయవలయును. వెంటనే శత్రురాష్ట్రములన్నియును దన ప్రయత్నము లేకయే దహింపఁబడును.

ద్రోణపర్వతమునుండి మందులుతెచ్చి లక్ష్మణుని ప్రాణమును నిలిపిన హనుమంతుని వేయిపర్యాయములు జపించినచో దీర్ఘాయుష్మంతుఁడగును.

రాత్రి జపించినను, పగలు జపించినను 28 ఇరువదియెనిమిది పర్యాయములు చొప్పున జపించుచుండవలయును.

ఈ ప్రకారము ప్రతిమాసమును జపించుచున్న యెడల గురువు సంతోషించుచుండును. శ్రీహనుమంతుఁడు స్వప్నమున దర్శనము నొసంగుచుండును. శ్రీహనుమంతుఁడు ప్రసన్నమయిన యెడల ఈ మూఁడులోకములందును స్వాధీనముకాని వస్తువే యుండదు. ఉదయమున లేచి కాలకృత్యములు నెరవేర్చుకొని గురువును స్మరించుకొని యే విధములయిన ఆటంకములు లేని సమయములో నూరుపర్యాయములుగాని, ఇరువదియెనిమిది పర్యాయములుగాని హనుమన్మంత్రమును జపించుచున్న యెడల మిక్కిలి యెక్కువకీర్తిని స్థిరమయిన లక్ష్మిని పొందఁగలరు. క్షేమము

కలుగును. ఆయుస్సు పెరుగును. ఆరోగ్యము కలుగును. శ్రీ హనుమంతుని ఉదయముననే జపించుచుండువారికి ఎల్లప్పుడును తప్పక స్వామివారు స్వప్నములో కనిపించుచుందురు. ధనధాన్యములు సమృద్ధిగా నుండును. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మొదలగు సంపదలు కలుగుచుండును. సర్వప్రదేశములలోను విజయముకల్గును. రాజసమ్మానము, సౌభాగ్యము, మంచి తేజస్సు కలుగును.

ఒక సంవత్సరములోనే సామాన్యముగా అన్ని మేలులు కలుగును. లేదా మూఁడుసంవత్సరములలో దప్పక యీ యన్ని సంపదలు నిశ్చయముగా గలుగును. సందేహము లేదు.

శ్లో॥ శత్రుసంఘాన్ వినిర్జిత్య ఆంజనేయ ప్రసాదతః
దృష్ట్వా విషం నాశయతి జ్వరాంశ్చాతుర్థికానపి

శ్లో॥ దృష్ట్వైవాఽ కర్షయే న్నారీః నృపకన్యాశ్చ దుర్లభాః
మాసద్వయపరం భూపాన్ దృష్ట్వైవాఽకర్ష[illegible]

శ్లో॥ వత్సరత్రయత స్తస్య ఖేచర[illegible]జాయతే
జరామరణశూన్యేన సోఽమితా[illegible]వం

శ్లో॥ సంశయం మాకురుష్వా[illegible]సంశయాత్మా వినశ్యతి

తా॥ శ్రీ ఆంజనేయుని అనుగ్రహమువల్ల శత్రువుల నెల్లరను జయించి మంచి సుఖమును పొందును. ఈ హనుమదుపాసకుని సందర్శనమువల్ల విషము జారిపోవును. నాలుగు రకములగు సంధి సన్నిపాత జ్వరములు నివారణములగును. ఈతనిని జూచిన తోడనే జనులు స్త్రీపురుషులు యావన్మంది సేవకు లగుదురు, రాచకన్యలు కూడ సేవకురాండ్ర గుదురు. రెండు మాసములు

జపించుచో చూచినంతనే రాజులు భృత్యులగుదురు. మంత్రిమును మూఁడు సంవత్సరములు సేవించుచుండిన యెడల ఆకాశ సంచారము కలిగి దేవత్వమును పొందును. ముసలితనము రానే రాదు. మరణముకూడ సాధారణముగా రాదనియే చెప్పవచ్చును. ఇందుకు ఎవ్వరును ఎంతమాత్రమును సంశయింపరాదు. ఎవరైనను ఇట్లు జరుగుట దుర్లభమని నమ్మక సంశయముతో నున్న యెడల వారు తప్పక కష్టములకు గుఱియగుదురు.

శ్లో॥ వైశాఖే మా స్యమావాస్యాం దినే బ్రహ్మాదిభి స్సురైః
సూర్యం రాహుం జిఘృక్షంతం దృష్ట్వా శక్రేణ వజ్రిణా

శ్లో॥ వజ్రప్రహారనిహతో హను రేకశిలాతలే
స్వపుత్త్రం పతిత్తం దృష్ట్వా వాయుః కోపసమన్వితః

శ్లో॥ న సంచచార తేనైవ మృతప్రాయ మభూ జ్జగత్
తదాగత్య హర బ్రహ్మ శక్రాద్యై రమరాధిపైః

శ్లో॥ వరా స్సహస్రశో దత్తా స్తేనాసౌ వాయునందనః
అవర్ధత మహావీర స్సర్వకామసమన్వితః

శ్లో॥ తస్మా దమాదినే దేవం సమభ్య ర్చ్యాఽంజనాసుతం
ఫలపుష్పోపహారైశ్చ విజయాఖ్యం జగత్పతిం

శ్లో॥ అష్టోత్తరశతం జప్త్వా హునే ద్ద్వాదశధా ఘృతం
గురుం సంపూజ్య యత్నేన దత్వాచ గురుదక్షిణాం

శ్లో॥ మంత్రిసిద్ధి మవాప్నోతి నాత్రికార్యా విచక్షణా
మార్గశీర్షే త్రియోదశ్యాం శుక్లాయాం జనకాత్మజా

శ్లో॥ దృష్ట్వా దేవీ జగన్మాతా మహావీరేణ ధీమతా
తదా తయా వరోదత్తో యస్త్వా మభ్యర్చయిష్యతి

శ్లో॥ దుఃఖసంఘనివృత్తిశ్చ సంపదాది మనోరథాః
అవాప్నోతి నసందేహ ఇతి దేవ్యనుశాసనం.

శ్లో॥ తస్మాత్తస్మిన్ దినేఽభ్యర్చ్య వాయుపుత్త్రం జగత్ప్రభుం
గురో రనుజ్ఞయా మంత్రం త్రిశతం ప్రజపేత్ సుధీః
శ్లో॥ సిద్ధ్యత్యేవ హి మంత్రోఽయం నాత్ర కార్యా విచారణా.

తా॥ వైశాఖామావాస్యాదివసమున సూర్యగ్రహణ సమయమందు సూర్యుని మ్రింగుటకు వచ్చుచున్న ఆంజనేయుని బ్రహ్మాదిదేవతలు కనుగొనుచు మిక్కిలి చింతించుచుండిరి. ఇట్లుండ దేవేంద్రుఁడు వజ్రాయుధముచేత హనుమంతుని హనువు విరుగునట్లు కొట్టెను. ఆ దెబ్బతగిలి హనుమంతుఁడు పడిపోయెను. కుమారుఁడు పడిపోవుటచే వాయుదేవుఁడు మిక్కిలి విచారపడి కోపించి తాను సంచలనమునాని స్తంభించియుండెను. ఇట్లు వాయువు స్తంభించినంతనే లోకమంతయును మృతప్రాయమైయున్నది. అప్పుడు హరుఁడు, బ్రహ్మ, దేవేంద్రుఁడు మొదలగు దేవతలందఱును వచ్చి శ్రీహనుమంతుని బ్రతికింపఁజేసి అనేకవరములను సమర్పించిరి. ఆ వరప్రభావమువల్ల శ్రీహనుమంతుఁడు మూర్ఛతేరి మిక్కిలి సంతోషముతో వర్ధిలుచుండెను.

కావున వైశాఖ అమావాస్యయందు శ్రీహనుమంతుని ఫలములచేతను పుష్పములచేతను విజయుఁడను పేరుగలిగినట్టియును జగత్తునకు ప్రభువుఅయినట్టియును శ్రీహనుమన్మంత్రముచేత జపించి, నూటయెనిమిదిపర్యాయములు నియమజపము చేసి పన్నిండుపర్యాయములు ఆవునేతితో హోమము చేయవలయును.

గురువును పూజించి గురుదక్షిణ సమర్పించి హనుమజ్జపముచేసినయెడల ఫలసిద్ధి తప్పక కలుగును.

ఇందువిషయములో ఎంతమాత్రమును సంశయింపఁబని లేదు. మార్గశిరమాసములో శుక్లపక్షమందు త్రయోదశి రోజున శ్రీ హనుమంతుఁడు లోకమాత యగు సీతాదేవిని సందర్శించియుండెను. ఆతల్లి "యీరోజున నిన్ను ఎవరుపూజింతురో, ఎవరుధ్యానింతురో, ఎవరుజపింతురో, వారు దుఃఖములనుపొందరు. వారికి అన్నికోరికలు సిద్ధించును. ఇందుకు సందియము లేదని వరమిచ్చియున్నది." అందువల్ల జగత్ప్రభువగు శ్రీ హనుమంతుని మార్గశిరశుక్లత్రయోదశియందు జపించి గురువు యొక్క అనుగ్రహమును పొందినచో మూఁడువందలు పర్యాయములు జపించినపిమ్మట మంత్రసిద్ధి తప్పక కలుగును. ఈ విషయములో ఎవరును ఎంతమాత్రమును సంశయింప నక్కర లేదు.

శ్లో॥ నిత్యం ద్వివారం ప్రజపే దష్టావింశతి మాదరాత్
రాత్రౌ దివాచ పురుషో మహాభాగ్యవిధి ర్భవేత్

శ్లో॥ మాసార్థే మండలార్థేవా స్వప్నే దేవం ప్రపశ్యతి
అసాధ్యమపి దేవానాం ద్వీపాంతరగతంచ యత్

శ్లో॥ లభతే సకలాభీష్టం క్షిప్రమేవ నసంశయః
అష్టోత్తరశతం జప్త్వా రణం గచ్ఛతి యః పుమాన్

శ్లో॥ విచేతనాన్ విమూఢాంశ్చ శస్త్రాస్త్రక్షతివర్జితాన్
మాయాసైన్యపరిత్రస్తాన్ కాందిశీకాన్ హతాశినః

శ్లో॥ విజిత్య శత్రుసంఘాతాన్ ప్రాప్నోతి విజయం ధ్రువం

తా॥ ప్రతిరోజును ఉదయమును సాయంకాలమును ఇరువది యెనిమిది పర్యాయములు చొప్పున రాత్రింబవళ్ళు మంచి నియమముతో జపించుచుండినచో ఎక్కువభాగ్యవంతులగుదురు. పదియేనురోజులలోగాని ఇరువదిరోజులలోగాని జపముచేయుచున్నవారు స్వప్నమునందు శ్రీహనుమంతుని సందర్శింతురు.

దేవతలకు సాధ్యముకాని పని కూడ తప్పక సాధ్యమగును. ద్వీపాంతరవాసమునొందిన కష్టముకూడ నివారణమయి స్వదేశ వాసము లభించును. ఇది అది యని చెప్ప నవసరము లేదు. ఎవరు ఏకోరిక కోరుదురో వారికి ఆ కోరిక తప్పక ఫలించి తీరును. సంశయము లేదు.

నూటయెనిమిది పర్యాయములు జపముచేసి యుద్ధము చేయుటకు వెళ్లినచో మూర్ఖులగు శత్రువులనుగాని, మొండి విరోధులనుగాని, శస్త్రములుగాని, అస్త్రములుగాని నేర్చిని మొరకువారలనుగాని, మాయాసేనలుగలవారలనుగాని, పారిపోవువారినిగాని, నిరాశ చెందినవారినిగాని, యెట్టి దుష్టులనుగాని, జయించి సర్వత్రా విజయమును పొందింపఁజేయును.

శ్లో॥ గ్రహణే స్పర్శమారభ్య మోక్షకాలాంత మాదరాత్
జపే దముం మహామంత్రం తద్దశాంశం హునే ద్ఘృతం

శ్లో॥ తర్పయే త్తద్దశాంశేన వటూన్ ద్వాదశ భోజయేత్
సిద్ధవిద్యో భవే ల్లక్ష్మీః కీర్తి ర్భాగ్యనిధి స్సదా

శ్లో॥ కిము క్తేనాథ బహునా విద్యేయం సర్వసిద్ధిదా
సతతం నియతో యస్తు ప్రజపే న్మంత్ర ముత్తమం

శ్లో॥ అనేనైవ శరీరేణ దివ్యాన్ భోగాన్ అవాప్నుయాత్
జీవన్ముక్తో నసందేహ స్సత్యంసత్యం వదామ్యహం

శ్లో॥ అష్టావింశతిధా యస్తు నిత్యం నియమవాన్ జపేత్
స ఆపత్సాగరా త్సర్వా త్సము త్తీర్ణో మహీతలే

శ్లో॥ విజిత్య సకలాన్ శత్రూన్ పరాం లక్ష్మీ మచంచలాం
దీర్ఘ మాయుష్య మారోగ్యం పుత్రాన్ పౌత్రా ననుత్తమాన్

శ్లో॥ జనవశ్యం రాజవశ్యం నారీ వశ్యం తథైవచ
వాక్సిద్ధిం సకలాన్ కామా నాప్నో త్యత్ర నసంశయః

శ్లో॥ అష్టోత్తరశతం నిత్యం ప్రజపే న్నియమేన యః
దీర్ఘ మాయుష్య మారోగ్యం ధనధాన్యకులం శ్రియం

శ్లో॥ అచలాన్ పుత్రపౌత్రాంశ్చ సౌభాగ్య మమలం శుభం
అవాప్య సకలాన్ శత్రూన్ జిత్వాహీన్ గరుడోయథా

శ్లో॥ మహతీం సిద్ధి మాప్నోతి క్షేమం సర్వత్ర విందతి
అనేనైవ శరీరేణ వత్సరత్రయతః పరం

శ్లో॥ ఘటికా త్పాదుకాద్యష్టసిద్ధీనాం నాయకో భవేత్
ద్రవ్యాపేక్షా యదా తస్య సిద్ధిస్సిద్ధిస్తదా సదా

తా॥ సూర్య గ్రహణముగాని, చంద్ర గ్రహణముగాని కలిగినప్పుడు గ్రహణముపట్టినది మొదలు, మోక్షము అగువఱకు మంచినియమముతో ఈ హనుమన్మంత్రమును జపించవలయును. జపముచేసిన సంఖ్యలో పదవవంతు లెక్కప్రకారము ఆవు నేతితో హోమము చేయవలయును. హోమముచేసిన సంఖ్యలో పదియవ వంతు లెక్కప్రకారము తర్పణము చేయవలయును. పిమ్మట పన్నిద్దఱు బ్రహ్మచారులను సంతృప్తిగా భుజింపఁజేయవలెను. ఇట్లు చేసినయెడల మంత్రము సిద్ధించును. సంతోషము కలుగును. సంపదలు పెరుగును. అదృష్టము కలిసివచ్చును.

ఇన్ని చెప్పనేల? ఈ హనుమన్మంత్రము సకల కామ్యములను ఫలింపఁజేయును.

ఈ హనుమన్మంత్రమును నియమము ప్రకారము ఎల్లప్పుడును జపించుచుండిన యెడల సశరీరుఁడై స్వర్గాదిసౌఖ్యములనుభవించుచుండును. జీవించియుండఁగనే మోక్షమును నిశ్చయముగా పొందును. ఇందులో సందేహము లేదు. నిశ్చయము. నిజము.

ఎవ్వరు అయిననురోజునకు ఇరువదియెనిమిది పర్యాయములు చొప్పున నియమవంతులై జపమును చేయుచుండినచో ఎటువంటి ఆపత్సముద్రమునైనను సంతరించి సుఖమును అనుభవించుచుందురు. శత్రువుల నందఱిని జయింతురు. ఉత్తమమైనట్టియు, శాశ్వతమైనట్టియు సంపదలను అనుభవింతురు. దీర్ఘాయుష్మంతులగుదురు. ఆరోగ్యవంతులగుదురు. మంచి యోగ్యులగు సుగుణవంతులగు పుత్రులను పౌత్రులను కలవారగుదురు. ప్రపంచకమునందలి జనులెల్లరు వశ్యులగుదురు. రాజుకూడ వశ్యుడగును. స్త్రీలు అందఱును అనువర్తులై సేవచేయుచుందురు. ఈ రీతిని జపము చేయువారు ఏమాట మాటలాడితే ఆమాట సిద్ధించును. అన్నికోరికలు నెరవేరును.

ప్రతి నిత్యమును మంచి నియమముతో నూటయెనిమిది పర్యాయములు చొప్పున జపము చేయుచుండినచో దీర్ఘాయుష్మంతుడగును. ఆరోగ్యవంతుడగును. సకల సంపదలు కలవాడగును. పుత్ర పౌత్రవంతుడగును. నిర్మలమగు సౌభాగ్యము కలుగును. అందఱు శత్రువులను జయించి సుఖమును పొందుచుండును. గరుత్మంతుడు తనకు శత్రువులగు సర్పములను వధించి సుఖమును ఎట్లుపొందునో; అట్లే విరోధులను జయించి మంచి సుఖమును అనుభవించును. మూడు సంవత్సములు జపించినయెడల గొప్ప ఫలసిద్ధి కలుగును. శరీరముతో మోక్షము సిద్ధించును. ఒక్క-గశియలోపాదుకలు మొదలగు అసిద్ధులును సిద్ధించును. ఎప్పుడు ఏయే ద్రవ్యాపేక్ష కలుగుచుండునో మోక్షాసక్తి సమకూరుచుండునో అప్పుడే ఆకోరికయును వెంటనే ఫలించుచుండును.

శ్లో॥ స్థావరం జగమంచాపి కృత్రిమంచాపి యద్విషం
ఏత త్కరస్పర్శనత స్సద్యఏవ వినశ్యతి

శ్లో॥ చిరాయుష్యం సమాసాద్య భుక్త్వా భోగాంశ్చ దుర్లభాన్
ఏకాహిక ద్వ్యాహికాది జ్వరానపి సుదారుణాన్

శ్లో॥ బ్రహ్మ రాక్షస భేతాళ భూత ప్రేత పిశాచకాన్
దృష్ట్వైవోచ్చాటయే త్సద్యో నాత్ర కార్యా విచారణా

శ్లో॥ కిమత్ర బహునోక్తేన జీవన్ముక్తో భవే ద్ధ్రువం
అస్మిన్ కలియుగే ఘోరే లోభ మాయా సమాకులే

శ్లో॥ అయమేవ పరోధర్మ స్త్విదమేవ పరంతపః
ఇయమేవ మహావిద్యా ఇదమేవ పరంఫలం

శ్లో॥ సాధనేషుచ సర్వేషు పూర్ణశ్రీ గ్గుర్వనుగ్రహః
అస్తిచే త్సర్వసిద్ధిస్స్యా దన్యథా నిష్ఫలం భవేత్

శ్లో॥ సఏవ కృతకృత్యశ్చ యో గురౌ దృఢభక్తిమాన్
గురో రభావే తత్పత్నీం తత్పుత్త్రంవా ప్రతోషయేత్

శ్లో॥ నాన్యథా సిద్ధి మాప్నోతి పురశ్చర్యా శతైరపి.
(ఇతి పరాశరసంహితాయాం మంత్రమాహాత్మ్యం
మంత్ర పురశ్చరణం నామ)

తా॥ స్థావర రూపమును పొందిన విషమునుగాని, జంగమ రూపమును పొందిన విషమునుగాని కృత్రిమముగా తయారు చేయఁబడిన విషమునుగాని యీ హనుమన్మంత్రమును జపించు వారు చేతితో స్పర్శించిన మాత్రముననే అన్ని విషములును నివారణమగును. చిరాయుష్యము కలుగును. రోజువిడిచి రోజు వచ్చు జ్వరములుగాని, రెండురోజుల కొకసారివచ్చు జ్వరములు గాని, అన్నివిధములగు జ్వరములును తప్పక నశించును. మంత్రి కరస్పర్శముచేత, భూత, ప్రేత, రాక్షస, భేతాళములు మొదలగు

హాబాధలు వెంటనే నివారణమగును. ఎక్కువ చెప్పనవసరము
ు. బ్రతికియుండియు మోక్షమును అనుభవించుచుండును.

లోభముచే నిండినట్టియును మాయలచే గూడినట్టియును
కలి భయంకరమగు ఈ కలియుగములో ఈ హనుమ
ంత్రమే మిక్కిలి ముఖ్యమగు ధర్మము. ఇదియే మహావిద్యా
తకంటె వేఱుగా ఫలములనిచ్చునది యింకొకటి లేదు.

అయితే అన్ని సాధనములలోను గుర్వనుగ్రహమే
ఖ్యమైనది. ఈగురుభక్తివలననే ఫలసిద్ధి కలుగును. ఇంకొక
గా ఫలసిద్ధి కలుగుట దుర్లభము. గురువునందు మిక్కిలి
క్తి కలవాడే సత్పూజ్యుండగును. కృతకృత్యుండగును. గురువు
ుయప్పుడు గురుభక్తితో గురుపత్నిని పూజింపుచుండవల
ును. గురుపుత్రుని పూజింపుచుండవలయును. గురుపూజను
ుననే అన్ని జపములు అన్ని పురశ్చరణలు ఫలించును.

మైత్రేయః శ్లో॥ మంత్రార్థం మంత్రచైతన్యం యో నజానాతి సాధకః
శతలక్షప్రజప్తేఽపి తస్య మంత్రో నిరర్థకః

తా॥ శ్రీ హనుమన్మంత్రమును జపించువారు నూరు
ులు జపముచేసినను మంత్రముయొక్క అర్థమును, మంత్రము
ుక్క భావమును, మంత్రముయొక్క వ్యాపారమును,
ంత్రముయొక్క నియమములను, తెలిసికొనకపోయిరేని ఆజపము
ప్రయోజనము అని తెలిసికొనవలయును.

—:ఇది పరాశరసంహిత:—

# శ్రీ సువర్చలా హనుమద్ద్వాదశాక్షర మంత్రప్రభావము

"మంత్రే తీర్థే ద్విజే దైవే దైవజ్ఞే భేషజే గురౌ
యాదృశీ భావనాయత్రసిద్ధి ర్భవతి తాదృశీ"

మైత్రేయః:—

శ్లో॥ ఆంజనేయస్వరూపం తస్యోత్పత్తి ర్మంత్రవైభవః
కథితాని త్వయా బ్రహ్మన్! శ్రుతానీహ మయా ప్రభో!

తా॥ మైత్రేయముని పరాశరమహామునిని అడుగుచుండెను. ఓ పరశరమహామునీశ్వరా!, ఇదివఱకు మీరు శ్రీయాంజనేయ స్వామివారియొక్క స్వరూపమును వారి జన్మమును వారి మంత్రవైభవమును చెప్పినారు. నేను శ్రద్ధగా విని యానందము నొందినాను.

శ్లో॥ సువర్చలాసమేత శ్రీ హనుమద్ద్వాదశాక్షరః
కీదృశః? స్తత్పురశ్చర్యా తస్యోత్పత్తిశ్చ కీదృశీ?

తా॥ సువర్చలాదేవితోఁ గూడుకొనియుండు శ్రీ యాంజనేయస్వామి వారియొక్క ద్వాదశాక్షర మహామంత్ర మెటువంటిది? ఆ మంత్రముయొక్క పురశ్చర్య యెటువంటిది? దాని పుట్టుక యెటువంటిది?

శ్లో॥ పురా కేవా పురశ్చర్యాం కృత్వా సిద్ధి మవాప్నువన్?
శ్రోతు మిచ్ఛామి తత్సర్వం వర్ణ్యతాం భగవన్! మునే!

తా॥ పూర్వము ఎవ్వారు పురశ్చర్య చేసి మంత్రసిద్ధిని మంత్ర ఫలసిద్ధిని పొందియున్నారు? ఓ పరాశరముని భగవం

తుఁడా! అది సవిస్తరముగాఁ జెప్పుము. వినవలెనని కోరికగా నున్నది.

పరాశరః—

శ్లో॥ సప్తకోటిమహామంత్రాః ప్రోక్తా గౌర్యై హి శంభునా

తా॥ పరాశరమహాముని మైత్రేయ మునీంద్రున కిట్లు చెప్పుచున్నాడు. ఓ మైత్రేయమునీంద్రా! శ్రీ పరమేశ్వరుండు పార్వతీదేవికి ఏడుకోట్ల మహామంత్రములు బోధించి యుపదేశించినారు.

శ్లో॥ శైవాశ్చ వైష్ణవా స్సౌరాః గాణాపత్యా శ్శివాత్మికాః
కౌమారా భైరవా శ్చాన్యే కేచి న్మంత్రా హనూమతః

తా॥ కొన్ని మంత్రములు శివసంబంధమయినవి, కొన్ని మంత్రములు విష్ణుసంబంధమయినవి, కొన్ని సూర్యునికి సంబంధించినవి, కొన్ని గణపతికి సంబంధించినవి, కొన్ని పార్వతికి సంబంధించినవి, కొన్ని కుమారస్వామికి సంబంధించినవి, కొన్ని భైరవస్వామికి సంబంధించినవి. మఱికొన్ని శ్రీ హనుమంతునకు సంబంధించినవి.

శ్లో॥ కేచిత్ భుక్తిం ప్రచుర్యంతి కేచి న్ముక్తిం దిశంతిచ

కొన్ని మంత్రములు భుక్తిని సమకూర్చుచున్నయవి. కొన్నిమంత్రములు ముక్తిని సఫలీకృతము చేయుచున్నయవి.

శ్లో॥ దేవతానాం యథా విష్ణుః నక్షత్రాణాం యథా శశీ
గ్రహాణాంతు సహస్రాంశు ర్నదీనాం జాహ్నవీ యథా

తా॥ దేవతలలో విష్ణుమూర్తివలెను, నక్షత్రములలోఁ జంద్రునివలెను, గ్రహములలో సూర్యుఁడువలెను, నదులలో గంగానదివలెను.

శ్లో॥ తథా సువర్చలాయుక్త హనుమద్ద్వాదశాక్షరః
మంత్ర శ్శ్రేష్ఠతర శ్శీఘ్రం భుక్తింముక్తిం ప్రయచ్ఛతి

తా॥ ఆలాగే సువర్చలాయుక్త హనుమద్ద్వాదశాక్షర మహామంత్రముకూడ మిక్కిలి శ్రేష్ఠతరమైనది. వెంటనే భుక్తిని ముక్తిని ఇచ్చుచున్నది.

శ్లో॥ న కాలదేశనియమో నాఽరిమిత్రాదిశోధనమ్
ప్రసన్నోపాసకగురో ర్ముఖా ల్లబ్ధ్వా మనుం త్విమమ్

తా॥ కాలనియమము లేదు. దేశనియమము లేదు. ప్రదేశ నియమము లేదు. శత్రువులైనను మిత్రులైననుసరియే విచారింప నక్కఱలేదు. ప్రసన్నముగల గురువుద్వారా ఈ మంత్రము యొక్క యుపదేశమునుపొంది,

శ్లో॥ గురుం సంతోషయే ద్ధీమాన్ శుశ్రూషా స్వర్ణ భూషణైః
వస్త్రై ర్మాల్యై ర్ధూపదీపై రభీష్టైః మృష్టభోజనైః

తా॥ పిమ్మట ధీమంతుండగు శిష్యుండు శుశ్రూష చేయుటచేతను బంగారమునగలు నిచ్చుటచేతను వస్త్రము లిచ్చుటచేతను దండలు, హారములిచ్చుటచేతను, ధూపము లిచ్చుటచేతను, దీపములిచ్చుటచేతను, కోరికలు నెరవేర్చుట చేతను, మంచి షడ్రసోపేతమగు భోజనముచేతను గురువు గారిని సంతోషపెట్టవలయును.

శ్లో॥ గురో స్సంతోషణేనైవ హనూమాన్ భక్తవత్సలః
సంతుష్య సకలాభీష్టాన్ దదాతీహ న సంశయః

తా॥ గురువునుసంతోషపరచినయెడల భక్తులయందుం బ్రేమముకల్గియుండు శ్రీ హనుమత్ప్రభువు తానుకూడ సంతో

షించి సకలకార్యములను ఫలింపఁజేయును. ఇందుకు సందియ మెంతమాత్రమును లేదు.

శ్లో॥ అత్యాశ మతిలుబ్ధంచ దాంభికం జ్ఞానవర్జితమ్
అసంతుష్ట మశాంతంచ న పాపం గురు మాశ్రియేత్

తా॥ ఎక్కువ యాశ కలిగినటువంటియును, ఎక్కువ లోభము కలిగినటువంటియును, బడాయి కలిగినటువంటియును, జ్ఞానము లేనటువంటియును, సంతోషము లేనటువంటియును, శాంతగుణము లేనటువంటియును, పాపాత్ముం డయినటువంటి గురువును ఆశ్రయింపరాదు.

శ్లో॥ నాస్తికాయ కృతఘ్నాయ వంచకాయాతిలోభినే
అనాచారాయ పాపాయ నైత న్మంత్రం ప్రదాపయేత్

తా॥ ఏమియు లేదని శూన్యవాదము చేయువానికిని, చేసినమేలు మఱచిపోవు వానికిని మోసము చేయువానికిని, మిక్కిలి లోభము గలవానికిని, ఆచారము లేనివానికిని, ఆచరింపని వానికిని, పాపము చేయు వానికిని, ఈమంత్రమును ఉపదేశము చేయఁగూడదు.

శ్లో॥ జగత్ప్రాణతనూజత్వాత్ జగతః ప్రాణఏవ సః
తదధీనం జగత్సర్వ మితి మే నిశ్చితా మతిః

తా॥ జగత్తునకుఁ బ్రాణస్వరూపమగు వాయుదేవుని కుమారుండగుటవల్ల నీహనుమంతుఁడును జగత్తునకుఁ బ్రాణమే కావున లోకమంతయును శ్రీహనుమంతునకు లోఁబడి యుండ నని నా నిశ్చయాభిప్రాయము.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య శ్రీబీజం తదనన్తరమ్
తత శ్శ్రీవర్ణ ముచ్చార్య సువర్చలాపదం తథా

తా॥ మొదట "ఓమ్" కారమును ఉచ్చరించి పిమ్మట "శ్రీమ్" అని యుచ్చరించి, తరువాత "శ్రీ" అని యుచ్చరించి పిమ్మట "సువర్చలా" అని యుచ్చరింపవలయును.

శ్లో॥ హనుమత్పద ముచ్చార్య నమశ్శబ్దం తతఃపరమ్
ద్వాదశాక్షరమంత్రోఽయం పురశ్చర్యావిధిం శ్రుణు

తా॥ "హనుమతే" అను పదమును "నమః" అను పదమును ఉచ్చరించిన యెడల "ఓమ్ శ్రీం శ్రీ సువర్చలా హనుమతేనమః" హనుమద్ద్వాదశాక్షర మహామంత్రమగును. పురశ్చర్యా విధానమును వినుము.

శ్లో॥ అహమేవ ఋషి స్తత్ర గాయత్రీ ఛందఏవ వా
సువర్చలా సమేత శ్రీహనుమాన్ దేవతా తథా

తా॥ ఋషి పరాశరుఁడు ఛందస్సు గాయత్రి, దేవత శ్రీసువర్చలా సమేత శ్రీహనుమంతుఁడు

శ్లో॥ మారుతాత్మజ బీజంచ అంజనాసుత శక్తిచ
కీలకం వాయుపుత్రోస్తు మమ శ్రీపద ముచ్చరేత్

తా॥ బీజము మారుతాత్మజుఁడు, శక్తి అంజనాసుతుఁడు, కీలకము వాయుపుత్త్రుఁడు, మమశ్రీ, అని యనవలయును

శ్లో॥ సువర్చలేశ హనుమత్ప్రసాదే వినియోజనమ్
అంగన్యాసం కరన్యాసం కుర్యాద్వై మూలమంత్రతః

తా॥ వినియోజనము సువర్చలేశ శ్రీహనుమత్ప్రసాదము, అంగన్యాసమును కరన్యాసమును మూలమంత్రము ననురించియే చేయవలయును.

శ్లో॥ అంజనాసుతాయేతిచ తతోవై రుద్రమూర్తయే
వాయుసుతాయేతి తథాఽగ్నిగర్భాయ తతఃపరమ్

తా॥ అంజనాసుతాయ, రుద్రమూర్తయే, వాయుసుతాయ, అగ్నిగర్భాయ.

శ్లో॥ శ్రీరామముఖ్యదూతశ్చ బ్రహ్మాస్త్రాది నివారణః
భూర్భువ స్సువ రో మితి దిగ్బంధన పదం వదేత్

తా॥ శ్రీరామ ముఖ్యదూతాయ. బ్రహ్మాస్త్రాది నివారణాయ, భూర్భువస్సువరో మితి దిగ్బంధః, అని యుచ్చరించవలయును.

ధ్యానమ్.

శ్లో॥ సువర్చలాధిష్ఠిత వామభాగమ్
వీరాసనస్థం కపిబృంద సేవ్యమ్
స్వపాదమూలం శరణం గతానామ్
అభీష్టదం శ్రీహనుమంత మీశే.

తా॥ ధ్యానము ఇట్లు చేయవలయును.

వామభాగమునందు సువర్చలా మహాదేవి కలిగినటువంటియును, వీరాసనము వేసికొని కూర్చున్నట్టియును, వానర సమూహముచేత సేవింపఁబడుచుండునటువంటియును, తమపాదముల దగ్గఱకు శరణు అని వచ్చినవారలయొక్క అన్ని కోరికలు ఫలింపఁజేయునటువంటి శ్రీహనుమత్ప్రభువువారిని సేవించుచున్నాను. అని ధ్యానము చేయవలెను.

గ్రంథాంతరే:—

శ్లో॥ భక్తకల్పతరుం సౌమ్యం లోకోత్తరగుణాకరమ్
సువర్చలాపతిం వందే మారుతిం వరదం సదా

తా॥ భక్తులకుఁ గోరిన కోరికలనన్నింటిని సమకూర్చుచుండెడి కల్పవృక్షమువంటివాఁడును, లోకముల కన్నింటికిని మహోత్తరములగు మంచిగుణములకు నివాసమైన వాఁడును,

సువర్చలా మహాదేవికి భర్తయును, భక్తులకు సన్నివరము లిచ్చుచుండు వాడును, అగు వాయువు దేవుని కుమారుండగు శ్రీ హనుమంతుని ధ్యానించు చున్నాను. అని ధ్యానము చేయ వలయును

శ్లో॥ పద్మాసనం సమస్థాయ పూర్వాభిముఖతో నరః
ప్రాతఃకాల ఉపక్రమ్య అపరాహ్ణే జపేన్మనుమ్

తా॥ పద్మాసనమును వేసికొని బాసిపట్టు వేసికొని తూర్పుగాఁదిరిగి కూర్చుని సూర్యోదయకాలమున మొదలుపెట్టి అపరాహ్ణమువఱకు అనఁగా 18 గడియలు, (1½ గంటల) వఱకు మంత్రమును జపించుకొనవలెను.

శ్లో॥ ఆంజనేయః పూజితశ్చే త్పూజితా స్సర్వదేవతాః
హనుమన్మహిమాఽ శక్యో బ్రహ్మణాఽపి న వర్ణితుమ్

తా॥ ఆంజనేయస్వామివారిని పూజించిన యెడల నందఱు దేవతలను పూజించినట్లెయగును. శ్రీ యాంజనేయుని మహిమ ఇంతయని చెప్పుటకు శక్యముకాదు. బ్రహ్మ దేవుఁడు కూడ శ్రీ హనుమంతుని మహిమమును వర్ణింపలేఁడు.

శ్లో॥ సింధుసంగమ మధ్యేతు నదీతీరే విశేషతః
హనుమత్సన్నిధా వాపి గృహమధ్యే విశేషతః

తా॥ శ్రీ హనుమంతుని ద్వాదశాక్షర మహామంత్రజపమును నదీసముద్ర సంగమ ప్రదేశమునకు మధ్యనుగాని, నదీతీరమునందు గాని మిక్కిలి ప్రశస్తముగా జపముచేసికొనవచ్చును. హనుమంతుని విగ్రహము సమీపమునందుఁగాని, తనయింటిలోఁగాని జపముచేసికొనుట మిక్కిలిమంచిది.

శ్లో॥ అశ్వత్థతరుమూలేతు పర్వతాగ్రే తథైవచ
అయుతంతు పురశ్చర్యా మితాహారో జితేంద్రియః

తా॥ రావిచెట్టు మొదటనైనను కూర్చుని జపము చేయుట యెంతయును మంచిది. పర్వతశిఖరమునందును మిక్కిలి యుత్తమోత్తమము. లక్షపర్యాయములు పురశ్చర్య చేయవలయును. మితముగా భోజనపదార్థములు భుజించుచుండవలయును. ఇంద్రియములను లోఁబరచుకొనవలయును.

శ్లో॥ జపమధ్యేఽప్యథశ్నాయా హవిష్యం భక్షయేత్తతః
ప్రథమేఽహ్ని యథాఽఽహారః ఆసమాప్తి తథైవహి.

తా॥ జపముచేసినంత కాలమును గ్రిందనే పరుండవలయును. హోమముచేయు పదార్థమునందలి శేషమునుమాత్రమే భుజించుచుండవలయును. మొదటిరోజున ఎట్లు ఆహారమును నియమము ప్రకారము భుజించెనో, జపము సాంతము అగునంత వఱకును అట్లే భుజించు చుండవలయును.

శ్లో॥ దశాంశం తర్పయేద్ధీమాన్ తద్దశాంశం హునేత్తథా
పాయసాపూప దధ్యన్నైః బ్రాహ్మణాన్ భోజయేత్తతః

జపముచేసినసంఖ్యలోఁ బదవవంతు తర్పణము చేయవలెను. తర్పణములోఁ బదవవంతు హోమముచేయవలయును. క్షీరాన్నము, అప్పాలు, పెరుగన్నము మొదలగు మంచిపదార్థములతో, బ్రాహ్మణ సమారాధనము చేయవలయును.

శ్లో॥ గోక్షీర శర్కరాజ్యైశ్చ తర్పణంతు సమాచరేత్
మధ్వాజ్యశర్కరాభిశ్చ అపూపైశ్చ హునేత్తతః

తా॥ ఆవుపాలు, పంచదార, ఆవునేయి వీనితో, తర్ప ణము చేయవలయును. తేనె, ఆవునెయ్యి, పంచదార, అప్పాలు వీనితో హోమము చేయవలయును.

శ్లో॥ ఖర్జూర కదళీభిశ్చ నారికేళఫలై స్తథా
మల్లికా జాతిపుష్పైశ్చ చంపకైః కేతకై స్తథా

తా॥ ఖర్జూరపండ్లతోను, అరటిపండ్లతోను, కొబ్బరి పండ్లతోను, మల్లిపువ్వులతోను, జాజిపూలతోను, సంపెంగ పూలతోను, మొగలిపువ్వులతోను,

శ్లో॥ హునే దష్టోత్తరశతం కుబేరసదృశో భవేత్
సురరాజసమం లోకే ఐశ్వర్యం శాశ్వతం ధ్రువమ్

తా॥ నూటయెనిమిది పర్యాయములు హోమముచేయు నెడల దేవేంద్రునితో సమానమగు ఐశ్వర్యము ఈ లోకము లోనే కలుగుచుండును. కుబేరునితో సమానుడుగా నుండు వాడు అగును. ఆ యైశ్వర్యము శాశ్వతముగా నుండును.

శ్లో॥ హనుమత్కృపయా నిత్యం సర్వలోకో వశో భవేత్
ఏతస్యైవ జపేనేంద్రో వృత్రాసుర మనూదయత్

తా॥ శ్రీహనుమంతుని దయచేత నెల్లలోకములలోని సకలప్రాణులు నెల్లప్పుడు తనకు వశులగుదురు. శ్రీహనుమంతుని మంత్రముయొక్క జపముచేతనే దేవేంద్రుడు వృత్రాసురుని జయించెను.

శ్లో॥ ఇమం జప్త్వా భీమసేనో జరాసంధ మనూదయత్
స్వాస్త్రావికారసిద్ధ్యర్థ మేతద్బ్రహ్మ జజాప హ

తా॥ ఈ శ్రీవీరహనుమన్మంత్రమును జపించుటవల్లనే భీమసేనుండు జరాసంధుని జయించెను. తన అస్త్రములకు ఏ

విధమగు వికారము మార్పు లేకుండ నుండుటకుగాను శ్రీహను మన్మంత్రమును బ్రహ్మదేవుండు జపించెను.

శ్లో॥ ఏవం విభీషణో లబ్ధ్వా తార్క్ష్యోఽప్యమృత మాహరత్

తా॥ ఇట్లు విభీషణుండును కూడ మంత్రమును జపించు చుండెను. గరుత్మంతుఁడు మంత్రమును జపించి యమృతమును దీసికొనివచ్చెను.

శ్లో॥ గర్గాచార్యా దిమం లబ్ధ్వా సీతా సా జనకాత్మజా
జఘాన లీలయా పూర్వం శతానన మహాసురమ్

తా॥ గర్గ మహామునివల్ల జనకుని కూతురగు శ్రీ సీతా మహాదేవి యీ శ్రీ హనుమన్మంత్రమును ఉపదేశమును పొంది జపించి పూర్వకాలమందు శతకంఠరాక్షసునిఁ జంపెను. ఎంత యో బలముగలవాఁడు శతకంఠరాక్షసుండు. వానిని సులువుగాఁ జెండాడినది శ్రీసీతామహాదేవి. ఈ మంత్రముచేతనే విజయము కలిగినది.

శ్లో॥ ఏతన్మంత్రపురశ్చర్యా కృతా పూర్వం మహాత్మభిః

తా॥ పూర్వము మహాత్ములు అనేకులు ఈమంత్రమునకు యథావిధిగాఁ బురశ్చర్యనుచేసి కృతార్థులయి యున్నవారలు.

## —: సీతాకృత శతకంఠ రావణవధ. :—

మైత్రేయః :—

శ్లో॥ శతాననవధం సీతా కథం కృతవతీ పురా?
రామేచ లక్ష్మణేచైవ శత్రుఘ్నే భరతే స్థితే

తా॥ మైత్రేయ మహాముని పరాశర మునిచంద్రుని నడు గుచున్నవాఁడు. ఓపరాశర మహామునీశ్వరా! పూర్వకాలము

నందు శ్రీరామచంద్రమూర్తి యుండఁగా, లక్ష్మణస్వామి యుండఁగా, భరతుండుండఁగా, శత్రుఘ్నుండుండఁగా సీతామహా దేవి శతకంఠ రావణాసురు నెట్లు చంపినది ?

శ్లో॥ హనూమత్యపి సుగ్రీవే తత్సర్వం వర్ణ్యతాం మునే !
శ్రోతు మిచ్ఛామ్యహం బ్రహ్మన్ ! పరం కౌతూహలం హి మే

తా॥ అప్పుడు శ్రీహనుమంతుఁ డున్నవాఁడుగదా! సుగ్రీవుఁడు నుండెనుగదా! సీతాదేవి చంపుటకుఁ గారణమును విస్తరముగాఁ జెప్పుఁడు. ఓ పరాశర మునీంద్రా ! వినవలెనని మిక్కిలి సంతోషముగా నున్నది. వినెదను. తమరు తప్పక చెప్పవలయు నని యడిగెను.

శ్రీపరాశరః—

శ్లో॥ సీతాయా శ్చరితం వక్ష్యే కళ్యాణం శృణు తత్త్వతః
యా లోకమాతా శ్రీవిష్ణో ర్వల్లభా జగదీశ్వరీ

తా॥ శ్రీపరాశరముని చెప్పుచున్నాఁడు. ఓమైత్రేయ మునీంద్రా ! ఏమహాదేవి శ్రీవిష్ణుమూర్తికి భార్యయో, అన్ని జగత్తులకు అధికారిణియో, లోకములకన్నింటికిని మాతృదేవతయో, యా మహాదేవియగు శ్రీ సీతాదేవియొక్క పవిత్రమగు చరిత్రమును నిశ్చయము అయినవిధముగా, ఉన్నది యున్నట్లుగాఁ జెప్పెదను వినుము.

శ్లో॥ రామః కమలపత్రాక్షః స్సేతుం బధ్వా మహోదధౌ
సుగ్రీవసచివ శ్శ్రీమా నవధీ ద్రావణం రణే.

తా॥ తామరపూవు రేకులువలె మిక్కిలి సుకుమారమగు రూపములుగల విశాలములగు నేత్రములు కల శ్రీరామచంద్రమూర్తి, సుగ్రీవుని మంత్రినిఁగాఁ జేసికొని, యుద్ధమునందు

మంచి కాంతిగలవాఁడై మహాతేజముతో రావణాసురుని సంహరించినాఁడు.

శ్లో॥ స్వాత్మానం రాఘవో మేనే కృతార్థం దైత్యనాశనాత్
ఏతస్మిన్నంతరే వాణీ అంతరిక్షే జగాద తం

తా॥ శ్రీరాముఁడు రణములో రాక్షసులందఱును సమసిపోవుటవల్ల నేను కృతార్థతను పొందినానని తలంచుకొనుచుండెను. ఇంతలో ఆకాశమునందలి వాణి శ్రీరామచంద్రునితో నిట్లు పలికెను.

శ్లో॥ శతయోజన భూతాబ్ధౌ కియాఞ్ దశముఖాసురః ?

తా॥ నూరుఆమడలమేరము పరిమితిగల సముద్రమున కవతలనున్న పదితలలుగల రావణాసురుఁడెంత ?

శ్లో॥ సహస్రయోజనాబ్ధౌతు గగనే పరివర్తితః
శతాననో వసేత్ రామ! మహా బల పరాక్రమః

తా॥ ఓ శ్రీరామచంద్రమూర్తీ ! వేయి ఆమడలమేరమునన్న సముద్రమునకుఁ బైన నాకాశమునందు మిక్కిలి గొప్ప బలము పరాక్రమము గల నూరుతలలరాక్షసుఁడున్నాఁడు.

శ్లో॥ అజేయ స్సర్వభూతానాం జహి తం దేవవైరిణం

తా॥ ఆరాక్షసుండు సర్వప్రాణుల కెవ్వారికిని లొంగువాఁడుకాఁడు. వానిని జంపుము.

శ్లో॥ తచ్ఛ్రుత్వా రాఘవో ధీమా నభూ చ్చింతాపరాయణః

తా॥ ఆమాటవిని శ్రీరామచంద్రమూర్తి బుద్ధిమంతుఁడైనను నిట్లు చింతకలవాఁడైనాఁడు.

శ్లో॥ శతయోజనవిస్తీర్ణం సముద్రే సేతుబంధనం
కృత్వా కష్టదశాం ఘోరాం సంప్రాప్తా వానరా ఇతి.

తా॥ నూరుఆమడల వెడల్పు దూరముగల సముద్రము నందు వంతెనకట్టుటకు వానరు లందఱును ఎంతో కష్టముపడి వంతెనను కట్టియున్నారు.

శ్లో॥ సాహస్రయోజనాంభోధౌ సేతోశ్చ బంధనం యథా
అతీవ దుస్తరం హ్యేత దితి చింతాం కరోతి సః

తా॥ వెయ్యి యోజనములు పరిమితిగల సముద్రమునకు వంతెనకట్టుట యెట్లు? ఇది మిక్కిలి దుస్తరమైన విషయము. అని శ్రీ రామచంద్రమూర్తి యాలోచనను చేయుచుండెను.

శ్లో॥ తమువాచ మహాతేజా హనుమాన్ మారుతాత్మజః

తా॥ మహాబలపరాక్రమములు కలిగినటువంటి శ్రీహనుమంతుఁడు శ్రీ రామచంద్రమూర్తిని గుఱించి యిట్లు చెప్పెను.

శ్లో॥ ప్రసార్య లాంగూల మహం సహస్రయోజనా దతి
అత్యంతకాయసంయుక్త స్తిష్ఠామి వరుణాలయే.

తా॥ నేను నాతోకను పెంచి వెయ్యియోజనముల కంటెను పైకితీసికొని వెళ్లి, మిక్కిలి పెద్ద శరీరమును ధరించిన వాఁడనై సముద్రమునందు నిలచియుందును.

శ్లో॥ సప్తసాగరపర్యన్తం వర్ధయిష్యామి సేతువత్
లాంగూలేనాంబుధిం తీర్త్వా జహి తంహి శతాననం

తా॥నేను ఏడు సముద్రములవఱకునుకూడ వంతెనవలె నాతోకను పెంచియుంతును. ఆ తోకను జూచుకొని దానిమీఁదుగా వెళ్లి నూరుమోములు గల రాక్షసుని సంహారింపుము.

శ్లో॥ ఇత్యుక్త్వా దీర్ఘలాంగూలం ప్రసార్య పవనాత్మజః
మార్గం కృత్వా సముద్రాంత మతిష్ఠ త్తత్ర సంస్థితః

తా॥ ఇట్లు చెప్పుచు శ్రీ హనుమంతుఁడు తన పొడుగగు తోకను ప్రసరింపఁజేసి సముద్రమునం దంతటను మార్గమేర్పడు నట్లు నిలచియుండెను.

శ్లో॥ లాంగూలరోమజాలేషు నక్షత్రాణి తథా గ్రహాః
దృశ్యన్తే దర్భపుంజేషు యథైవ హిమబిందవః

తా॥ ఆంజనేయుని తోకయందలి ప్రతి రోమమునందును దర్భలలో మంచుచుక్కలువలె నక్షత్రములు అంటుకొని యుండెను.

శ్లో॥ తతో దాశరథి శ్శ్రీమాన్ చతురంగబలై స్సహ
గత్వా వానరసైన్యైశ్చ యుద్ధాయ సముపస్థితః

తా॥ అంతట శ్రీ రామచంద్రమూర్తి చతురంగ బలములతోఁ గూడుకొని వానరసైన్యములతో యుద్ధమునకు సంసిద్ధుండై నిలిచియుండెను.

శ్లో॥ అంతరిక్షపురం తస్య హ్యాగమ్యం సర్వదేహినాం
అదృశ్య మితరేషాం త దసాధ్యం దేవదానవైః

తా॥ రాక్షసుఁడుండునది అంతరిక్షపురము. ఆపట్టణము వెళ్లుటకు ఎవ్వరికిని శక్యముకాదు. అది ఇతరుల కెవ్వరికిని కనఁబడదు. దేవతలకుఁగాని రాక్షసులకుఁగాని సాధ్యముకాదు.

శ్లో॥ ప్రాకారోగ్నిమయ స్తస్యా అప్రధృష్యః పరాక్రమైః
ఇత్యాకాశవచ శ్శ్రుత్వా రాఘవ శ్చింతితో బహు

తా॥ దానికిఁ జుట్టును అగ్నిమంటలు ప్రాకారములుగా నేర్పడి యున్నవి. బలపరాక్రమము లేమియును దానియొద్దఁ బనికిరావు. అని తిరిగి ఆకాశవాణి చెప్పినది. ఈ మాటలువిని శ్రీరామచంద్రమూర్తి అనేకవిధములుగా విచారించుచుండెను.

శ్లో॥ తదా హనూమాన్ దుర్ధర్షః ప్రాకారాగ్నిం సరిత్పతౌ
క్షిప్త్వా తత్పురి పర్యంతం స్వలాంగూల మవర్ధయత్

తా॥ అప్పుడు హనుమంతుఁడు తీవ్రరూపమును ధరించి యితరులకుఁ జూచుటకుఁగూడ నశక్యమయినవాఁడై ఆప్రాకారముగానున్న యగ్నిని సముద్రములో విరచిమ్మి అంతవఱకు తన తోఁకను పెంచెను. ఆంజనేయుని మహిమము చాలా గొప్పది.

శ్లో॥ తత్పురీసమలాంగూలే చతురంగబలైస్సహ
భ్రాతృభి స్సాక మారుహ్య చకార కదనం మహత్

ఆ పట్టణమువఱకును వ్యాపించియుండు తోఁకమీఁద శ్రీరామచంద్రమూర్తి చతురంగ బలములతోడను సోదరులతోడను నెక్కి గొప్పయుద్ధము చేయుచుండెను.

శ్లో॥ తద్యుద్ధ మభవ ద్ఘోరం తుములం రోమహర్షణం
శతాననస్య రామస్య వానరాణాంచ రక్షసాం

తా॥ ఆయుద్ధము శ్రీరామ చంద్రమూర్తికిని శతానన రాక్షసునకును మిక్కిలి తీవ్రముగా జరిగినది. వానరులకును రాక్షసులకును మిక్కిలి భయంకరమగు యుద్ధము జరిగినది.

శ్లో॥ శిరాంసి తస్య కృత్తేషు తీక్ష్ణై రాఘవసాయకైః
పునరేవ ప్రరోహంతి ఘోరరూపశిరాంసివై

తా॥ శతకంఠ రాక్షసునియొక్క శిరస్సులు శ్రీరామ చంద్రమూర్తి మిక్కిలి పదునైన బాణములతోఁ గోసి క్రిందఁ బడవేయుచుండఁగా వెంటనే తిరిగి మిక్కిలి ఘోరరూపములు గల శిరస్సులు మొలచుచుండెను.

శ్లో॥ తస్య దైత్యస్య రక్తేన సంపక్తా భువి పాంసవః
భవన్తి తత్క్షణాదేవ సర్వేఏవ శతాననాః

తా॥ ఆరాక్షసునియొక్క శరీరమునుండి రక్తబిందువులచే భూమియందలి రేణువులెన్ని తడియుచున్నవో; యన్ని రక్తబిందువులు వెంటనే యందఱు శతకంఠ రాక్షసులుగా మారుచున్నయవి.

శ్లో॥ తే యుద్ధ్యంతి మహావీరా మహాబలపరాక్రమాః
శతాననానాం సర్వేషాం యావంతో రక్తబిందవః

తా॥ మిక్కిలి బలపరాక్రమములు గలిగినటువంటి మహావీరులగు శతానన రాక్షసులు ఎందఱుయుద్ధము చేయుచున్నారో వారి శరీరములనుండి యెన్నిరక్తబిందువులు నేలపై బడుచున్నవో?

శ్లో॥ సంసిక్తా భూపరాగేన్యు స్తావంతస్తు శతాననాః

తా॥ అన్నిచుక్కలును అందఱు నూరుతలలుగల రాక్షసులుగా నిలచి యుండుచున్నారు.

శ్లో॥ ఏవం శతాననా స్సర్వే రాఘవై స్సహ సంగతాః
యుద్ధ్యంతో మూర్ఛితా శ్చక్రు ర్భ్రాతౄన్ సంగ్రామమూర్ధని

తా॥ ఇట్లు పైకివచ్చిన రాక్షసులందఱును రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులతో నెదుర్కొని యుద్ధముచేయుచు నారామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను యుద్ధములో మూర్ఛలోముంచిరి

శ్లో॥ మూర్ఛితాన్ రాఘవాన్ దృష్ట్వా సీతా చింతాకులాఽభవత్

తా॥ ఇట్లు మూర్ఛపొందియుండు రాఘవుల నందఱిని కనుంగొని సీతామహాదేవి విచారగ్రస్తురాలయ్యెను.

శ్లో॥ ఏతస్మి న్నంతరే గర్గ స్సమాగత్య మహామునిః
ద్వాదశార్ణం మనుం తస్యై దదౌ సీతా జజాపచ

ఇంతలో గర్గమహామునీంద్రుఁడువచ్చి పన్నిండు అక్షరములు కల మహా హనుమన్మంత్రమును సీతాదేవి కుపదేశించెను. ఆదేవి శ్రీ హనుమన్మహామంత్రమును జపించుచుండెను.

శ్లో॥ తస్మాత్ప్రసన్నో హనుమా నభవ ద్విశ్వరూపభృత్

తా॥ ఆ సీతా మహాదేవి మంత్రమును జపించుచుండుటవల్ల సంతోషించి శ్రీహనుమంతుఁడు విశ్వరూపమును ధరించెను.

శ్లో॥ వానరం ముఖమేకంతు ద్వితీయం సింహవక్త్రకం
తృతీయం గారుడం వక్త్రం చతుర్థం సౌకరం ముఖం.

తా॥ ఒక ముఖము వానర ముఖము, రెండవముఖము సింహముఖము, మూఁడవముఖము గరుడముఖము; నాల్గవ ముఖము వరాహముఖము,

శ్లో॥ హయాననం పంచమం చాప్యేకైకం నయనై స్త్రిభిః
దశబాహుసమోపేతం దశాయుధ సమన్వితం

తా॥ అయిదవ ముఖము అశ్వముఖము, ఒక్కొక్క ముఖమునకు మూఁడేసి కన్నులుండును. పదేసి భుజములుండును. ఒక్కొక్క భుజమునందును నొక్కొక్క యాయుధముండును.

శ్లో॥ తదా ప్రభృతి కథితః పంచాస్యో హనుమానితి
రూపం తస్య బభౌ యద్వ ద్రుద్రస్య పురఘాతినః

తా॥ అది మొదలు శ్రీ యాంజనేయ స్వామివారికిఁ బంచాస్యుండను పేరు సార్థకముగాఁ బ్రఖ్యాతిమైయున్నది. ఆ పంచ ముఖాంజనేయ స్వామివారి రూపము త్రిపురాసురుని సంహరించియున్న రుద్రుని యాకారమువంటి యాకారము కలదై యున్నది.

శ్లో॥ శతాననానాం సర్వేషాం యావంతి వదనానివై
తావంతో పంచవదనా బభూవ కపికుంజరః

తా॥ అందు ఘోరాకారులై యున్న శతముఖరాక్షసు
ందరికిని ఎన్నిముఖములున్నవో, అందరు అయిదుముఖములుకల
ంజనేయులుగా శ్రీఅంజనేయస్వామి అనేకరూపములు ధరించి
ారు.

శ్లో॥ తతో హనుమాన్ స్వస్కంధే చారోప్య జనకాత్మజాం
భయ మాపాదయామాస రాక్షసానాం దురాత్మనాం

తా॥ పిమ్మట శ్రీయాంజనేయస్వామివారు మహామాత
ుగు శ్రీసీతామహాదేవినిఁ దనమూపుమీఁద నెక్కించుకొని
దుర్మార్గులగు రాక్షసుల కందఱకును భయమును కలిగించెను.

శ్లో॥ తత స్సీతా భగవతీ కాళీరూపం దధౌ ద్రుతం
భయంకరీ బభూ వాథ యుయుధే శరవర్షిణీ

తా॥ పిమ్మట సీతామహాదేవి భయంకరమగు కాళీరూప
మును ధరించెను. వెంటనే బాణవర్షమును వర్షించుచు మహా
యుద్ధమును చేయుచుండెను.

శ్లో॥ తద్యుద్ధ మభవ ద్ఘోరం సీతాయా రక్షసాం తథా
రక్తో రక్తార్ద్రి రేణుభ్యో రాక్షసా న్వీక్ష్య విస్మితః

తా॥ సీతామహాదేవికిని శతానన రాక్షసులకును మహా
ఘోరయుద్ధము జరిగినది. ఒక్కొక్క శతాననరాక్షసుని శరీరము
నుండి కారుచున్న రక్తబిందువులవల్లనేర్పడిన యనేక శతానన
రాక్షసులను జూచి శ్రీహనుమత్ప్రభువు మిక్కిలి విస్మయమంది
నారు.

శ్లో॥ తస్థౌ విస్తీర్య లాంగూలం హనుమాన్ రక్తపాతనే
అభావా ద్రక్తపాతస్య క్షితౌ నష్టా శతాననాః

తా॥ వెంటనే తనతోకను పెంచి భూమిమీఁద యావత్తు ప్రదేశమునందును పరచినారు. అంతనే రాక్షసులయొక్క నెత్తురు భూమిమీఁదఁ బడుట లేదు. శ్రీయాంజనేయస్వామి తోక మీఁదనే పడుచున్నది, కావున శతాననరాక్షసులు తిరిగి యుద్భవించుట లేదు.

శ్లో॥ సీతాయా శ్శరవర్షేణ హ్యేక ఏవావశేషితః

తా॥ సీతామహాదేవియొక్క బాణపరంపరలచేత మిగిలిన శతాననరాక్షసు లందఱును హతులైనారు. ఒక మొదటి శతాననరాక్షసరూపముమాత్రమే మిగిలినది.

శ్లో॥ తత స్సీతా మహాఘోరం శర మగ్నిశిఖోపమం
సంధాయ ధనుషి శ్రేష్ఠ మిద మాహ సుమధ్యమా

తా॥ పిమ్మట సీతామహాదేవి మిక్కిలిభయంకరమగునట్టియును అగ్నిమంటలవలె మంటలుమండుచున్నట్టి యొక సారమగునట్టి మహాబాణమును ధనుస్సునందుఁగూర్చి మంచి శరీరముయొక్క మధ్యభాగముగలదై మిక్కిలి పతివ్రతా లక్షణములు కలదిగావున నిట్లు మంచివాక్యము నొకదానిని బలికెను.

శ్లో॥ ఏకపత్నీవ్రతో రామో యద్యహం పతిదేవతా
పత త్వనేన బాణేన శతాననశిరో మహత్

తా॥ నాకు భర్తయగు శ్రీరామచంద్రమూర్తి వారు ఏకపత్నీవ్రతులైనట్లయితే, ఇతరస్త్రీనిఁ దల్లివలెఁ జూచుచుండువారైనయెడల; నేను నా భర్తయగు శ్రీరామచంద్రమూర్తి వారినే దైవముగా నమ్మియుందునేని, ఇతరపురుషులను తండ్రులనుగాఁ దలంచుచున్నయెడల; నీయొక్క బాణముచేతనే శతాననరాక్షసునియొక్క మహత్తరమగు శిరము క్రిందఁబడునుగాక.

శ్లో॥ ఇత్యుక్త్వా జానకీ బాణా త్పాతయామాస తచ్ఛిరః

తా॥ అనుచు వేసిన వెంటనే శ్రీ సీతామహాదేవియొక్క బాణమువల్ల శతానన రాక్షసుని శిరము భూమిమీఁదఁ బడినది.

శ్లో॥ పపాత పుష్పవృష్టిశ్చ నేదు ర్దుందుభయో దివి
వానరాశ్చ నరాశ్చైవ సంతుష్టా స్సకలా భవ[illegible]

తా॥ అంతట గగనమునుండి దేవతలు పుష్పవర్షమును కురిపించినారు. దేవదుందుభులు ఆకాశమునందు మ్రోగినవి. వానరులును నరులును అందఱును మిక్కిలి సంతోషించినారు.

శ్లో॥ తేషాం సంతోషఘోషేణ రాఘవా స్సహసోత్థితాః

తా॥ వారియొక్క సంతోషధ్వనిచేత శ్రీరామచంద్రమూర్తియును లక్ష్మణస్వామియును భరతుఁడును శత్రుఘ్నుండును వెంటనే మూర్ఛలు విడిపోయి తెలివిగలవారలై మేలుకొనినారు.

శ్లో॥ సీతాం దృష్ట్వా హనూమంతం శ్రీరామో వాక్య మబ్రవీత్

తా॥ పిమ్మట శ్రీరామచంద్రమూర్తివారు శ్రీహనుమత్ప్రభువును, శ్రీ సీతామహాదేవినిఁ జూచి యిట్లు పలికెను.

శ్లో॥ యువయో ర్విశ్వరూపంచ మమ దర్శయితుం క్షమం

తా॥ మీరిద్దఱును మీమీ విశ్వరూపములను ఇప్పుడు నాకు జూపింపుఁడు, అనెను.

శ్లో॥ సీతాచ హనుమాంశ్చైవ తదా శ్రీరామ మూచతుః

తా॥ సీతాదేవియును హనుమంతుఁడును శ్రీరామచంద్రమూర్తి వారితో నిట్లనిరి.

శ్లో॥ స్వరూప మావయోర్దృష్ట్వా భీత స్త్వం భవసి ధ్రువమ్

తా॥ మా యిద్దఱియొక్క విశ్వరూపములను మీరు చూచినయెడల బడలికలోనున్న మీ రాయాసము కలవా రౌతారు. నిశ్చయము. కావున సమంజసముకాదు.

శ్లో॥ ఉవాచ ప్రహసన్ వాక్యం తావుభౌ రఘునందనః

తా॥ అంతట శ్రీరామచంద్రమూర్తివారు చిఱునవ్వు నవ్వుచు వారిద్దఱితో నిట్లనిరి.

శ్లో॥ జ్ఞాతఏవ పరిభావో వా మతిదేవోఽతిదానవః

తా॥ మీయిద్దఱియొక్క పరిభావము దేవతలకును రాక్షసులకును నెందును కలుగఁబోదు. నాకును దెలిసినది.

శ్లో॥ ఇతి పరిశంస్యమానౌ తౌ పరమాం ముద మాపతుః

తా॥ ఇట్లు శ్రీ రామచంద్రమూర్తివా రనఁగానే సీతాదేవియును, హనుమంతుఁడును మిక్కిలి సంతోషించినారు.

శ్లో॥ హనూమంతంచ సీతాంచ స్తుత్వా జగ్ము ర్యథాగతాః

తా॥ పిమ్మట నందలివార లందఱును సీతాదేవిని హనుమంతునిఁ జూచి స్తోత్రము చేసి యెవరి నివాసములకు వారు వారు వెళ్ళినారు.

శ్లో॥ సీతాయా విజయంచైవ పరిభావంచ హనూమతః
యః పఠే చ్ఛృణుయాద్వాపి సర్వాన్ కామా నవాప్నుయాత్

తా॥ ఈ సీతాదేవియొక్క విజయమును హనుమంతుని యొక్క పరిభావమును ఎవ్వరు శ్రద్ధగాఁ జదువుచుందురో, ఎవ్వరు వినుచుందురో; వారు వారందఱునూ సర్వకామములు పొందుచుందురు.

యంత్రోద్ధారము:—

శ్లో॥ అథపూజా విధానార్థం యంత్రలక్షణ ముచ్యతే
సర్వయంత్రశ్రేష్ఠతమం భుక్తిముక్తిఫలప్రదమ్.

తా॥ పిమ్మట పూజించుకొనుటకు అనుకూలించునట్లు యంత్రలక్షణము చెప్పఁబడుచున్నది. అన్నియంత్రములకంటెను శ్రీ హనుమన్మంత్ర యంత్రము మిక్కిలి శ్రేష్ఠమయినది. భుక్తిని ముక్తినిఇచ్చుచుండునది.

శ్లో॥ ప్రథమం వర్తులం లేఖ్య మష్టకోణంచ విన్యసేత్
తద్బహి ర్వృత్త మాలిఖ్య షోడశాబ్జంచ లేఖయేత్.

తా॥ మొట్టమొదట గుండ్రని రేఖ గీయవలెను. గుండ్రని గీతఅనఁగా మిక్కిలి పెద్దనున్న వ్రాయవలెను. "○" దానికి ఎనిమిది కోణములు ఉంచవలయును.దాని వెలుపల నింకొక వృత్త మును వ్రాయవలెను. దానికి పదునారు దళముల పద్మము జతపరుప వలయును.

శ్లో॥ తద్బహి ర్వృత్త మాలిఖ్య లేఖయే ద్భూపురద్వయమ్
తతఃపరం చతుర్ద్వారం సుందరం తద్విలేఖయేత్

తా॥ దాని వెలుపల నింకొక వృత్తమును లిఖింపవల యును. దానికిఁ బైన భూపురములు రెండు వ్రాయవలయు పిమ్మట నాలుగు పర్యాయములు సుందర మంత్రమును, ద లిఖింపవలయును.

శ్లో॥ పరమాత్మ ప్రష్ట మోమ్కారం యంత్రమధ్యే విలేఖయేత్
అష్టాక్షరీ మహామంత్ర మష్టకోణేషు లేఖయేత్.

తా॥ మిక్కిలి శ్రేష్ఠతమమగు "ఓమ్" కారవ యంత్రమధ్యమునందు లిఖింపవలయును. అష్టాక్షరీ మహామ మును ఎనిమిది కోణములయందును లిఖింపవలయును.

శ్లో॥ ఏకాక్షరీ మహామంత్రం దేవస్య శ్రీ హనూమతః
షోడశాబ్జే చతుర్ష్వేవ దళే ష్వేవం విలేఖయేత్

తా॥ శ్రీ హనుమంతునియొక్క ఏకాక్షరీ మహామంత్రమును పదియారుదళములుగల పద్మమునందు నాలుగుదళములం దీరీతిగా లిఖింపవలయును.

శ్లో॥ షోడశాబ్జే మహారమ్యే పత్రేషు ద్వాదశస్వపి
సువర్చలాహనుమతో ర్లేఖయే ద్ద్వాదశాక్షరీమ్.

తా॥ పదియారు రేకులుగల పద్మమునందు మిగిలిన పది రెండు దళములయందును, శ్రీ సువర్చలా హనుమంతునియొక్క ద్వాదశాక్షరీ మహామంత్రమును వ్రాయవలయును.

శ్లో॥ భూపురాణాం షోడశాబ్జ దళానాం మధ్యభాగతః
అష్టాక్షరీ మంత్రరాజం చతురాశాసు లేఖయేత్

తా॥ పదియారు రేకులుగల పద్మమునకు భూపురములకు మధ్యభాగమునందు నాలుగుదిక్కులయందును శ్రీ హనుమ దష్టాక్షరీ మహామంత్రమును వ్రాయవలయును.

శ్లో॥ చతుర్వింశ త్యక్షరంచ భూపురేషు విలేఖయేత్

తా॥ భూపురములయందు శ్రీ హనుమత్ చతుర్వింశ త్యక్షర మహామంత్రమును వ్రాయవలయును.

శ్లో॥ యథా మాతా సుతం రక్షేత్ యథా యుద్ధేషు కంచుకమ్
తథా రక్షేత్ మహాయంత్రమ్ తద్గేహే యస్య చాస్తిచేత్॥

తా॥ తల్లి పిల్లను పెంచినరీతిగా, కవచము యుద్ధములలో రక్షించినరీతిగా, నే యింటియందు శ్రీ హనుమ ద్యంత్ర ముండునో; యా యింటియం దెల్ల వారిని నీ మహాయంత్రము సంరక్షించుచుండును.

శ్లో॥ తామ్రేవా రజతేవాథ సువర్ణేవా విశేషతః
యంత్రం లిఖిత్వా ప్రాణస్య ప్రతిష్ఠా మాచరే త్తతః

తా॥ రాగిరేకునందుఁగాని, వెండిరేకునందుఁగాని, బంగారురేకునందుఁగాని శ్రీ హనుమన్మంత్రమును వ్రాసి పిమ్మట ప్రాణప్రతిష్ఠను చేయవలయును.

శ్లో॥ సూర్యేందుగ్రహణే కాలే పుణ్యక్షేత్రే నదీతటే
అష్టోత్తరశతం సూర్యసంఖ్యాక్షరమనుం జపేత్ .

తా॥ సూర్యగ్రహణమునందును, చంద్రగ్రహణమునందును, పుణ్యక్షేత్రమునందును, నదీతీరమునందును శ్రీ హనుమద్ద్వాదశాక్షర మహామంత్రమును నూటయెనిమిది పర్యాయములు జపము చేయవలయును.

శ్లో॥ మధ్వాజ్యశర్కరాక్షీరై రభిషేకం సమాచరేత్
షోడశై రుపచారైశ్చ పూజయే ద్యంత్ర ముత్తమమ్.

తా॥ తేనె, ఆవునెయ్యి, పంచదార, ఆవుపాలతో యంత్రమునకు అభిషేకము చేయవలయును. షోడశోపచారములతో యంత్రమును పూజింపవలెను.

శ్లో॥ సర్వకామప్రదం నౄణాం మందవారే విశేషతః
ప్రత్యహంపూజయే ద్యంత్రం తత్ర లక్ష్మీ రచంచలా.

తా॥ ఈ యంత్రము మనుజులకు సర్వకామ్యములు సమకూర్చుచుండును. శనివారమునందుఁ బూజించుట మిక్కిలి శ్రేయస్కరము. ప్రతిరోజునందును యంత్రమును పూజించుచుండవలయును. ఈ యంత్రముగల యింటియందు లక్ష్మీదేవి శాశ్వతముగా నుండును. మిక్కిలి సంతోషముతో నృత్యము చేయుచుండును.

శ్లో॥ యంత్రపూజా యస్య గేహే తత్ర చోరాగ్ని నాశనమ్
రక్షో భూత పిశాచేభ్యో భయం నాస్తి న సంశయః

తా॥ ఈ యంత్రమును పూజించుచుండు గృహమునందు నెప్పుడును చోరభయముగాని, అగ్నిభయముగాని, యుండదు. రాక్షసబాధగాని, భూతభయముగాని, పిశాచపీడగాని యెంత మాత్రమునుకలుగవు. ఇందు కేమాత్రమును సంశయము లేదు.

శ్లో॥ రాజద్వారే రణద్వారే యంత్రధారీ న సీదతి
అరణ్యే వ్యాఘ్రసింహాద్యే నహి తస్య భయం క్వచిత్

తా॥ ఈ యంత్రమును ధరించినవానికి రాజద్వారము నందుఁగాని,యుద్ధద్వారమునందుఁగాని, యెంతమాత్రమును నేవిధ మగు భయములునుకలుగవు. పెద్దపులులు, సింహములు మొదలగు ఘోరమృగములుగల యడవియందైనను నేవిధముగాను నెందును భయమనునది కలుగనే కలుగదు.

కాన స్త్రీపురుషాదు లెల్లరు "సువర్చలా ద్వాదశాక్షరీ" మంత్రము నుపాసించుచు యంత్రరాజమును ధరించుచున్నచో సకలభోగముల నంది యంతమున హనుమత్సాయుజ్యము నందగలరు.

---

# గురుభక్తి లేకున్న మంత్రసిద్ధి లేదు

ఇందుకు ధ్వజదత్త చరిత్రము ప్రమాణముగాఁ జూపబడుచున్నది.

మైత్రేయః :—

శ్లో॥ పరాశర! మహాప్రాజ్ఞ! హనుమన్మంత్ర వైభవమ్
భూయోఽపి శ్రోతు మిచ్ఛామి కృపయా వద మే ప్రభో!

తా॥ మైత్రేయముని పరాశరమునీంద్రుని అడుగుచున్నాఁడు. ఓ పరాశరమునీంద్రా! మహాప్రాజ్ఞుఁడా! శ్రీహనుమన్మంత్రముయొక్క వైభవమును ఇంకను వినవలయునని కోరికగానున్నది. దయయుంచి చెప్పవలయును.

శ్లో॥ కేనచాదౌ పురా జప్తం హనుమన్మంత్ర ముత్తమమ్ ?
కేనోపదిష్టం గురుణా కస్మై శిష్యాయ ధీమతే?

తా॥ పూర్వము శ్రీహనుమన్మంత్రము ముందు నెవ్వరు జపించినారు? ఏ శిష్యుండు ఏగురువు కొద్ద నుపదేశమును పొందెను?

శ్లో॥ కస్య సిద్ధిప్రదం శీఘ్రం ప్తం విశ్వాసపూర్వకమ్?
విలంబితం ఫలం కస్య? తత్సర్వం ప్రతిపాద్యతామ్

తా॥ పూర్వము ఎవ్వరు జపమును విశ్వాసముకలవారై చేసినారు? ఎవరికి వెంటనే ఫలసిద్ధి కలిగినది? ఎవ్వరికి ఆలస్యముగ ఫలసిద్ధి కలిగినది? అదియంతయునుసవిస్తరముగాఁజెప్పవలయును

పరాశరః:-

శ్లో॥ ఇతిహాసం మహాపుణ్యం శ్రోతౄణాం సర్వకామ్యదమ్
సర్వపాపహరం నృణాం నారీణాం వా విశేషతః

తా॥ పరాశరమునీంద్రుఁడు మైత్రేయమునికిట్లు చెపచున్నాఁడు. ఓ మైత్రేయమునీ ! నేనొక్క ఇతిహాసమును చె

దను. అది మహాపుణ్యప్రదమైనది. ఇది వినినయెడల నెల్లవారికిని సకల ఫలముల నొసంగునది. పురుషులైనను లేక స్త్రీలైననుసరే వినిని వారల కందఱకును సర్వపాపములు పోగొట్టునది. అది వినుము.

శ్లో॥ సనత్కుమారవదనాత్ శ్రుత్వేమం బ్రహ్మసంసది
యథాశ్రుతం ప్రవక్ష్యామి శృణుష్వ మునిసత్తమ!

తా॥ ఈ ఇతిహాసమును బ్రహ్మదేవుని నిండుసభలో సనత్కుమారమునీందు్రిండు చెప్పఁగా నేను విన్నాను. అది నేను వినినట్లు నీకుఁ జెప్పెదను వినుము.

శ్లో॥ పురా కృతయుగే భూమౌ పుష్కరాఖ్యో మహామునిః
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః సర్వాగమవిశారదః

తా॥ పూర్వము కృతయుగములో భూలోకమునందుఁ బుష్కరాఖ్యుండను మహామునీందు్రిండు కలఁడు. అతఁడు సర్వ శాస్త్రములు సర్వ వేదాంతములు సర్వవిషయములు తెలిసిన వాఁడు. సర్వ దేవ తంత్రములు తెలిసినవాఁడు.

శ్లో॥ శాంతో దాంత స్సదాచార శ్శ్రద్ధావా ననసూయకః
సర్వవేదార్థసారజ్ఞ స్సదా మంత్రార్థతత్పరః

తా॥ అతఁడు అంతరింద్రియ నిగ్రహము, బహిరింద్రియ నిగ్రహము గలవాఁడు. మంచియాచారములు కలవాఁడు. మంచి శ్రద్ధకలవాఁడు. అన్ని వేదములలోని విషయములను గుర్తెఱింగిన వాఁడు. ఎల్లప్పుడును మంత్రములయందలి యర్థములను మహాసక్తితోఁ దెలిసికొనుచుండువాఁడు.

శ్లో॥ ఏవం సర్వగుణోపేతః హనూమా న్భక్తిమా న్మునిః
కదాచి దాత్మనో జప్తుం హనూమన్మంత్ర ముత్తమమ్

తా॥ ఇట్లు సర్వసుగుణములతో నిండియుండినట్టియును శ్రీ హనుమంతునియందు మంచిభక్తి గలిగినటువంటియునుముని, యెక్కడప్పుడు శ్రీహనుమన్మంత్రమును జపించుటకు,

శ్లో॥ నైమిశారణ్య మాకీర్ణం సర్వై ర్మునిగణై స్సదా
సిద్ధాశ్రమ మితి జ్ఞాత్వా సిద్ధయోగీ సమావిశత్

తా॥ సర్వమునీంద్రులతో నిండియున్నట్టియును నైమిశారణ్యమును సిద్ధాశ్రమమని తెలిసికొని, యోగము మంత్రము సిద్ధించుటకుఁగాను నందుఁ బ్రవేశించెను.

శ్లో॥ తత్ర గత్వా మహాయోగీ పుష్కరః పుష్కరేక్షణః
జజాప పరమం జప్యం హనూమ న్మంత్ర ముత్తమమ్

తా॥ సూర్యుండువలె మిక్కిలి ప్రకాశించుచున్నటువంటియును, పద్మములవంటి కన్నులు కలిగినటువంటియును, మహాయోగివీరుండునగు పుష్కరుండు అక్కడనుండి యుత్తమమైనటువంటి శ్రీ హనుమన్మంత్రమును జపానుసారముగా మిక్కిలి శ్రద్ధతో జపించెను.

శ్లో॥ సిద్ధత్వా న్మంత్రరాజస్య ఫలవ్యగ్రో న చాభవత్
నాపేక్షాం కురుతే తస్మిన్! సదా మంత్రరతో భవేత్

తా॥ ఆ యుత్తమమగు మంత్రము సిద్ధప్రద మగుటవల్ల ఫలశూన్యుండును కాలేదు. ఫలమును కోరుచున్నవాఁడును కాలేదు. అయితే మంత్రమునందు మాత్రము మిక్కిలి యాసక్తి కలవాఁడు అయ్యెను. ఎల్లప్పుడును జపమును చేయుచుయుండెను.

శ్లో॥ అథాస్మిన్ అంతరే బ్రహ్మన్ ! ధ్వజదత్తాహ్వయో ద్విజః
వేదవేదాంగసారజ్ఞః దరిద్రో బహుపుత్రవాన్

తా॥ పిమ్మట నింతలో ఓ మైత్త్రేయా! ధ్వజదత్తుఁడను పేరుగల బ్రాహ్మణుండు వేదములయొక్కయును శాస్త్రముల యొక్కయును సారమును తెలిసినవాఁడు. దరిద్రుఁడు. కుటుంబీకుఁడు. చాలమంది పిల్లలుకలవాఁడు.

శ్లో॥ ఉపాదానరతో నిత్యం గృహ్ణాతి సత్కుటుంబినః
నాలం క్షుదార్తయే తస్య శిశూనాం ధాన్య మార్జితమ్

తా॥ ఉపాదానముచేసికొనుచు మంచి గృహస్థునియొద్ద నేమైనను గ్రహించుచుండెను. అతఁడు సంపాదించుకొనిన ధాన్యము అతని సంతానమునకు ఆకలిబాధకు సరిపోవునది మాత్రము కాలేదు.

శ్లో॥ శాకాహారేణ తద్భార్యా జీవనం కురుతే స్వకమ్
శీలా నామ సుశీలాచ మహాసాధ్వీ కుటుంబినీ

తా॥ అతనిభార్య శీల యను పేరుకలది. మంచిస్వభావము కలది. మహాపతివ్రత. మిక్కిలి యోగ్యురాలు. కుటుంబముకలది. కూరలతోనే తన జీవనమును గడుపుకొనుచున్న యది.

శ్లో॥ కదాచిదపి నోవేత్తి హ్యన్నంవా సిద్ధమాత్రకమ్
పాతివ్రత్యా ద్వివేకాచ్చ సా నోపాలభతే పతిమ్

తా॥ ఒకప్పుడుకూడ నాయిల్లాలు ఒకముద్దయన్నమును గూడ నెరుగనేమెరుగదు. ఇట్లుండియును ఎక్కువ మంచి పతివ్రత యగుటవల్లను, మంచి పరిశీలనాజ్ఞానము కలదగుటవల్లను భర్తనుమాత్ర మెప్పుడును పల్లెత్తుమాటయైనను సని యెఱుంగదు.

శ్లో॥ నిజకర్మఫలం నూనం భోక్తవ్యమితి జానతీ
పతిం శుశ్రూషమాణా సా న చకంపే క్షుధావతీ

తా॥ తనకర్మఫలమే యనియును, అది తప్పక యనుభవించి తీరవలసినదేయని యనియును మాత్రము గుర్తెఱింగి యున్నది. భర్తగారికి శుశ్రూషచేయుచునేయున్నది. ఆకలి యెంత బాధించినను తనమనస్సునం దొకక్షణమైనను చలించినది కాదు.

శ్లో॥ శోకమాత్రేణ సా సాధ్వీ బహుకాలం నినాయ హ
న వివేద పతిస్తస్యా శ్శాకాహారం కదాచన.

తా॥ ఇట్లు విచారముతో నా యోగ్యురాలు, చల్లని తల్లి చాలకాలము గడిపినది. పతికిమాత్రము ఆమె అన్నమును తినుట లేదనియును, శాకములనుమాత్రమే తినుచున్నదనియును తెలియనే తెలియదు.

శ్లో॥ అన్నం భుక్త్వాఽవశిష్టంతు భోక్ష్యతీత్యేవ మన్యతే
సాపి న ప్రేయసీ ప్రాహ నాన్నం మేఽస్తీతి భామినీ.

తా॥ అతఁడు అన్నమునుతిని మిగిలినయన్నమును భార్య తినుచున్నదని యనుకొనుచుండెను. ఆ ప్రియురాలుకూడ అన్నము మిగులలేదని భర్తతో నెన్నండును చెప్పలేదు.

శ్లో॥ ధ్వజదత్తో మహాప్రాజ్ఞ ఉపాదానరతోఽపి సః
అధ్యాపయత్ బహూన్ విప్రాన్ తత్రా స బ్రహ్మచారిణః

తా॥ మహాప్రాజ్ఞుండగు ధ్వజదత్తుండు ఉపాదానము చేసికొనుచుండువాఁడైనను చాలమంది విద్యార్థులకు నిత్యమును వేదపాఠములు అధ్యయనము చెప్పుచుండువాఁడు. ఇట్లు కాలము గడుచుచుండెను.

శ్లో॥ అథాసీనో బహి ర్వేద్యాం పరీక్షాం కర్తు ముద్యతః

తా॥ పిమ్మట వీధియరుగుమీఁదఁ గూర్చొనినవాఁడై విద్యార్థులను పరీక్షచేయుటకుఁ బ్రయత్నించుచున్నవాఁడు.

శ్లో॥ సామగాన్ కతిచి ద్విప్రాన్ యాజుషాన్ బహ్వృచానపి
అన్యా నాథర్వణాంశ్చైవ గాంధర్వానపి గారుడాన్.

తా॥ సామవేదము చదువుచున్నవారలను కొందఱిని, యజుర్వేదము చదువుచున్నవారలను కొందఱిని, ఋగ్వేదము చదువుచున్నవారలను కొందఱిని, అథర్వణవేదము చదువుచున్న వారలనుకొందఱిని, గంధర్వవిద్య చదువుచున్నవారలను కొంద ఱిని, గరుడమంత్రములు చదువుచున్నవారలను కొందఱిని,

శ్లో॥ హనుమద్వేదశిరసి నిష్ణాతానపి వై ద్విజాన్
మాండూకానపి నానాంశ్చ తాన్ పరీక్షితవాన్ ద్విజః.

తా॥హనుమద్వేద గహస్యమంత్రములు నేర్చుచుండువార లను కొందఱిని, మండూకోపనిషత్తులు నేర్చుచుండువారలను కొందఱిని, అనేకులను విద్యనేర్చుకొనుచుండువారలను బ్రాహ్మ ణులను ధ్వజదత్తుండు పరీక్షించుచుండెను.

శ్లో॥ ఆహూతవా న్నిజం పుత్త్రం ధర్మదత్తః పరీక్షితుమ్.

తా॥ ధ్వజదత్తుండు తన కుమారునిని గూడఁ బరీక్షించు టకు రమ్మని పిలిచెను.

శ్లో॥ ఆహూతోపి న నిష్క్రాంతః క్షుధార్తో మాతృసన్నిధేః

తా॥ ఇట్లు పిలిచినను ఆకలిబాధకలవాఁడై తల్లిదగ్గఱనుండి రాలేదు.

శ్లో॥ క్షుధితాపి మహాసాధ్వీ శాకాహారం స్వకం దదౌ

తా॥ ఆ మహాపతివ్రత శీలాంబకూడ మిక్కిలి యాకలి బాధపడుచున్నను తన కుంచుకొన్న కూరకూడ నా పిల్లవాని కిచ్చెను.

శ్లో॥ పుత్త్రాయ క్షుధితాయాశు పరీక్షా దీయతామితి
పుత్త్రే చిరాయమాణేతు ధ్వజదత్త ఉపాగమత్

తా॥ ఇట్లు ఆకలిబాధలోనుండు పుత్త్రునిఁ దొందఱగాఁ బరీక్షచేయవలయు నను నభిప్రాయముకల ధ్వజదత్తుండు కుమారుం డాలస్యము చేయుచుండుటవల్లఁ దొందరపడి తానే వాని దగ్గఱకు వెళ్ళెను.

శ్లో॥ దదర్శ భక్షమాణం తం శాకం తన్మాతృసన్నిధౌ

తా॥ తల్లిదగ్గఱఁగూరమాత్రము తినుచున్న పిల్లవానిని జూచెను.

శ్లో॥ అథాబ్రవీ త్సపుత్త్రాం తాం ప్రేయసీం మితభాషిణీం
త్వయా కిం భక్ష్యతే? సాధ్వి! యతో నాయాతి పుత్త్రకః?

తా॥ పిమ్మటఁ బిల్లవానితోఁ గలసియుండినటువంటి యును, మితభాషిణి యయినటువంటియును, తన ప్రియురాలిని "నీవు భోజనము చేసినావా? అబ్బాయియెందుకు ఇంతవఱకు రాలేదు? కారణమే ? మని" యడిగెను.

శ్లో॥ స్వవృత్తదర్శనా త్సాధ్వీ లజ్జితాచ ముహుర్ముహుః
ఉచ్యమానాఽపి భర్త్రా సా నోత్తరం ప్రతిపద్యతే

తా॥ తన సంసారమునందలిగుట్టు భర్తకుఁ దెలిసినదని సిగ్గుకలదై, భర్త చాలసారులు అడుగుచున్నను పిలుచుచున్నను తిరుగుమాట చెప్పలేకపోయినది.

శ్లో॥ విలంబాసహమానస్సః శాకపాత్రం త మస్పృశత్
అన్నాభావా దిదం భుక్త మితి నిర్విణ్ణమానసః

తా॥ ఆలస్యమును చూచి యోర్వలేక ధర్మదత్తుండ ఆ కూరయున్న పాత్రను పట్టుకొనెను. అన్నములేకపోవుటవ

నిట్లు కూరమాత్రమునే తినుచుండిరిగదా! యని తెల్లపోయి విచారముకలవాఁడై,

శ్లో॥ నినిందాత్మాన ముద్బుద్ధః ధి గ్జీవన మిదం మమ

తా॥ నా జీవనము మిక్కిలిపనికిరానిదని యా సమాచారము నంతయును బాగుగాఁదెలిసికొని, తననుతానే యనేక విధములుగా నిందించుకొనుచుండెను.

శ్లో॥ శ్రుతం ధిఙ్మేఽఖిలం శాస్త్రం ధిగాచార మితీరయన్
యత స్సాధ్వీ మహాప్రాజ్ఞీ శాకాహారేణ జీవతి.

తా॥ మహాయోగ్యురాలును, మిక్కిలి తెలివిగలదియును, పతివ్రతయు నగు భార్య అన్నము లేకపోవుటవల్లఁ గూర మాత్రముతిని బ్రతుకుచున్నదిగదా! యని మిక్కిలి దుఃఖించుచు నేను వేదములు చదివినంతమాత్రముచే నేమిలాభము? శాస్త్రములు నేర్చికొనినంతమాత్రముచే నేమిప్రయోజనము? ఆచారములు తెలిసికొనినంతమాత్రముచే నేమియుపయోగము? భార్యకు ఆహారము సరిగానున్నదా? లేదా? యని చూడకపోయిన నా జీవనము నిష్ప్రయోజనము. అని చెప్పుచు నిందించుకొనుచుండెను.

శ్లో॥ అథోవాచ ప్రియాం విప్రః దయయావిష్టచేతనః
దుఃఖగద్గదయా వాచా ప్రేయసీదైన్యదర్శనాత్.

తా॥ పిమ్మట ధ్వజదత్తుండు మిక్కిలి జాలిగుండెగలవాఁడై, విచారముతోనిండియున్న మిక్కిలిహీనమగు స్వరముతో తన ప్రియురాలి దీనత్వమునుచూచిచూచి యిట్లు పలికెను.

శ్లో॥ యత్ర కుత్రాప్యటన్ భార్యే! త్వన్ముఖాంభోజదర్శనాత్
విస్మృత్యాధ్వపరిశ్రాంతిం సద్యో నిర్వృతి మాప్నుయామ్.

తా॥ నానాప్రదేశములును ఎక్కడనో యొకచోట నియమములేక తిరిగితిరిగివచ్చి, తామరపూవువలె మిక్కిలి కల కలలాడుచున్న నీముఖముచూచి, యా యానందమువల్ల నేను త్రోవలోఁబడిన శ్రమనంతయును మఱచిపోయి, యో సతీరత్నమా! మిక్కిలి సుఖమును పొందుచుండెడివాఁడను.

శ్లో॥ స్త్రీణాం పుత్త్రాః ప్రియో, భర్త ర్లోకే సర్వత్ర దృశ్యతే
మయి తేతు పరా ప్రీతిః పుత్త్రేభ్యోఽప్యతిరిచ్యతే.

తా॥ లోకములో స్త్రీలకందఱకును భర్తమీఁదకంటెఁ బిల్లలమీఁదఁ బ్రేమయెక్కువగాఁ గనఁబడుచుండును. నీకు మాత్రము పిల్లలయందుఁగంటెఁగూడ నాయందుమిక్కిలి ప్రేమ యెక్కువగా నున్నది.

శ్లో॥ ప్రసన్నవదనా నిత్యం స్మితపూర్వాభిభాషిణీ
స్వప్నేపి ప్రతికూలా త్వం నజానాసి హితైషిణీ.

తా॥ ఎల్లప్పుడును ప్రసన్నముఖము కలదానవై యుండుదువు. ఎప్పుడుచూచినను చిఱునవ్వు నవ్వుచునే మాటలాడుచుండుదువు. ఏవిధముగానైనను మేలుపల్కులునే చెప్పుచుండుదువు. శ్రేయమునే కోరుచుండుదువు. స్వప్నములోఁగూడ నాకు వ్యతిరేకముగా నడచుకొను స్వభావము కలదానవుకావు.

శ్లో॥ జలం శాకంచ మూలంవా త్వయా సంపూర్ణచిత్తయా
దత్త మశ్నా మ్యహం నిత్య మమృతం దేవతా యథా

తా॥ నీవు నిండుమనస్సుతో నీరిచ్చినను, కూరపెట్టినను, దుంపలు వేరులుఇచ్చినను దేవతలు అమృతమును ఆప్యాయముతో భుజించినరీతిని నేను ప్రతిరోజును భుజించుచున్నాను.

శ్లో॥ యావనం మధ్యమే లోకే ప్రసూత్యంత మితీరితమ్

తా॥ భూలోకములోఁ బిల్ల పుట్టువఱకే యౌవనముండు నని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ బహుపుత్త్రాऽపి రమ్యాత్వం యథా షోడశవార్షికా

తా॥ అనేకులు పుత్త్రిలు కలిగియున్నను నీవు మిక్కిలి మనోహరముగానున్నావు. పదియారు సంవత్సరములు ప్రాయ ముగల పడుచుపిల్ల వుగా నున్నావు.

శ్లో॥ వాసంతీ మాలికావ త్త్వం యదా శయ్యా మధిష్ఠితా
తదాహం తృణవ న్మన్యే గంధర్వీంవా సురాంగనామ్

తా॥ నీవు వసంతఋతువునందలి మల్లి పూవుల దండవలె నా శయ్యామీదకు వచ్చినంతనే గంధర్వస్త్రీనిగాని. దేవతాస్త్రీని గాని యొక గడ్డిపరకవలెఁ దలచుచుండువాఁడను. అంతటి యానందమును కలిగించుచుండెడిదానవు.

శ్లో॥ ఆనుకూల్యాచ్చ నారీణాం ప్రాతికూల్యం వరం స్మృతమ్
వియోగే ప్రతికూలాయాః పతి స్సంతోష మృచ్ఛతి.

తా॥ లోకములో సామాన్యముగా ననుకూలవతియగు భార్యకంటెఁ బ్రతికూలయగు భార్యయే కొంచెము మంచిదని చెప్పుదురు. ఎందుకనఁగాఁ బ్రతికూలయగు భార్య వియోగమును పొందినప్పుడు భర్తసంతోషించును. అనుకూలయగు భార్య అవి తెమ్మని ఇవి తెమ్మని యెల్లప్పుడును పెనిమిటిని బీడించును. ఇది లోకమర్యాద.

శ్లో॥ మత్పూర్వపుణ్యవిభవా త్త్వద దుష్కృతకారణాత్
మన్యే పాణిగృహీతాం మే భవంతీ మమరాంగనామ్.

తా॥ నేను చేసికొనిన పూర్వపుణ్యావిశేషములవల్లను, నీవు చేసికొనిన పూర్వపాపఫలమువల్లను, నావంటి గర్భదరిద్రు

నను నీవంటి దేవతాస్త్రీవి భార్యవై, నాచేయిపట్టి వివాహము చేసికొన్నావు. అని నేను మనస్సులో నిప్పు డనుకొనుచున్నాను.

శ్లో॥ అరుంధత్యా అహల్యాయా ద్రౌపద్యాఅపి సువ్రతే!
తారాయాఅపి సీతాయా స్సత్యవత్యా స్తథైవచ.

తా॥ అరుంధతీ దేవికిని, అహల్యాదేవికిని, ద్రౌపదీ దేవికిని, తారాదేవికిని, సీతాదేవికిని, ఓ పతివ్రతా!

శ్లో॥ అన్యాసామపి నారీణాం ప్రాతివత్య మనుత్తమమ్
ఇతిహాసపురాణాద్యై శ్శ్రూయతే నైవ దృశ్యతే

తా॥ ఇతరులగు మఱికొందఱు స్త్రీలకును అసమానమగు పాతివ్రత్యము కలదనిమాత్రము వినుచున్నాముగాని యెప్పుడును నెందునుచూచి యెఱుగము. ఇతిహాసములు చదివినను, పురాణములు చదివినను ఇవి వినఁబడుచుండును. గాని యెందును గనఁబడదు.

శ్లో॥ భవత్యాంతు విశేషేణ కాలేన మహతా ప్రియే!
పాతివ్రత్యపరాన్ ధర్మాన్ దృష్టవానసి సాంప్రతమ్

తా॥ ఓ ప్రియురాలా! నీయందుఁ జాలకాలమునుండి యెంతయో యెక్కువగా నా పాతివ్రత్యధర్మములకంటె మిక్కిలి విశేషములగు మంచిమంచి ధర్మము లున్నవని నే నిప్పుడు గుర్తించినాను.

శ్లో॥ కళ్యాణగుణపూర్ణత్వాత్ పశ్యతోఽహర్నిశం మమ
చక్షుష్మత్తేయ మన్వర్థా చిరాయ చరితంప్రతి

తా॥ నేను మంచిసుఖములు శుభములు నీవల్ల ననుభవించుచుండుటవల్ల రాత్రింబవళ్ళు నిన్నుఁ జూచుచుండినను చాలకాలమున కిప్పటికైనను నాకుఁ గన్నులు కలుగుటకు సార్థ

ముగాఁ గన్నులపండువుగా నీ ప్రవర్తనము నాకుఁ దెలిసినది. కన్నులారఁజూచి మిక్కిలి సంతోషించినాను.

శ్లో॥ సహస్రమర్థయేఽక్షీణాం తవ సౌందర్య మీక్షితుమ్

తా॥ మిక్కిలి పెంపొందుచున్నట్టి నీసౌందర్యముచూచుటకు నాకు వెయ్యికన్నులు కావలెనని కోరుచున్నాను. ఈ రెండు కన్నులతోఁ జూచుచుండినమాత్రమున నాకుఁ దృప్తిగా నుండుట లేదు. అంత యందముగలదానవు.

శ్లో॥ వర్ణితం తవ సౌశీల్యం సహస్రరసనాఅపి

తా॥ అట్లే నీ యొక్క మంచిస్వభావమును వర్ణించుటకు నాయొక్క యీ నాలుకయొక్కటియును చాలదు. కావున వెయ్యినాలుకలు కావలెనని కోరుకొనుచున్నాను.

శ్లో॥ సహస్రభుజశాఖాంశ్చ తవాంగ ముపగూహితుమ్

తా॥ నీ శరీరమును కౌగలించుకొనుటకు ఈ రెండు భుజములును చాలవు. కావున వెయ్యిభుజములు కావలెనని కోరుకొనుచున్నాను.

శ్లో॥ అతిసౌందర్యసారేఽపి గర్వలేశోఽపి నాస్తి తే

తా॥ ఇంత ఎక్కువ యందముకలదానవైనను నీ కిసుమంతయును గర్వము లేదుకదా!

శ్లో॥ నచావమన్యసే కాంచి త్కురూపామపి భామినీమ్

తా॥ కురూపియగు నితరస్త్రీ యెవ్వరు కనిపించినను సంతోషించుచుండుదానవు గాని యెంతమాత్రమును విసుకుకొనుటగాని, ద్వేషించుకొనుటగాని, యవమానించుటగాని, ఎరుగనేయెరుగవు. ఇటువంటి మంచిసుగుణములు కలిగియుండుదానవు.

శ్లో॥ తవ సౌందర్యసంపత్త్యా పాతివ్రత్యగుణేనచ
దారిద్ర్యమపి దుర్ధర్షం మనుమన్యే కథంచన

తా॥ నీ సౌందర్యసంపత్తిని జూచినను, నీ పాతివ్రత్య గుణమును జూచినను, అతికష్టమగు నిట్టి దారిద్ర్యమును ఎట్లు అనుభవించుచున్నావో ? కదా ! యని యనుకొనుచున్నాను.

శ్లో॥ ఈదృశీం భవతీం భార్యాం మామేవ ధ్యాయతీం సదా
విహాయ క్వ గమిష్యామి ప్రియే ! దారిద్ర్యకారణాత్

తా॥ ఓ ప్రియసీ ! ఇట్టి సుగుణములుగల నన్నే యెల్లప్పుడును ధ్యానించుచుండునట్టి యోగ్యురాలవగు నిన్నువిడిచి ఈ దారిద్ర్యబాధను నివారించుకొనుటకు ఎట్లు ఎక్కడికి వెళ్ళగలను ?

శ్లో॥ మదీయం గృహమాగత్య కింను భుక్తం? త్వయా ప్రియే !

తా॥ ఓ సుదతీ! నాయింటికివచ్చి నీవేమిసుఖ మనుభవించినావు?

శ్లో॥ ధర్మార్థకామమోక్షాణాం త్వం మూలమితి నిశ్చయః

తా॥ ధర్మమునకుంగాని, ధనమునకుంగాని, కామమునకుంగాని, మోక్షమునకుంగాని నిశ్చయముగా నిన్ని సుగుణసంపత్తులుగల నీవే ముఖ్యాధారము. నీవల్లనే ఈనా పురుషార్థములు కలుగును సఫలము లగును.

శ్లో॥ అన్నపానై ర్యథాకామం వస్త్రై రాభరణై రపి
న ప్రీణయతి యో భార్యాం స పుమాన్ పురుషాధమః

తా॥ అన్నము పానీయములు వస్త్రములు ఆభరణములు కోరికల ననుసరించి సంతృప్తిగా నొసంగి భార్యను ప్రీతిపరచలే భర్త యధమాధముఁడు.

శ్లో॥ పితా రక్షతి కౌమారే, భర్తా రక్షతి యౌవనే
పుత్రాః రక్షన్తి వార్ధక్యే, న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి

తా॥ చిన్నతనమందుఁదండ్రి పోషించుచుండును. పడుచుతనమునందు భర్త పోషించుచుండును. ముసలితనమునందు సంతానము పోషించుచుండును. కావున స్త్రీ తాను స్వాయత్తముగాఁ గష్టపడి జీవింపవలసిన యవసరము లేదు. అట్లు కష్టపడి జీవించుట యెంతమాత్రమును తగదు.

శ్లో॥ అనుకూలా ప్రియా సాధ్వీ యస్యాఽస్తి నిజమందిరే
తదేవ భవనం నోచే ద్వృథాఽరణ్యం తథా గృహమ్

తా॥ అనుకూలవతియు సాధ్వియగు ప్రియురాలు ఉండిన గృహమే గృహము. అట్లుకాదేని ఆగృహము అరణ్యముతో సమానముకదా !

శ్లో॥ పతివ్రతా సుశీలాచ సురూపా సాధుభాషిణీ
కులజా భవతీ సాధ్వీ కథం త్వాం త్యక్తు ముత్సహే?

తా॥ నీవు పతివ్రతవు. మంచిస్వభావము కలదానవు. మిక్కిలి యందమగుదానవు. మధురముగా మాటలాడుదానవు; మంచికులములో జన్మించియున్నావు. సాధుమూర్తివి. నిన్ను నెట్లు విడుచుటకునేను సహింపఁగలను? కావున నిన్ను విడిచి వెళ్ళలేను.

శ్లో॥ సాధ్వీ భార్యాచ యస్యాస్తిఽస మాన్యో బంధుభి ర్జనైః
సఏవ పురుష శ్లాఘ్యః స్సయోగ్య స్సర్వకర్మసు

తా॥ యోగ్యురాలగు భార్య యెవ్వనికుండునో యతఁడు బంధువులచేత గౌరవింపఁబడుచుండును. అతనినే యందఱును కొనియాడుచుందురు. అతఁడే యన్ని శుభకర్మలయందును, అన్ని సత్కార్యముల యందును మిక్కిలి పూజింపఁదగినవాఁడు.

శ్లో॥ వృద్ధౌచ మాతాపితరౌ సాధ్వీ జాయా సుత శ్శిశుః
అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మను రబ్రవీత్

తా॥ ముసలివాండ్రగు తల్లిదండ్రులును, యోగ్యురాలగు
ార్యయును, పసిపిల్లవాఁడు అగు కుమారుండును, ఎన్ని లోప
ులు చేసినను సహించియుండుటయే మంచి దని మనువు
ర్మశాస్త్రమునందు నిరూపించియున్నాఁడు.

శ్లో॥ పఙ్క్తిభేదీ పృథక్పాకీ నిత్యం బ్రాహ్మణదూషకః
విప్రద్రవ్యాపహర్తాచ బ్రహ్మహంతా తథైవచ

తా॥ పఙ్క్తిలో వేరువేరు భేదములుగా గమనించుట
ని, తాను వేఱుగా వండుకొని తినుచుండుటగాని, యెల్ల
డును బ్రాహ్మణులను దూషించుచుండుటగాని, బ్రాహ్మణుల
ుక్క ద్రవ్యములను అనుభవించుచుండుటగాని, బలాత్కార
ుగాఁ దీసుకొనుటగాని,

శ్లో॥ ఏవంముఖా శ్చతుర్దశ మహాపాతక సంజ్ఞికాః

తా॥ ఇవి మొదలగునవి పదునాలుగును మహాపాతకము
ు చెప్పబడుచున్నయవి.

శ్లో॥ తస్మా దుపేక్షమాణస్య సాధ్వీం త్వాం హితభాషిణీం
ప్రాయశ్చిత్తోపదేశం మే వక్తు మర్హాసి సాంప్రతమ్

తా॥ కావున హితభాషిణివైన యోగ్యురాలవగు నీవిట్లు
పడుచున్నను ఊరకే చూచుచున్న నాకేదియో యా
పము పోవుటకు దగిన ప్రాయశ్చిత్తమును దెలుపుము.

శ్లో॥ ఇతి నిందిత మాత్మానం ఖిద్యంతంచ పునఃపునః
భర్తారం ప్రాహ సా సాధ్వీ కిమర్థం ఖేద ఈదృశః ?

తా॥ ఇట్లు తనను నిందించుకొనుచు ననేకవిధములుగా విచారించుచున్నటువంటి భర్తతో నాపతివ్రత యిట్లు చెప్పెను. నాథా! ఈ భేదభావము తమరెందుకు గమనించెదరు?

శ్లో॥ ఉచితం కిమహో ప్రాజ్ఞ! ధీరోదాత్తస్య తే ప్రియ!
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః కిమర్థం కథ్యతే ప్రభో!

తా॥ తమరు ధీరోదాత్తులు కదా! ఎన్నికష్టములుగాని లోపల నిమిడించుకొని గంభీరభావముతో నుండువారుకదా! ఇట్లు భేదభావముతోఁ బలుకుట తమవంటివారి కుచితమా? తమరు సర్వశాస్త్రములు తెలిసికొనినారు, వానిలోని నిశ్చయ జ్ఞానమును గుర్తెఱింగియున్నారు. ఓ స్వామీ! ఇట్లు ఎందుకు మాటలాడుచున్నారు? ఇది మీకు ధర్మమా?

శ్లో॥ నిజకర్మాణి సర్వాణి భోక్తవ్యాని న శంసయః
ఈదృశాన్యేవ కర్మాణి కృతాన్యస్మాభి రంజసా.

తా॥ లోకములో నేరికైనను తాముచేసిన కర్మముల యొక్క ఫలము లనుభవించక తప్పదు. సందేహము లేదు. మనము పూర్వజన్మములో అజ్ఞానమువల్ల నిటువంటి చెడుకర్మములనే చేసికొనినాము. కావుననే యిట్టికష్టముల ననుభవింపుచున్నాము.

శ్లో॥ కణమాత్రం జలంవాపి అన్నంవా సిద్ధమాత్రికమ్
సత్పాత్రే నార్పితం యస్మా త్తస్మా ద్దారిద్ర్య మాగతమ్.

తా॥ ఒక్క చుక్క మంచినీరుగాని, ఒక్క మెతుకు అన్నముగాని, మనము సత్పాత్రులకు ధర్మముచేసిన వారము కాము. కావున నిటువంటి దారిద్ర్యము మనకుఁ గలిగినది.

శ్లో॥ కోవా విచారయే దర్థే హ్యావశ్యం భావినీదృశే
తస్మా ద్వివేకిన స్తత్ర విచారో నైవ సాంప్రతమ్

తా॥ తాను చేసిన కర్మ ప్రకారము తప్పక జరుగుచున్న యిట్టి విషయమునం దెవ్వరును విచారింపరాదు. కావునఁ బరిశీలించి చూచినయెడల నిష్ఫలమైనట్టి విచార మెంతమాత్రమును యుక్తముకాదు. అనుభవించియే తీరవలయును.

శ్లో॥ ఇత్యుక్త్వా వచనం సాధ్వీ పాదయో ర్నిపపాత హ

తా॥ అని చెప్పి యా పతివ్రత భర్తయొక్క రెండుపాదములమీఁదను సాష్టాంగముగాఁబడి ప్రణమిల్లినది.

శ్లో॥ నిపతంతీం నిజాం భార్యా మాలింగ్యచ పునఃపునః
ఆదృత్య సాంత్వవచసా దేశకాలోచితేన సః.

తా॥ ఇట్లుపాదములమీఁదఁ బడియున్న భార్యను లేవఁదీసి, ప్రేమముతోఁ గౌఁగలించుకొని, ఆ యా రీతులచే, దేశమునకు, కాలమునకును తగినట్లుగా మంచిమాటలచేత నాదరించి, గౌరవించి, మోదార్చి, యూరడించి,

శ్లో॥ ఆదాయ దేవతాం స్వాంచ ఉపాదానపరో యయౌ

తా॥ తన వెంటఁ దన దేవతయును వచ్చుచుండఁగా నుపాదానమునకుఁగాను బయలుదేరి వెళ్ళెను.

శ్లో॥ తదేవ చింతమానస్య గచ్ఛతో దిశ ముత్తరామ్
చింతా సమభవ త్తస్య ధ్వజద త్తస్య ధీమతః

తా॥ అదేచింతతోనుండి యుత్తర దిక్కుగా వెళ్ళుచున్నటువంటి ధ్వజదత్తుని మనస్సునం దొక యాలోచనము కలిగెను.

శ్లో॥ తపసావా మహోగ్రేణ వేతనేనాథవా పునః
యజనాధ్యాపనాభ్యాంవా ఆనయిష్యే ధనం బహు.

తా॥ మిక్కిలి గొప్పతపము చేసికాని, మంచిజీతము తీసి కొని యుద్యోగము చేసికాని, యజ్ఞముచేయించికాని, చదువు చెప్పికాని, ఎక్కువధనమును సంపాదింతును. అని సర్వవిధముల చేతను అనేక భేదములుగా నాలోచనము చేసికొనుచుండెను.

శ్లో॥ ఇతి ముదితమనా హ్యుపాయ యోగా
న్ని జసుఖలేశ పరాఙ్ముఖాభిమానః
జ్వలితహుతభుజం ప్రభాతకాలే
మునివర మండిత మభ్యగా ద్ద్విజేంద్రః

తా॥ ఇట్లు చాల సదుపాయములు తోచుచుండుటవల్ల నెంతయును సంతసించి, తన కష్టములు పోవునని తలంచి, మోదియో రీతిని సుఖ మొక కొంతయైనను కలుగుననినిశ్చయించికొని, ప్రాతఃకాలముననందే బయలుదేరి, బాగుగా హోమగుండము లలో నగ్నిజ్వాలలు ప్రజ్వలించుచుండునట్టి మునీశ్వరు లుండు తపోవనమునకు శ్రీ ధ్వజదత్తుండు వెళ్లెను.

మైత్రేయః:—

శ్లో॥ కిమకార్షీ? ద్వనం గత్వా ధ్వజదత్తఃపరాశర!
తద్వనంవా కిమాఖ్యాతం ? తన్మే బ్రూహి మహామునే!

తా॥ మైత్రేయుండు పరాశరమునిని అడుగుచున్నాఁడు. ఓ పరాశరమహామునీ! ధ్వజదత్తుండు ఏవనమును ప్రవేశించినాఁడు? ఆ వనమునందతఁడేమి యొనరించెను? ఆసంగతియంతయునునాకు సవిస్తరముగాఁ జెప్పుము.

పరాశరః:—

శ్లో॥ తద్వనం నైమిశారణ్యం యత్రాస్తే పుష్కరో మునిః
యత్ర సంతి మునివ్రాతాః అపరే కశ్యపాదయః

తా॥ పరాశరుఁడు చెప్పుచున్నాఁడు. ఓ మైత్రేయమునీ. పుష్కరముని నివసించునట్టియును, కశ్యపుఁడు మొదలగు ముని సంఘములు సంచరించునట్టియును నైమిశారణ్యమునకు ధ్వజదత్తుఁడు వెళ్లినాఁడు.

శ్లో॥ జపంతో భవ్యమంత్రాంశ్చ ధ్యాయంత శ్చేష్టదేవతాః
పాయశో హనుమద్భక్తా స్తన్మంత్రజపతత్పరాః

తా॥ ఆవనమునందు మునులందఱును తమతమ ముఖ్యమంత్రములను జపించుచుందురు. తమతమ ఇష్టదైవములను ధ్యానము చేయుచుందురు. శ్రీ హనుమద్భక్తులందఱును శ్రీ నైమిశారణ్యమునందు శ్రీ హనుమన్మంత్రములను మిక్కిలి మహాభక్తితో నందుఁ దఱచుగా జపములు చేసికొనుచుందురు.

శ్లో॥ నిత్యహోమపరాః కేచిత్ కామ్యహోమపరాః పరే
అన్యే కర్మపరిత్యక్తాః కేవల ధ్యాన తత్పరాః

తా॥ కొందఱు ఎల్లప్పుడును హోమములే చేసికొనుచుందురు. మఱికొందఱు తమతమ కోరికల ననుసరించి యా యా కాలములందు నా యా హోమములు చేసికొనుచుందురు. ఇంకనుం గొందఱు కర్మములు చేసిచేసి, తుదకు సర్వకర్మలను పరిత్యజించి: కేవలము మానసిక ధ్యానములనుమాత్రమే చేసికొనుచుందురు.

శ్లో॥ ఇత్యేవం వివిధై ర్వ్యాప్తం బహుభి ర్మునిపుంగవైః

తా॥ ఇట్లు అనేకవిధములుగల మునిచంద్రులచే నా నైమిశారణ్యము మిక్కిలి ప్రకాశించుచున్నయది.

శ్లో॥ ధ్వజదత్తో వనం వీక్ష్య విస్మయం పరమం యయౌ

తా॥ ధ్వజదత్తుండు ఆ వనమునుచూచి మిక్కిలి యెక్కువ యాశ్చర్యమును పొందెను.

శ్లో॥ దంతధావనపర్ణాని సమిత్పుష్పఫలానిచ
గృహీత్వా నిజపాణిభ్యాం ప్రవిష్టో వనగహ్వరమ్

తా॥ పన్నులు పరిశుభ్రము చేసికొనుటకుఁ దగినయాకులుఁ సమిధలు పువ్వులు పండ్లు తనచేతులతో గ్రహించి వనములోఁ బ్రవేశించినాఁడు.

శ్లో॥ యత్రాస్తే పుష్కరో యోగీ హనుమద్ధ్యానతత్పరః
సూర్యబింబసమజ్యోతి ర్హనుమన్మంత్రవైభవాత్

తా॥ పిమ్మట మంత్రమును మిక్కిలి ప్రీతితో ధ్యానము చేయుచుండునట్టియును, శ్రీహనుమంతునియొక్క మహామంత్రములను ధ్యానము చేయునట్టి వైభవమువల్ల సూర్యబింబముతో సమానముగా మిక్కిలి ప్రకాశించుచున్నట్టి పుష్కర మహా మునీంద్రుండు నివసించుచున్నట్టి పుణ్యప్రదేశమునకు వెళ్లినాఁడు.

శ్లో॥తం దేశ మగమ ద్దీప్తం శస్త్రై ర్భీతో మహాత్మనః
తూష్ణీం తస్థౌ తదధ్యాసే విస్మృత స్వార్థ సంభ్రమః

తా॥ ఇట్లు పుష్కరమునీంద్రుండున్న చోటును ప్రవేశించి, వారి యనుష్ఠానములు చూచుచుండి, తాను వచ్చిన పనికూడ మఱచిపోయి మెల్ల మెల్లగా నందు నూరకయుండెను.

శ్లో॥ యదృచ్ఛయా మునీంద్రోపి మాధ్యాహ్నిక ముపాసితుమ్
నివృత్తయోగ స్తత్రైవం నివృత్త స్వాంతరాత్మనః

తా॥ పుష్కరుండును నంతలో నకస్మాత్తుగా మధ్యాహ్న కర్మను ఉపాసనము చేసికొనుటకుఁగాను తాను చేయు యోగమును విరమించుకొని, మానసికారాధన మార్గమును కూడ నిలిపివేసెను.

శ్లో॥ధ్వజదత్తో మహాప్రాజ్ఞః వీక్షమాణే మహామునౌ
ఉపహారం నివేద్యాదౌ సాష్టాంగం ప్రణతోఽభవత్

తా॥ అంతట ధ్వజదత్తుండు దమహాప్రాజ్ఞుండుగనుక నా సమయమును కనిపెట్టి పుష్కరమహాముని చూచుచుండఁగా వానిముందుఁ దాను తీసికొనివచ్చిన పారితోషికమును ముందు నుంచి సాష్టాంగ నమస్కారము చేసెను.

శ్లో॥ అథాఽబ్రవీ న్మహాభాగో ధ్వజదత్తం ద్విజోత్తమమ్
కిమర్థ మాగతో? బ్రహ్మ౯! కేనవాఽపకృతో భవా౯?

తా॥ పిమ్మట నాపుష్కర భగవానులు బ్రాహ్మణోత్తముఁడగు ధ్వజదత్తునిఁ జూచి నీవెందుకు వచ్చినావు? నీకెవ్వనివల్ల నపకారము సంభవించినది?

శ్లో॥ నిర్విణ్ణవదనో భూత్వా చింతాక్రాంతఇవ స్థితః

తా॥ నీవు మిక్కిలి దుఃఖముకలవాఁడవువలె నున్నావు. నీమోము మిక్కిలి విచారముగా నున్నట్లు కనఁబడుచున్నది. కారణమేమి?

శ్లో॥ ఏత త్సర్వం యథాపృష్టం విచార్య బ్రూహి తత్త్వతః

తా॥ నేను అడిగినట్లుగా నీవు ఆలోచించుకొని, యున్నదియున్నట్లుగాఁ జెప్పుమని యడిగెను.

శ్లో॥ శ్రుత్వా తద్వచనం విప్రః పుష్కరస్య మహాత్మనః
ప్రత్యుత్తరం యథాన్యాయం వక్తుం సముపచక్రమే.

తా॥ ఇట్లు పుష్కరమహాముని యడుగఁగా, ధ్వజదత్తుండు విని తగినట్లుగాఁ బ్రత్యుత్తరము చెప్పుటకుఁ బ్రారంభించెను.

శ్లో॥ కుండినం నామ నగర మాసీ త్త్రైలోక్య విశ్రుతమ్
యత్రాఢ్యా వణిజా నిత్యం కుబేరాధిక సంపదః

తా॥ కుబేరునికంటె మిక్కిలి యెక్కువ ధనధాన్య సంపదలతో నలరారుచుండు వర్తకులు గలిగి మూఁడులోకముల

యందును మిక్కిలి ప్రఖ్యాతిని బొందిన కుండిన మను నగరము కలదు.

శ్లో॥ బ్రాహ్మణాశ్చాపి విద్వాంస స్సురరాజగురూపమాః
నిత్యాన్న దాననిరతాః నిత్యహోమపరాయణాః

తా॥ అందలి బ్రాహ్మణులు మిక్కిలి గొప్ప గొప్ప విద్వాంసులు. దేవేంద్రునితోను గురునితోను సమానమగు మంచిప్రతిభ కలవారు. ప్రతినిత్యము నెల్లవారలకు నన్నప్రదానముచేయుటయందే కాలము గడుపుచుందురు. ఎల్లప్పుడును హోమములు చేయుచునే యుందురు.

శ్లో॥ స్త్రియః పతివ్రతా స్సర్వా శ్శూద్రాః బ్రాహ్మణసేవకాః
క్షత్త్రియాః ధర్మయోద్ధారో న క్వచి ద్వర్ణసంకరః

తా॥ స్త్రీలు పతివ్రతలై యుందురు. శూద్రులు బ్రాహ్మణులను సేవించుచుందురు. క్షత్త్రియులు ధర్మపరిపాలమునకుఁగాను యుద్ధములు చేయుచుందురు. ఎక్కడను వర్ణసంకర మనునది లేనే లేదు.

శ్లో॥ నాభూ దవిద్వా న్యఃకోఽపి నావాదకుశల స్తథా
నాషడంగవి దత్రాసీ న్నాయజ్వా తత్ర పట్టణే

తా॥ ఆ పట్టణములో నెవ్వండును విద్వాంసుండుకానివాఁడు లేఁడు. సంభాషణమునందు నేర్పులేనివాఁడు లేఁడు. వేదములయొక్క ఆరంగములగు శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము కల్పము రానివాఁడు లేఁడు, యజ్ఞము చేయనివాఁడును కనఁబడఁడు.

శ్లో॥ ఏవం సర్వసమృద్ధేఽస్మి న్ధ్వజశర్మా బహుశ్రుతః
బహ్వృచో గార్గ్యగోత్రశ్చ జితాంత శ్చాహ్యశాత్రవః

తా॥ ఇట్లు మిక్కిలి మహాభివృద్ధిగలిగిన యీ పట్టణము నందు నానాశాస్త్రములు చదువుకొనినటువంటియును, అనేక ఋగ్వేదధర్మములు తెలిసికొనినటువంటియును, తనలోపలి శత్రువులను వెలుపలి శత్రువును జయించి శత్రుభావమే లేన టువంటియును, శ్రీగార్గ్యగోత్రమునందు సముత్పన్నుండయినటు వంటియును, మిక్కిలి ప్రసిద్ధికల ధ్వజశర్మయను నతఁ డుండెను.

శ్లో॥ తస్యాఽహం జ్యేష్ఠపుత్త్రశ్చ కనీయాన్ మమ భద్రకః
తస్యాఽనుజో భద్రబాహు స్సర్వే వేదపరాయణాః

తా॥ ఆ బ్రాహ్మణమునికి నేను పెద్ద కుమారుండను. నా తరువాతివాఁడు భద్రకుఁడు. అతనితరువాతివాఁడు భద్రబాహుఁడు. మే మందరమును వేదాధ్యయనము చేసినవారము.

శ్లో॥ అనుజౌ తౌ మహాపుర్యా ముపాదానపరాయణౌ
తేషాం మమాపి పుత్త్రాస్తే నాలం కుక్షిత్ర్యాంతయే మునే!

తా॥ నాతమ్ములిద్దఱును మహాపట్టణములో నుపాదానము చేసికొనుచున్నారు. నాకును వారికిని సంతానము చాలకలదు, ఓపుష్కరమహామునీ! మాయుపాదాన జీవనము మాపిల్లల యొక్క యాఁకలితీరుటకైనను చాలకయున్నది.

శ్లో॥ పుత్త్రా మే బహవ స్సంతి సాధ్వీ భార్యా ప్రియంవదా
ఉపాదానార్జితం ధాన్యం నాలం గ్రాసాయ నో మునే!

తా॥ ఓపుష్కర మునీంద్ర చంద్రమా! నాకును చాల మంది సంతానముకలరు. నా భార్య మిక్కిలి యోగ్యురాలు. పతివ్రత. ప్రియముగా మాటలాడునది. ఉపాదానమువల్ల వచ్చిన ధాన్యము మాతిండి కెంతమాత్రమును చాలుటలేదు.

శ్లో॥ శాకాహారేణ సా సాధ్వీ జీవనం కురుతే భృశం

తా॥ కూరలతోనే యా సాధ్వి యెల్లప్పుడును జీవనమును గడుపుచున్నయది.

శ్లో॥ ఉపవాసపరా ప్రాయ శ్శాకాభావే పతివ్రతా

తా॥ఒకప్పుడు కూరలుకూడ లేనప్పుడు ఆపతివ్రత సాధారణముగా చాలాకాలము నిరాహారముగా నుపవాసములే చేయుచుండును.

శ్లో॥ తద్దైన్యదర్శనా ద్దేవ! కదాచి దతిచింతితః

ఆశ్వాస్య తాం ప్రియై ర్వాక్యై ర్వంచయిత్వాఽ హ మాగతః

తా॥ ఆ దీనత్వమును చూచి నేనొకప్పుడు మిక్కిలి విచారముకలవాఁడనై ఆమెను మంచిమాటలతో నోదార్చి యామెకుఁ దెలుపకయే నేనిక్కడకు వచ్చినాను.

శ్లో॥ తస్మా ద్దుర్భిక్షహంతారం సర్వ సౌభాగ్య దాయకమ్

సర్వదుఃఖ హరంచాపి హ్యుపాయం వక్తు మర్హసి

తా॥ అందువల్ల నోమహానుభావా! దరిద్రమును మాన్పునట్టియును, సకలసంపదలు కలుగఁజేయుచుండునట్టియును, సర్వదుఃఖములను, పోఁగొట్టునట్టియును నేదైనను నొక యుపాయమును ఆలోచనము చేసి చెప్పుము.

శ్లో॥ బహునాఽత్ర కిముక్తేన? మమైత ద్వచనం శృణు

దారిద్ర్యసాగరే మగ్నా నస్మా నుద్ధారయిష్యసి

తా॥ స్వామీ! నేను ఎక్కువగాఁ జెప్పుట యెందుకు? నామాట వినుము. మేమందఱము దారిద్ర్యము అను మహాసముద్రమున మునిగిపోయియున్నాము. మమ్ము ఏవిధముగానైనను ఆ సముద్రములోనుండి లేవఁదీయుము.

శ్లో॥ ఇత్యుక్త్వా ధ్వజదత్తస్తు పాదయో ర్నిపపాత హ
తస్య తద్వచనం శ్రుత్వా దయార్ద్రిమనసో మునేః
శ్లో॥ న్యపతన్ ప్రణతస్యాంగే నేత్రాభ్యా మశ్రుబిందవః

తా॥ ఇట్లు ధ్వజదత్తుండు తన వృత్తాంతము నంతయును చెప్పి, శ్రీపుష్కరమహామునీంద్రునియొక్క రెండుపాదములపై పడెను. ఇట్లు దీనముగానున్న యా ధ్వజదత్తుని మాటలను వినుటవలన మిక్కిలి దయార్ద్రహృదయుండగు నా పుష్కర మునీంద్రుని రెండు కన్నులనుండియును గన్నీటిచుక్కలు దగ్గఱ నమస్కారము చేసి పాదములమీద నున్నటువంటి ధ్వజ దత్తుని శరీరమునందుం బడినవి.

శ్లో॥ హనూమంతం హృది ధ్యాత్వా ధైర్య మాస్థాయ పుష్కరః
ధ్వజదత్తం సముత్థాప్య మాభైషీ రితి చాబ్రవీత్

తా॥ అంతట శ్రీ పుష్కరముని చంద్రుండు శ్రీ హనుమ త్ప్రభువు వారిని మనస్సునందు ధ్యానించి ధైర్యము తెచ్చుకొని ధ్వజదత్తునిని లేవందీసి భయపడకుమని చెప్పెను.

శ్లో॥ అ స్త్యనర్థపరీహారసమర్థో హనుమాన్ ప్రభుః

తా॥ అనర్థముల నన్నింటిని పరిహరించుటకు మిక్కిలి శక్తిగలవారు శ్రీ యాంజనేయస్వామివా రున్నారు.

శ్లో॥ వర్తతే హనుమన్మంత్రం దైన్యం కిన్ను? ద్విజోత్తమ!

తా॥ శ్రీ హనుమన్మంత్రమున్నది. ఓ బ్రాహ్మణుండా! ఇంక నీవు దీనుండవై యుండవలసిన యవసరము లేదు.

శ్లో॥ దైవతాని కతిసంతి న భూతలే
నైవ తాని మనసో మతాని మే
వీక్షితం జడదరిద్రరక్షణే
దైవతం హనుమ దాఖ్య మేవయత్

తా॥ ఈ లోకమునందు నెన్నియో దైవతములున్న యవి. ఆ దైవతములు నా మనస్సున కెంతమాత్రమును నను మతములైనవిగాఁ గనఁబడ లేదు. అజ్ఞానులను దరిద్రులను సంరక్షణము చేయుటకు మిక్కిలిశక్తిగలది హనుమంతుఁడనే పేరుకల దైవత మొక్కటియే కన బడుచున్నది.

శ్లో॥ మంత్రజాల మపి నాఽన్యగోచరమ్
శోచతే కమపి మంత్రకం వినా
కారణం కిమతిరిక్త? మత్ర నో
వాయునందన మనోః పరిగ్రహాత్

తా॥ సామాన్యముగా నెన్నిమంత్రములున్నను ఇతరులకు సులభముగాఁ దెలిసికొనుటకు వీలయినవిగానుండవు. అవి గురూపదేశముగానే తెలసికొనుటకు వీలైనవి. అయితే శ్రీ హనుమంతునియొక్క మంత్రమును పరిగ్రహించినయెడల నింకను జేయరానిదేదియును లేదు. అన్నియును వశ్యములే యగును.

శ్లో॥ బ్రహ్మ విష్ణు శివ మైథిలీ శివాః
కార్యసిద్ధి శిథిలోద్యమా ముహుః
అంజనా సుత మను ప్రభావతో
భుంజతే సుఖ మహర్నిశం ద్విజ !

తా॥ ఓయి ద్విజదత్తా! పూర్వము బ్రహ్మదేవుఁడు, విష్ణుమూర్తి, సాంబమూర్తి, సీతాదేవి, పార్వతీదేవి, వీరు చాలసారులు జాగ్రత్తగా చేసికొనుచుండువారైనను ఫలసిద్ధినిపొందఁజాలనివారై తుట్టతుదకు శ్రీ ఆంజనేయస్వామివారియొక్క మంత్రమును జపముచేసి యా ప్రభావమువల్ల ఫలసిద్ధిని పొందినవారై సుఖము ననుభవించుచున్నారలు. ఇంక నితరులవిషయములో సంశయము లేదుకదా !

శ్లో॥ తత్రి తత్ర భవతే మనూత్తమమ్
కార్యసిద్ధివిషయే దృఢవ్రతమ్
దానపాత్రి! భవతే దిశామ్యహమ్
పుణ్యతీర్థసలిలే విగాహ్యతామ్

తా॥ ఓ ధ్వజదత్తా! అక్కడక్కడ శ్రీ హనుమన్మంత్ర రాజము బోధ చేయువారలు కలరు. శ్రీ హనుమన్మంత్రము వల్ల ఫలసిద్ధి తప్పక కలుగును. నీవు మంత్రము నుపదేశించుటకుఁ దగినవాఁడవు. కావున మంచితీర్థజలములో స్నానమును జేసికొని త్వరగా రమ్ము. పొమ్ము. లెమ్ము. నీకు వెంటనే మంత్రము నుపదేశించెదను.

శ్లో॥ ఇత్థ మాహ వచనం మనోరమమ్
బ్రాహ్మణం భృశదరిద్రశేఖరమ్
నిత్యకర్మనిరతో మునీశ్వరాః
పుణ్యతీర్థ మవిశ న్సహైమునా॥

తా॥ ఇట్లు పుష్కర మహాముని దరిద్రశేఖరుండగు ధ్వజదత్తునకు మంచి మనోహరమగు వాక్యము చెప్పెను. ఈ ధ్వజదత్తునితోఁగూడ నిత్యకర్మలు చేసికొను విషయములో మిక్కిలి నిష్ఠలు కలిగిన మునులుకూడ వెళ్ళి సరస్సుతీరమునఁ బ్రివేశించినారు.

శ్లో॥ యత్రి సిద్ధి ముగమ న్మునీశ్వరాః
స్నాన పాన హతకిల్బిషాః క్షణాత్
తత్రి పుణ్యసలిలే ద్విజ స్స్వయమ్
స్నానపూర్వకవిధిం చకార వై॥

తా॥ ఇదివఱలో మొదటినుండియును ఎక్కడ స్నానము చేసి మంచినీళ్ళు దాహము త్రాగి వెంటనే పాపములనుండి

త్రోలంగిపోయి మునీశ్వరులు సిద్ధిని పొందుచున్నారో, యీ ధ్వజదత్తుండుకూడ నా పుణ్యతీర్థమునందే విధిపూర్వకముగా స్నానమును చేసెను.

శ్లో॥ స్నాత్వాతు పుష్కర శ్రేష్ఠం పుణ్యతీర్థోదకే శుభే
కృతమాధ్యాహ్నికా యాథ ధ్వజదత్తాయ ధీమతే॥

తా॥ పుష్కర మహామునీంద్రుండును ఆపుణ్యతీర్థములో స్నానముచేసి, మాధ్యాహ్నిక కృత్యములు నెరవేర్చుకొని, సిద్ధముగా నున్న ధ్వజదత్తునకు.

శ్లో॥ సువర్చలాసమేత శ్రీహనున్మంత్ర ముత్తమమ్
ద్వాదశాక్షరవిద్యేతి ప్రసిద్ధం జగతాం త్రయే

తా॥ లోకములో మిక్కిలి ప్రసిద్ధి వహించియున్నటు వంటి శ్రీసువర్చలా సమేత శ్రీహనుమన్మంత్రమును ద్వాదశాక్షరము అనుదానిని,

శ్లో॥ హనుమ ద్ధ్యాన మాస్థాయ ధ్యాత్వా గురుపదాంబుజమ్
విన్యస్య మస్తకే హస్తం విప్రో యోపాదిదేశ హ

తా॥ శ్రీహనుమంతునిని మనస్సులో ధ్యానముచేసి, గురువుగారి పాదములు మనస్సులో స్మరించి, తనహస్తమును ధ్వజతుని శిరమునందుంచి శ్రీ హనుమన్మంత్రము నుపదేశము చేసెను

శ్లో॥ ధ్వజదత్తో మహామంత్ర ముపదిష్టం మహర్షిణా
అత్యాదరేణ జగ్రాహ నిక్షేపం నిర్ధనో యథా

తా॥ శ్రీపుష్కరముని యుపదేశించిన శ్రీహనుమన్మంత్రమును దరిద్రుండు మహానిధివలె శ్రీధ్వజదత్తుండు మిక్కిలి ప్రేమముతో గ్రహించెను.

శ్లో॥ తతో నియమ మాస్థాయ జజాప హనుమన్మనుమ్
గురూపదిష్టవిధినా తత్ర పుణ్యజలాంతరే

తా॥ పిమ్మట మంచినియమముకలవాఁడై గురువుగా రుపదేశించిన విధముగా ఆ పుణ్యజలములోనుండి శ్రీహనుమన్మహామంత్రమును జపించెను.

శ్లో॥ ఉపదిశ్య మహామంత్రం పుష్కరోఽపి మహామునిః
ధ్వజదత్తాయ విప్రాయ జగా మాశ్రమ మాత్మనః

తా॥ శ్రీపుష్కరమహాముని శ్రీహనుమన్మంత్రమును ధ్వజదత్తుఁడను బ్రాహ్మణున కుపదేశముచేసి తన యాశ్రమమును జేరెను.

శ్లో॥ స్వావేక్షణోత్సుక లస న్ముఖ కృష్ణనాగా
మాశాసి తాత్మహిత లోభఖగేంద్రనాథామ్
ఆసాదితాఽతిథి బిలప్రక రాంగణాగ్రా
మధ్యాస్త పుష్కరముని ర్నిజపర్ణశాలామ్

తా॥ తనను చూచుటయందు మిక్కిలి వేడుక కలవై ప్రకాశించు ముఖములు కల త్రాచుపాములు కలిగినటువంటి యును, ఇతరులకుఁ దెలియఁజేయుచున్న తమయొక్క మేలులందు నత్యాదరములు గల గరుడపక్షులు కలిగినటువంటియును, ఆ కలుగులకు సమీపముగా సంసిద్ధులై యున్న యతిథులు గల ముంగిలివాకిలి కలిగినటువంటియును, తన యాశ్రమమును శ్రీ పుష్కరమహామునీంద్రుండు ప్రవేశించెను. ఆ మునియొక్క తపోమహిమమువల్ల సహజవిరోధులగు పాములు గరుడపక్షులు పరస్పరము విరోధములుమాని, మిక్కిలి వేడుకతోను మిక్కిలి విశ్వాసముతోను గలసిమెలసి సంచరించుచున్నయవి.

మైత్రేయః:—

శ్లో॥ ధ్వజదత్తో జప న్మంత్రం కదా సిద్ధ మవిందత ?
పురశ్చర్యాః కతి కృతాః ? పరాశర ! వదస్వ మే

తా॥ ఓపరాశర మునీంద్రా ! ధ్వజదత్తుండు శ్రీహనుమన్మంత్రమును ఎంతకాలము జపము చేసెను? ఎప్పుడు ఫలసిద్ధి కలిగినది ? పురశ్చర్యలు ఎన్ని చేసెను? నాకుఁ జెప్పుము. అని పరాశరుని మైత్రేయుం డడిగెను.

పరాశరః :—

శ్లో॥ శాస్త్రోక్తవిధినా విప్రో జపన్ మంత్ర మహర్నిశమ్
సిద్ధిం నావాప మంత్రస్య తథా వై జపతిస్మ సః

తా॥ శ్రీధ్వజదత్తుండు శాస్త్రవిధిప్రకారము శ్రీహనుమన్మంత్రమును నెల్లప్పుడు, జపించుచుండెను. కాని ఫలసిద్ధి మాత్రము కలుగలేదు. ఇంకను అట్లే జపము చేయుచుండెను.

శ్లో॥ గ్రీష్మే తప్తశిలాయాంచ వర్షాసు సికతాతలే
హేమన్తే శిశిర్త్రౌచ రాత్రౌ శీతజలాంతరే

తా॥ వేసవికాలములోని గ్రీష్మఋతువులో, జ్యేష్ఠాషాఢ మాసములలో బాగుగా వేడిగానున్న శిలయందును; వర్షాకాలమునందు శ్రావణ భాద్రపద మాసములలో ఇసుక దిబ్బలలో నుండియును, హేమంతర్తునందును శిశిరర్తువునందును అనఁగా మార్గశిర పుష్య మాఘ ఫాల్గుణ మాసములలో రాత్రియందుఁ జల్లనినీటి లోపలనుండియును,

శ్లో॥ జపన్నపి మహామంత్రసిద్ధిం నైవాప సద్విజః
నిరాహారో జితస్వాప స్సర్వదా విజితేంద్రియః

తా॥ ఆహారమునుమాని, నిద్రనువీడి, తన యింద్రియములను దనవశ్యములుగాఁ జేసికొనినవాఁడై ధ్వజదత్తుండు తపము

చేయుచున్నను శ్రీహనుమన్మంత్రముయొక్క ఫలసిద్ధిని మాత్రము పొందలేదు.

శ్లో॥ మనస్తత్రైవ సంయోజ్య బాహ్యాంనైవ వివేద సః

తా॥ మనస్సును నొకచోట స్వస్థానమునం దునిచి-వెలుపలి లోకమునందలి విషయములను మాత్రము ఏమాత్రమును గమనింపక యుండెను.

శ్లో॥ గురుదేవపదం చైవ వినా విందతి తద్ద్విజః

తా॥ గురునమస్కారమును దేవపూజయును లేకయే ఫలసిద్ధిని పొందుటకుఁ జూచుచుండెను.

శ్లో॥ తస్మా త్పంచపురశ్చర్యా విధావపి నసిద్ధ్యతి.

తా॥ అతఁడు అయిదుపర్యాయములు పురశ్చర్యలు నెరవేర్చెను. అయినను ఫలసిద్ధి కలుగలేదు.

శ్లో॥ దైవమేవ మహామాన్యం తతోమాన్యో మహామనుః

తా॥ దైవమే మన్నింపఁ దగినవాఁడు. ఆదైవముకంటెఁ గూడ మహామంత్రము మిక్కిలి గౌరవింపఁ దగినయది.

శ్లో॥ ఇతి నిశ్చితవాన్ విప్రో నత్వేవం గురువైభవమ్
చిరాయాపి మహామంత్రసిద్ధ్యభావా ద్విజోత్తమః

తా॥ ఇట్లు నిశ్చయించుకొనుచుండెను. ఆ ద్విజసత్తముఁడు గురువునుమాత్ర మెక్కింతయును దలఁచుచుండెడివాఁడుకాఁడు. కావున నెంతకాలము జపించినను ఫలసిద్ధికలుగలేదు. కావున నా బ్రాహ్మణుండు,

శ్లో॥ నిర్వేదం పరమంచాగాత్ గురువిశ్వాసవర్జనాత్
సిద్ధ్యభావే నిదానం యద్గురువిశ్వాసవర్జనమ్.

తా॥ గురువునందు నమ్మకము లేనివాఁడగుటవల్ల ఫలసిద్ధి కలుగలేదు. కావున మిక్కిలి దుఃఖించెను. ఇట్లు ఫలింపకపోవుట వల్ల, గురువిశ్వాసము సకలమును వ్యర్థమగుటవల్ల, మంత్రము నందును నమ్మకము తగ్గినది.

శ్లో॥ ఏవం నజ్ఞాతవాన్ విప్ర స్తదేవ జ్ఞాతవాన్ గురుః

తా॥ ఇట్టివిషయమును ధ్వజదత్తుండు తెలిసికొనలేకపోయెను. ఈ సంగతియంతయును పుష్కరుండు తెలిసికొనెను.

శ్లో॥ సప్తకోటిషు మంత్రేషు విద్యమానేషు పుష్కరః
దిష్టవాన్ జడమంత్రం మే యత స్తన్మంత్రవంచకః

తా॥ ఏడుకోట్లు మహామంత్రము లున్నవి. ఈ పుష్కరుండు మంత్రపు మోసగాఁడు. ఈ వ్యర్థమంత్రమును నా కుపదేశించెను.

శ్లో॥ మహాంతో మునయ స్సంతి తానవేక్ష్యాఽయ మర్థితః
మాం జహాతి నదౌర్భాగ్యం వనేవా పట్టణేఽపివా.

తా॥ చాలమంది మహామును లున్నారు. వారలను చూచికూడ వీనినే కోరినాను. దౌర్భాగ్యము పట్టణమందుఁగాని యరణ్యమునందుఁగాని నన్ను విడునట్లు కనఁబడదు.

శ్లో॥ ఇత్యేవం ఖిద్యమానస్సన్ జపా దుపరతోఽభవత్.

తా॥ ఇట్లు ధ్వజదత్తుండు మనస్సులోఁ దలఁచి తలఁచి మిక్కిలి దుఃఖించుచున్నవాఁడై జపముచేయుట మానివేసెను.

## —:గురు విశ్వాస మాహాత్మ్యము:—

(అంబులను గాచరితము పరిమాణము)

పరాశరః:—

శ్లో॥ అథాస్మిన్నంతరే వ్యాధో గాలో నామ మహాధనుః
మహావ్యాధిపరీతాంగో దుఃఖితో వ్యాధిపీడయా

తా॥ పిమ్మట నీ సమయములోనే గాలుఁడు అను నొక కిరాతుఁడు గొప్పవిల్లుకాఁడు. మహారోగముచే నిండియున్న శరీరముకలవాఁడై యా జబ్బుతో నెంతయును పీడింపఁబడు చుండెను.

శ్లో॥ మృగయావశ మాపన్నో నైమిశారణ్య మావిశత్

తా॥ అతఁడొకనాడు ఇట్లు బాధపడుచున్నవాఁడగుచునే వేటయందలి వ్యసనముచే నైమిశారణ్యమును ప్రవేశించెను.

శ్లో॥ ధ్వజదత్తం దదర్శాదౌ దరిద్రిధ్వజ ముత్తమమ్

తా॥ ఇట్లు ప్రవేశించి వెంటనే దరిద్రిమునందు మునింగి యున్న ధ్వజదత్తునిని గనుఁగొనెను.

శ్లో॥ తత్సమీపం సమాగత్య వ్యాధో వచన మబ్రవీత్

తా॥ ఆ వ్యాధుండు ధ్వజదత్తునిదగ్గఱకువచ్చి ఇట్లు పలికెను.

శ్లో॥ బ్రహ్మన్! మే వ్యాధిపీడాఽస్తి కేనోపాయేన శామ్యతి?
తముపాయం వద స్వామిన్! త్వత్సేవాం కరవాణ్యహమ్.

తా॥ ఓ మునీంద్రా! నా శరీరములో గొప్పజబ్బుండి నన్ను మిక్కిలి బాధించుచున్నయది. అది యెట్లు కుదురును? ఆ యుపాయమును చెప్పవలయును. నేను మీసేవ చేసెదను.

శ్లో॥ ఇత్యుక్త స్తేన విప్రోఽపి వ్యాఘంచేద మువాచ హ
తా॥ ఇట్లు కిరాతుండడుగఁగా వానితో ధ్వజదత్తుం డిట్లు చెప్పెను.

శ్లో॥ అహం దారిద్ర్యదుఃఖాబ్ధౌ మగ్న స్త్వాం కథముద్ధరే?
కశ్చి త్పుష్కరనామాస్తి హ్యారా ద త్త్రైవ లక్ష్యతే.

తా॥ నేను దరిద్రము అను దుఃఖసముద్రములో మునిగి మిక్కిలి బాధపడుచున్నాను. ఇట్టివాఁడను నీకెట్లు సహాయము చేయఁగలను? పుష్కరుండు అను నొకమునియున్నాఁడు. ఇక్కడికి దగ్గఱలోనే కనఁబడుచున్నాడు.

శ్లో॥ తముద్దిశ్య నగంతవ్యం యతో వంచకశేఖరః
దరిద్రతా వినాశాయ బహుధా ప్రార్థితో మయా.

తా॥ వాని దగ్గరకుమాత్రము వెళ్ళవద్దు. అతఁడు మిక్కిలి గొప్పమోసగాఁడు. వానిని నేను నా దారిద్ర్యము పోఁగొట్టవలసినదని యనేకరీతులుగాఁ బ్రార్థించినాను.

శ్లో॥ మంత్రాభాసం మమాదిశ్య వంచయిత్వా గతోయతః
మంత్రాభాసం జప న్భూయ స్సిద్ధిం నైవాప్నుయా మ్యహం

తా॥ అతఁడు మాయగాఁడు. నాకు నేదో పిచ్చిమంత్రమును చెప్పి మోసముచేసినాఁడు. ఆ పిచ్చిమంత్రమును నేనెన్నోసారులు జపించినాను. ఫలసిద్ధి కలుగునను నాశయే లేకపోయినది.

శ్లో॥ దుశ్చర్యం హి తప స్తప్తం త త్తథాపి నసిద్ధ్యతి
తా॥ ఆ మంత్రమును మిక్కిలి యశక్యమయినరీతిని గొప్పతపమును జేసినాను. "అయితేనేమి? ఫలముమాత్ర మొక్కింతయును గనఁబడ లేదు.

శ్లో॥ పురశ్చర్యాశ్చబహుధా కృతా స్సిద్ధి ర్నదృశ్యతే

తా॥ అనేకపర్యాయములు పురశ్చర్యలు చేసినాను. సిద్ధిమాత్రము కనిపించ లేదు.

శ్లో॥ తస్మాత్ప్రారబ్ధకర్మాణి భోక్తవ్యాని న సంశయః

తా॥ కావున నేమిచేసినను లాభము లేదు. ప్రారబ్ధకర్మలు అనుభవించి తీరవలసినదేకాని మనము ఏమిచేసినను ఎవరిని ప్రార్థించినను కర్మ తప్పదు. సంశయము లేదు అనెను.

శ్లో॥ దైవంనాస్తి మనుర్నాస్తి గురుర్నాస్తీతి మే మతిః

తా॥ దైవమును లేదు, మంత్రమును లేదు, గురువును లేదు, ఇది నా నిశ్చయాభిప్రాయము.

శ్లో॥ అథవా విద్యతే మంత్రో గురుర్వా దైవతంతథా
కింతు పుష్కర మాసాద్య మాగృహ్ణీష్వ మనుం త్వమమ్.

తా॥ ఒకవేళ మంత్రమున్నను, దైవమున్నను, గురువున్నను నీవుమాత్రము పుష్కరుని దగ్గరకుఁ బోవద్దుసుమా, ఆయనవల్ల నీమంత్రముఁను నుపదేశము పొందవద్దు.

శ్లో॥ ఇత్యుక్తం ధ్వజదత్తేన వ్యాధ శ్శ్రుత్వా ప్రియం వచః
ధ్వజదత్తనిషిద్ధోఽపి దిదృక్షుః పుష్కరం మునిమ్

తా॥ ఇట్లు మంచిమాటను ధ్వజదత్తుండు చెప్పఁగా నా వ్యాధుండు విని, ధ్వజదత్తుఁడు పోవద్దని చెప్పినప్పటికిని, పుష్కర మునినిఁ జూడవలెనని కోరికగలవాఁడై,

శ్లో॥ నివృత్తికామో రోగస్య తమేవ శరణం యయౌ

తా॥ ఆరోగమును పోఁగొట్టుకొను కోరికతో నాపుష్కరుని దగ్గఱకే వెళ్ళెను.

శ్లో॥ అబ్రవీ త్పుష్కరం వ్యాధ స్సాష్టాంగ నతిపూర్వకమ్

తా॥ ఇట్లు వ్యాధుండు పుష్కరునినిజూచి సాష్టాంగ నమస్కారముచేసి వానితో నిట్లనెను.

శ్లో॥ జాత్యాహం మృగయు ర్బ్రహ్మన్ ! గాలోనామ్నా మహామునే!

తా॥ ఓపుష్కర మహాముసీ! నేను కిరాతజాతివాఁడను. నా పేరు గాలుఁడు.

శ్లో॥ వ్యాధినా దుర్నివారేణ పీడ్యమానో దివానిశమ్
అన్నం నరోచతే మహ్యం నవా భార్యాఽతిసుందరీ

తా॥ నేను గొప్పవ్యాధిచే రాత్రింబవళ్ళు బాధపడు చున్నాను. నాకు అన్నమునందుఁ గోరిక లేదు. నాభార్య మిక్కిలి సౌందర్యవతి. ఆమెయందును ప్రేమ లేదు.

శ్లో॥ నవా వస్త్రాణి ముఖ్యాని సుగంధకుసుమాన్యపి

తా॥ వస్త్రములయందును వాంఛ లేదు. సుగంధములగు పువ్వులయందును బ్రీతి లేదు.

శ్లో॥ చందనం చంద్రబింబాభం శయ్యావా హంసతూలికా
రసాశ్చ షడ్విధావాపి నరోచంతే మహామునే !

తా॥ ఓపుష్కరమునిచంద్రా ! చంద్రబింబమువలె మంచి చల్లదనము కలుగఁజేయు మంచిగంధము మీఁదఁగాని, హంసల యొక్క మృదురోమములతోఁ దయారగు పరుపుమీఁదఁగాని, మిక్కిలిరుచికరములగు ఆరురుచులయందుఁగాని నాకునెంతమాత్ర మును ఇష్టత లేనేలేదు.

శ్లో॥ నోత్సాహో కాని వస్తూని వ్యాధిగ్రస్తః నిరంతరమ్

తా॥ నేను నిరంతరము వ్యాధివల్లఁ బహుబాధకుఁ దుది యును మొదలును కనఁబడ లేదు. అందువల్ల నాకు నేవస్తువుల మీఁదను కోరిక లేనేలేదు.

శ్లో॥ ఆఖేటనాపదేశేన పర్యటన్గహనాంతరే
పూర్వజన్మార్జితా త్పుణ్యా దద్రాక్షం త్వాం మహామునే!

తా॥ వేటమూలమునగా నీ వనములో సంచరించుచు నోపుష్కరముసీంద్రా! నేను పూర్వజన్మ పుణ్యవిశేషమువల్ల మీదర్శనము చేసికొన్నాను.

శ్లో॥ అధునాఽహం కృతార్థోస్మి మశ్యే వ్యాధిం వినాశితమ్

తా॥ ఇప్పుడు జబ్బుతగ్గినట్లు తలంచుచున్నాను. నేను మీ దర్శనమువల్ల కృతార్థుండనయినాను అని చెప్పెను.

శ్లో॥ సమ్యక్పరీక్షితుం శీలం వ్యాధస్య మునిసత్తమః
సన్ముహూర్తాపదేశేన కాలక్షేపం చకార సః

తా॥ అంత శ్రీపుష్కరుండును వ్యాధుని స్వభావము పరీక్షించుటకై మంచి ముహూర్తము కుదురవలె నని చెప్పుచుం జాలకాలము జరుపుచుండెను.

శ్లో॥ తథాపి మృగయుం ర్గాలః పరిచర్యా ముపాచరత్

తా॥ ఇట్లు ఎంతకాలము గడచుచున్నను వ్యాధుండు మాత్రము పుష్కరునికి విసువక పరిచర్య చేయుచునే యున్నవాఁడు.

శ్లో॥ ఫలాని పరిపక్వాణి మధురాస్వాదనానిచ
మునయే దత్తవా న్గాలో గృహీత్వా వనగహ్వరాత్

తా॥ గాలుండు తోటలోనికిం జాలదూరము పోయిపోయి యచ్చటనుండు మంచిరుచిగలవి, బాగుగా పండినవి, యేరి పళ్లు తీసికొనివచ్చి పుష్కరముని కిచ్చుచుండెను.

శ్లో॥ సమిత్పల్లవపుష్పాణి బర్హిశ్చాపి సకందకమ్
సమాహృత్యార్పయామాస పుష్కరాయ మహాత్మనే.

తా॥ సమిధలు లేతయాకులు పుష్పలు వేరులతోనుండు దర్భలు తీసికొనివచ్చి మహాత్ముఁడగు పుష్కరమునీంద్రునకు సమర్పించుచుండెను.

శ్లో॥ తథాపి పుష్కరో యోగీ కించిన్నాదత్త గాలకాత్
మౌనమేవ సమాస్థాయ పరీక్షన్ వ్యాధవర్తనమ్

తా॥ ఇట్లు గాలుండు ఎన్ని సమర్పించుచున్నను పుష్కరుండుమాత్రము అవియేవియును నొక కొంచెమును గ్రహించుట లేదు. మాటలాడకుండనే మౌనమును ధరించి యా కిరాతుని ప్రవర్తనమును పరీక్షించుచుండెను.

శ్లో॥ మనసైవ ముమోదాంత స్తస్య విశ్వాసదర్శనాత్

తా॥ అతనియొక్క విశ్వాసమును చూచి తనమనస్సులోనే లోపల నెంతయో సంతోషించుచుండెను.

శ్లో॥ ఏవం బహువిధః కాల స్తస్యాఽభూత్పరిచర్యయా

తా॥ ఇట్లు పరిచర్య చేయుట మొదలుపెట్టినతరువాత మిక్కిలి చాలకాలము గడచినది.

శ్లో॥ ఉత్తరోత్తర మత్యంతం విశ్వాసం లభతే స వై

తా॥ ఆ వ్యాధుం డిట్లు పుష్కరుండు మౌనమువహించి మాటలాడకున్నను, తాను తెచ్చినవస్తువులు స్వీకరింపకయున్నను, ఉన్నకొలదిని అంతకంత కెక్కువ నమ్మకమును సంతోషమును సమ్మోదమును సముత్సాహమును పొందుచున్నాఁడు. నమ్మకమునుమాత్రము విడువ లేదు.

శ్లో॥ తమేవం పరిచర్యంతం వ్యాధం వ్యాధినిపీడితమ్
కృపయా వీక్షయామాస కదాచి త్పుష్కరో మునిః

తా॥ ఇట్లు వ్యాధులచే బాధపడుచుండియును, తనకు మిక్కిలి భక్తిశ్రద్ధలతోఁ బరిచర్యలు చేయుచుండునటువంటి కిరాతునిని నొకప్పుడు పుష్కరమహామునీంద్రుండు దయతోఁ గనుంగొనెను.

శ్లో॥ కృపయా వీక్షణాదేవ గాల స్సంహృష్టమానసః
నివృత్తంతు తదా మేనే రోగం రోగార్తిపీడితః

తా॥ ఇట్లు దయతో శ్రీ పుష్కరుండు చూచినంత మాత్రముచేతనే గాలుండు మిక్కిలి మనస్సునందు సంతసించి, రోగపీడితుండు అయియున్నవాఁడుగావునఁ దనరోగ మప్పుడేకుదిరిన దన్నంత సముల్లాసమును పొందెను.

శ్లో॥ అబ్రవీ త్పుష్కరో వాక్యం వ్యాధం గురుపరాయణమ్

తా॥ అంత శ్రీ పుష్కరుండు గురుభక్తి కలిగియున్నటువంటి యా గాలునిగుఱించి యిట్లుపలికెను.

శ్లో॥ వ్యాధస్య మంత్రదానార్థం సందేహేన మహామునిః
హనూమంతం నిజాభీష్టం దధ్యౌ దైవతశేఖరమ్

తా॥ మఱియును బుష్కరుండు తన మనమునందు; కిరాతుఁడైన గాలునకు మంత్రము నుపదేశించుట యెట్లు? అను సందేహము కలవాఁడై తన మనోదైవత మయినటువంటియును దేవతాప్రభు శేఖరుండై నటువంటియును హనుమంతుని నిట్లు ధ్యానించెను.

శ్లో॥ హనుమన్! దేవదేవ! స్వభక్తానాం పరిపాలక !
శ్రీరామచంద్రసంప్రీతికారణ! త్వా ముపాశ్రయే.

తా॥ ఓ హనుమంతుఁడా! దేవదేవా! స్వభక్తులను పరిపాలించుచుండువాఁడా! శ్రీరామచంద్రమూర్తికి నెల్లప్పుడును సంతోషమును కలిగించుచుండువాఁడా! నిన్ను సముపాశ్రయించుచున్నాను. రక్షింపుము.

శ్లో॥ ధ్యాతశ్చ హనుమాంస్తేన భక్తాభ్యాశ ముపాగమత్

తా॥ ఇట్లు పుష్కరుండు ధ్యానించినవెంటనే శ్రీహనుమత్ప్రభువువారు పుష్కరున కభిముఖముగా వచ్చుచుండిరి.

శ్లో॥ సువర్ణకుండలద్యోతి ర్దీప్తగండస్థలద్వయః
హేమోపవీత సంవీతో దివ్యపీతాంబరావృతః

తా॥ బంగారుకుండలములు చెవులకు ధరించుటచేత మిక్కిలి కాంతితో విలసిల్లుచుండునటువంటి రెండు దవడలు చెక్కిళ్ళు కలవాఁడును, బంగారుయజ్ఞోపవీతమును ధరించినవాఁడును, మిక్కిలి ప్రకాశించుచుండు పచ్చని పట్టుబట్ట కట్టుకొనినవాఁడును

శ్లో॥ రత్నకంకణసన్నాదీ ధ్వన స్మంజీరమంజులః
నవరత్నాంశుసంవీత మహార్ఘ్యమకుటోజ్జ్వలః

తా॥ రత్నములతోఁ దయారగు మురుగులయొక్క ధ్వనులు కలిగియుండువాఁడును, మిక్కిలి మృదుమధురధ్వనులు గల కాలియందెలు కలవాఁడును, మిక్కిలి క్రొంగ్రొత్తలగు నవరత్నముల యొక్కయభినవకాంతులతో నలరారుచుండునట్టియును, మిక్కిలి మితము లేని విలువకలిగినటువంటియును కిరీటముచేత నెంతయో యెక్కువగా వికాసించుచుండువాఁడును,

శ్లో॥ పశ్చాల్లంబిశిఖోపేత క్వథితస్వర్ణపర్ణకః
సువర్చలాం దధానశ్చ వామభాగే నిజప్రియామ్

తా॥ వెనుకవ్రేలాడుచున్న శిఖతోనంటుకొనియున్న మధుర ధ్వనిచేయుచున్న బంగారుబిళ్లరేకు ధరించియుండువాఁడును దనకు మిక్కిలి ప్రియురాలగునటువంటియును యోగ్యురాలగు సువర్చలాదేవిని వామభాగమందు ధరించియుండువాఁడును నగు

శ్లో॥ హనుమత్ పాదపద్మాంత ర్న్యస్తనేత్రమధువ్రతామ్
ధ్యాయంతం హృది భర్తారం పార్వతీమివ శంకరమ్

తా॥ శ్రీహనుమంతునియొక్క పాదపద్మములపై నిలుపఁబడిన కన్నులు అను తుమ్మెదలు కలిగినటువంటియును, తన మనస్సునందు "గౌరీదేవి శంకరుని ధ్యానించుచుండినట్లు" భర్తయగు శ్రీ హనుమంతుని మిక్కిలి స్మరించుచుండునటువంటియును,

శ్లో॥ కంబుకంఠీం మహాభాగాం పీనోన్నతకుచద్వయామ్
కింకిణీజాలసన్నాది మేఖలాదామశోభితామ్

తా॥ శంఖమువంటి కంఠముకలిగియున్నటువంటియును, గొప్ప అదృష్టవంతురాలైనటువంటియును, మిక్కిలి ఉన్నతములయి పుష్టిగలవయియుండు రెండుపయోధరములు కలిగియుండునటువంటియును, చిఱుమొత్తలు మ్రోగుచుండు ననేకవిధములగు గజ్జెలు మొదలగు నగలచే నలరారు ఒడ్డాణమునుధరించి మిక్కిలివిరాజిల్లుచుండునటువంటియును,

శ్లో॥ పదాంగుష్ఠనఖజ్యోతిర్జితోద్య చ్చంద్రమండలామ్
ఆదర్శసదృశప్రఖ్య గండభాగస్ఫురన్ముఖామ్

తా॥ పాదాంగుష్ఠమునందలి గోరులయొక్క కాంతులచేత గెలువఁబడినట్టి యుదయించుచున్నట్టి చంద్రబింబము కలిగి

యున్నట్టియును, అద్దముతో సమానమగు చెక్కిళ్లు పైభాగముచే వికసించుచుండు ముఖకమలము కలిగియుండినటువంటియును,

శ్లో॥ స్వర్ణతాటంకసంరోచి శ్రీకారసదృశ ప్రభామ్
నవచంపకసూనాభ నాసాం చంద్రనిభాననామ్

తా॥ బంగారు చెవులపోగులు కలిగి, మిక్కిలి ప్రకాశించు (శ్రీ) యొక్క యాకారముతో సమానమగు కాంతులు కలిగి యుండినటువంటియును, అప్పుడే వికసించుచున్న సంపెంగ పూవు వంటి ముక్కు కలిగి యుండునటువంటియును, చంద్రునితో సమానమగు మోముకలిగియుండునటువంటియును,

శ్లో॥ కర్ణాంతాయిత నేత్రాంతాం కామచాపాయితభ్రువమ్
మయూరబర్హాభమ్మిల్లాం కలహంస గతిస్థితామ్

తా॥ చెవ్వులవఱకును వ్యాపించిన కీగన్నులు కలిగి యున్నటువంటియును, మిక్కిలి విశాలములగు కన్నులు కలిగి యున్నటువంటియును, మన్మథునియొక్క ధనుస్సువంటి కను బొమలు కలిగియుండునటువంటియును, నెమిలిపింఛెముతో సమాన మగు మిక్కిలిగొప్పగా మెఱయుచున్న కొప్పును గలిగి యున్నటు వంటియును, మిక్కిలి మనోహరములగు రాజహంసలవంటి మృదుగమనము యొక్క విలాసస్థితి కలిగి యుండునటువంటియును,

శ్లో॥ పక్వబింబాధరోష్ఠీం తాం స్ఫురద్దశనదాడిమామ్
ముక్తాతిలక సంరాజ త్ఫాలపట్టాం సుమధ్యమామ్

తా॥ పండిన దొండపండువంటి క్రింది పెదవి కలిగి యుండి నటువంటియును, ప్రసిద్ధములగు శుభలక్షణములు కలిగియుండి నటువంటియును, "దాడిమీబీజములు" దానిమ్మగింజలు వలె మిక్కిలి స్ఫురించుచున్న పన్నులు కలిగియుండినటువంటియును,

ముత్యము బొట్టుచే నలరారుచుండు నుదురు ఫలకము కలిగి యుండునటువంటియును, మిక్కిలి యోగ్యమగు సూక్ష్మమగు నడుము కలిగియుండినటువంటియును,

శ్లో॥ శిరీషపుష్ప మృదుల బాహుయుగ్మమనోరమామ్
అంగుళీయక ముద్రాంకిత స్ఫురదంగుళిపాణినా
శ్లో॥ వీజయంతీం స్వభర్తారం చామరేణ శనైశ్శనైః

తా॥ దిరిసెన పూవ్వులు వలె మిక్కిలి మృదువులును సుందరములును నగు రెండు భుజములచే మనోహరముగా నుండునటువంటియును, ఉంగరములచే విరాజిల్లుచుండు వ్రేళ్ళు గల చేతితో భర్తయగు శ్రీ యాంజనేయస్వామివారిని వింజామరము పుచ్చుకొని మెల్లమెల్లగా విసరుచుండినటువంటియును,

శ్లో॥ రంభాసౌందర్య సర్వస్వహారి రంభోరు సంభ్రమామ్
సికతామయ సౌందర్యజఘనాం ఘన విభ్రమామ్

తా॥ రంభయను నప్సర స్త్రీయొక్క సౌందర్యము అను సర్వస్వమును హరించినట్లు విలసిల్లునట్టి యరటిచెట్లవలె నుండు తొడలచే విరాజిల్లుచుండునటువంటియును, ఇసుక రాసులవలె మిక్కిలి సౌష్ఠ్యమయి రమ్యమయి యుండు పిఱుదులు కలిగి యుండునటువంటియును, మేఘగాంభీర్యము కలిగియుండు నటువంటియును,

శ్లో॥ ఆవర్తనిమ్న వివర స్ఫురన్నాభిగుహాంతరామ్
రక్త పంకేరుహాపఙ్క్త్య రోమరాజివిరాజితామ్.

తా॥ సుడితిరిగియుండి పల్లముగానుండి విలసిల్లు నాభి యను గుహాంతరము కలిగియుండునటువంటియును, ఎఱ్ఱతామర

పూవుకాంతివలె నుండు రోమముల వరుసలచేత విరాజిల్లుచుండి నటువంటియును,

శ్లో॥ ముక్తాహారస్ఫుర ద్గ్రీవాం సర్వాభరణ భూషితామ్
మందస్మితాం సువర్ణాభాం సూర్యపుత్త్రీం సువర్చలామ్

తా॥ ముత్యాలహారములచే విలసిల్లుచుండు మెడ కలిగి యుండినటువంటియును, చిఱునవ్వు నవ్వుచుండునటువంటి యును, సర్వాభరణములు ధరించియుండినటువంటియును, సూర్యు నియొక్క కుమార్తె యగునటువంటియును,

శ్లో॥ కౌశేయం పరిధానంచ దధానంచ కుశేశయమ్
ఏవం సర్వగుణోపేతాం ప్రియసీం మారుతాత్మజః

తా॥ పట్టుబట్టను కట్టుకొనియుండినటువంటియును, తామరపూవును ధరించియుండినటువంటియును మంచివర్చస్సు కలిగియుండినటువంటియును ఇట్లు సర్వగుణములు కలిగియుండు నటువంటి ప్రియురాలగు సువర్చలామహాదేవిని,

శ్లో॥ వామభాగే వహన్ భార్యాం క్షణా త్ప్రాదురభూ న్మునేః

తా॥ వామభాగమునందు ధరించియుండునటువంటి శ్రీయాంజనేయస్వామివారు శ్రీపుష్కరమహామునిశేఖరునకుఁ బ్రత్యక్షమయినారు.

శ్లో॥ కిరభకలభవాహః స్వర్ణరంభావనాంతః
ప్రచల దచలశృంగో వ్యక్తచంచత్కరాబ్జః
అధికుతల మగాత్తత్పుష్కరాధిష్ఠితం య
ద్రవిసుతకర ధారీ లంబహారో హనూమాన్

తా॥ యౌవనదశలోనుండు ఒంటెను వాహనముగా నధిష్ఠించినట్టియును, బంగారు అరటితోటలో మిక్కిలి చలించు

చున్న కొండశిఖరమువలె నుండునటువంటియును,మిక్కిలి ప్రకాశించుచున్న తామరపూవును ధరించినటువంటియును; సూర్య పుత్రికయగు సువర్చలమహాదేవినిచేతితోఁబుచ్చుకొనియున్నటు వంటియును, శ్రీహారము లనేకములు ధరించియుండునటువంటి శ్రీయాంజనేయస్వామివారు పుష్కరునియెదుట సాక్షాత్కరించినారు.

మైత్రేయః:—

శ్లో॥ హనుమన్మునిసంవాదం శ్రోతుమిచ్ఛా మ్యహం మునే!
తం మమాచక్ష్వ పాపఘ్నం పరాశర! గురూత్తమ!

తా॥ మైత్రేయముని పరాశర మహామునీశ్వరు నడుగు చుండెను. ఓ పరాశర మునిసార్వభౌమా! శ్రీ హనుమత్ప్రభువారును శ్రీ పుష్కరమునీశ్వరుండును సంభాషించుకొన్న ప్రసంగము పాపనాశనకరమైనది. కావున దానిని వినవలెనని కోరిక కలదు. నాకు చెప్పవలయును.

పరాశరః:—

శ్లో॥ తమాగతం హనూమంతం స్వదృష్టివిషయం ద్విజః
దృష్ట్వాతు సహసోత్థాయ సాష్టాంగం ప్రణతోఽభవత్

తా॥ పరాశరుండు ఇట్లు చెప్పుచున్నాఁడు. ఓమైత్రేయా! వినుము, శ్రీ యాంజనేయస్వామివారు తనయెదుట సాక్షాత్కరించుట శ్రీ పుష్కరముని తెలిసికొని వెంటనే లేచి సాష్టాంగ నమస్కారముచేసెను.

శ్లో॥ పునరుత్థాయ సంతుష్ట స్తుష్టా వాభీష్టదైవతమ్
హనుమంత మువాచాథ పుష్కరో దీనవత్సలః

తా॥ తిరిగి వెంటనే లేచి సంతోషించినవాఁడై తనకు అభీష్ట దేవుండగు శ్రీ హనుమత్ప్రభుచంద్రునితోఁ బుష్కరుండు దీనులయందు మిక్కిలి ప్రేమకలవాఁడు గావున స్తోత్రములు చేసిచేసి సంతోషపఱచి యిట్లు పలికెను.

శ్లో॥ గాలోఽయం మృగయు ర్నీచః కథం మంత్రస్య తే ప్రభో!
యోగ్యోఽయమితి సందేహో బాధతే మా మహర్నిశమ్

తా॥ ఓస్వామీ! గాలుండు వీఁడు. మిక్కిలినీచుఁడు. కిరాతుఁడు. తమ మంత్రముపదేశించుటకెట్లు యోగ్యుఁడగును? ఇతని ప్రవర్తనమునుబట్టి యోగ్యుఁడని యనుకొనుచున్నాను. ఈ విషయములో రాత్రింబవళ్ళు నేను నామనస్సు తెగక మిక్కిలి బాధపడుచున్నాను.

శ్లో॥ అయంతు చిరరాత్రాయ మా ముపాస్తే కృతాంజలిః

తా॥ ఈ గాలుండు చాలకాలమునుండి నమస్కారము చేయుచు నన్ను సేవించుచున్నాఁడు అనెను.

శ్లో॥ కపీంద్ర స్త ముపాచాథ మాకురు ష్వాఽత్ర సంశయమ్

తా॥ అంత శ్రీ యాంజనేయస్వామివారు జవాబు చెప్పుచున్నారు. ఓ పుష్కరా! నీవీ విషయములో సంశయింపకుము.

శ్లో॥ మన్మంత్రజాలవిషయే మద్భక్తే మయ్యపి ద్విజ!
ఉపదేశగురౌచాపి భక్తిరేవాత్ర కారణమ్

తా॥ ఓ పుష్కరమునీంద్రచంద్రమా! నాయొక్క మంత్రములలో దేనికైననుసరే, నా భక్తునియందుఁగాని, నాయందుఁగాని, మంత్రము నుపదేశించిన గురువునందుగాని భక్తికలిగి

యుండుటయే ముఖ్యము. మిగిలినవిషయము లంతగా గమనింప వలసిన యవసరము లేదు.

శ్లో॥ శూద్రోవా, విప్రకీర్ణోవా, వైశ్యోవాః క్షత్రియోపివా,
విప్రోవా, యశ్చకశ్చాపి యోషిద్వా పురుషోఽపివా

తా॥ శూద్రుండుగాని, లేక సంకరజాతికలవాఁడుగాని, కోమటిగాని, రాజుగాని, బ్రాహ్మణుండుగాని, లేక యేయే భేద ములలో నుండువాఁడుగాని, స్త్రీగాని, పురుషుండుగాని,

శ్లో॥ మన్మంత్రవిషయే సర్వే పాత్రాణ్యేవ న సంశయః

తా॥ నాయొక్క యేమంత్రమునకైనను నరేఁ; యందఱును అర్హులే యగుదురు. ఇందుకు సంశయమేమాత్రము లేదు.

శ్లో॥ వంచకాయ కృతఘ్నాయ దాంభికా యాఽతిలోభినే
గురు విశ్వాస హీనాయన దేయం మంత్ర ముత్తమమ్

తా॥ మోసగానికిని, చేసిన యుపకారమును మఱచి పోయి యుండువానికిని, బడాయియు గర్వమును గలవానికిని, మిక్కిలి యాశ, పిసినిగొట్టుతనము కల వానికి మాత్రము; ఇట్టి నాయొక్క మహామంత్రమును బోధించుట తగదు.

శ్లో॥ తస్మాదస్త్యస్య విశ్వాసః స్థిరా భక్తి రభూ ద్ద్విజ!
దేయ మే వాస్య మంత్రం మే ద్వాదశాక్షర ముత్తమమ్.

తా॥ అందువల్ల నితండు మంచివిశ్వాసములకవాఁడును, నిశ్చలమగు మంచిభక్తి కలవాఁడును, కనుక ఓపుష్కర మునీ శ్వరా! నాయొక్క ద్వాదశాక్షర మహామంత్రమును ఈ గాలున కుపదేశింపుము.

శ్లో॥ ఇత్యుక్త్వా హనుమాన్ భక్తం తత్రైవాంతరధీయత

తా॥ ఇట్లు తనభక్తుండగు శ్రీపుష్కర మునిచంద్రుని కీ విషయ మంతయును బోధించి, శ్రీయాంజనేయస్వామివా రక్కడ నుండియే యంతలో నంతర్ధానమైనారు.

శ్లో॥ తత స్సారస చక్రాంగ హంస కూజితశోభితమ్
జలకుక్కుట కోయష్టి కాత్యూహ కలకూజితమ్

తా॥ అంతట నీటికోంగలు, బెగ్గురు పిట్టలు, చక్రవాకములు, హంసలు మొదలు అగువాని ధ్వనులతో మనోహరముగా నుండునటువంటియును, నీటికోడులు, కోయష్టికములు, మొదలగు వానిచేత ఊహించుటకు అలవి కాకుండునట్లును మృదుమధురముగాను నింపుగాను ధ్వనులు చేయఁబడుచుండు నటువంటియును,

శ్లో॥ వికచ త్కమలవ్రాత భ్రమమాణ మధువ్రతమ్
మల్లికా జాతి లకుచ సురభిక్రాంతకాననమ్

తా॥ వికసించుచున్న తామరపూవులలోఁ దిరుగుచుండు తుమ్మెదలు కలిగియుండునటువంటియును, మల్లెలు జాజులు మాచి మొదలగు పూవులయొక్క పరిమళములతో నిండియుండు కాననములు కలిగియుండినటువంటియును, శ్రీ యుక్తమై యుండినటువంటియును,

శ్లో॥ హనుమత్పాదనిర్మాల్య శోభి తోభయపార్శ్వకమ్
పురంధ్రీ కుచ హారిద్ర రంజితోరువిరాజితమ్

తా॥ శ్రీయాంజనేయస్వామివారియొక్క పాదములు పూజచేసియుండు పూలు మొదలగు నిర్మాల్యములు తీసికొని వేయుటచేత వానితో నిండియుండు నన్నివైపులు కలిగియుండు నటువంటియును, స్త్రీలు స్నానములుచేయుచుండునపుడు వారి

స్తనములకుఁ బూసికొనిన పచ్చని యెఱ్ఱని రంగులుగల సుగంధ ద్రవ్యములు కడుగుకొనుచుండుటచేత నా రంగులు గలిగియుండు నటువంటి నీటి యుపరిభాగము కలిగియుండి యెదుటుబొమ్మ వలె నుండి మిక్కిలి ప్రకాశించుచుండునటువంటియును,

శ్లో॥ జపతా మునిబృందేన సేవ్యమాన మహర్నిశమ్
సర్వ పాపహరం నృణా మవిదూరే భయాపహమ్

తా॥ జపముచేయుచుండు మునిసమూహములచేత రాత్రిం బవళ్ళు ఎల్లకాలము సేవింపఁబడుచుండునటువంటియును, మనుష్యులయొక్క సర్వపాపములను నపరిహరింపఁజేయుచుండు నటువంటియును, వెంటనే సకలభయములను పోఁగొట్టుచుండునటు వంటియును,

శ్లో॥ పుణ్యతీర్థ మితి ఖ్యాతం త్రిషు లోకేషు విశ్రుతమ్
దర్శయామాస గాలాయ పుష్కరో హ స్తసంజ్ఞయా

తా॥ పుణ్యతీర్థమని మంచి ప్రసిద్ధి కలిగియుండినటువంటి యును, మూఁడులోకములయందును మంచిప్రసిద్ధికలిగియుండు నటువంటియును, పుణ్యమగు సరస్సును పుష్కరుఁడు గాలునకు హస్తసంజ్ఞతోఁ జూపించి,

శ్లో॥ పుణ్యతీర్థం ప్రదర్శ్యాథ ప్రాహ గాలం మునీశ్వరః
స్నాత్వా తత్ర మహాపుణ్యే శీఘ్ర మాగమ్యతా మితి

తా॥ ఆ పుణ్యతీర్థమగు నా చెఱువులో స్నానముచేసి వెంటనే రమ్మని గాలునకు ఆజ్ఞాపించెను. అంతట

శ్లో॥ గాలస్త మబ్రవీ ద్విప్ర! భవత్పాదాంబు దీయతామ్

తా॥ గాలుఁడు పుష్కరునితో నిట్లనెను. ఓపుష్కర మహామునీశ్వరా! తమ పాదజలము నాకీయవలయును.

శ్లో॥ తదేవ పుష్కరం గంగా తదేవ కుశికాత్మజా
కావేరీ యమునా చైవ కృష్ణవేణీ సరస్వతీ

తా॥ తమరిచ్చిన తమ పాదజలమే పుష్కర తీర్థము వంటిది. అదియే గంగానది వంటిది. అదియే కౌశికీనదివంటిది. అదియే కావేరీనది వంటిది. అదియే యమునానది వంటిది. అదియే కృష్ణానది వంటిది. అదియే సరస్వతీనది వంటిది.

శ్లో॥ తదేవ మానసం తీర్థం తదేవ సరయూనదీ
తదేవ చంద్రభాగాఽపి ఫల్గునీ సింధుసంగమః

తా॥ అదియే మానససరోవరము వంటిది. అదియే సరయూనది వంటిది. అదియే చంద్రభాగానదివంటిది. అదియే ఫల్గునీనదివంటిది. అదియే సముద్రసంగమము చేసిన పుణ్యతీర్థము వంటిది.

శ్లో॥ రేవానదీ మహాపుణ్యా గురుపాదోదకం ప్రభో!

తా॥ అయ్యా! దియే మహాపుణ్యప్రదమగు రేవానదివంటిది. అయ్యా! గురువులగు తమయొక్క పాదతీర్థమువంటి పుణ్య విశేషము మహత్తరమగు ఫలము కలది.

శ్లో॥ యస్యాఽపి నాత్రవిశ్వాసో గురుపాదోదకే శుభే
న పునంత్యథ దుర్బుద్ధిం తీర్థానా మయుతాన్యపి

తా॥ మహామహిమగల గురుపాదతీర్థమునం దెవ్వనికి నమ్మకము లేదో? వానియొక్క పాపమును లక్షమహాతీర్థములలో స్నానముచేసినను పోగొట్టుకొనుటకు వీలులేదు.

శ్లో॥ హంత్యాశతసహస్రాణి హ్యాగమ్యాగమనానిచ
స్వర్ణస్తేయాది పాపాని సురాపానకృతాన్యపి

తా॥ ఓస్వామీ! గురుపాదతీర్థము అనేకవేలవందల సంవత్సరములనుండి చేయరాని యెన్నిచెడుపనులు చేసినను, వెళ్ళరాని యెన్నిచెడుచోట్లు తిరిగినను, అన్నింటిని నొక్కక్షణములోఁ బోఁగొట్టుచుండును. బంగారు మొదలగువానిని దొంగిలించిన మహాపాతకములుగాని, కల్లుత్రాగుట మొదలగు పాపకృత్యములుగాని, యెన్నికోట్లజన్మములనుండి చేయుచున్నవైనను గురుపాదతీర్థమువల్ల వెంటనే నశించును

శ్లో॥ గురుపాదోదక స్పర్శా త్సర్వాఘానాం వినాశనమ్

తా॥ గురుపాదోదకము తగిలినంతనే యన్నిపాపముల కును వినాశనము కలుగును. అన్నిసుఖములు అన్నిశుభములు కలుగును.

శ్లో॥ తస్మా దిదం శరీరంమే భవత్పాదాంబుధారకమ్
ఆపాదమస్తకం శీఘ్రం సిచ్యతాం కరుణానిధే!

తా॥ కావున నోపుష్కరముని సార్వభౌమా! గురువులగు తమ పాదోదకమును స్పృశించుటచేతనే నా శరీరమంతయును నా యాత్మమంతయును బవిత్రమై యున్నది. గావున మహాత్మా! తమపాదతీర్థమును నాశరీరముమీదఁ బాదములు మొదలుకొని శిరస్సువఱకును దేహమంతటను ఓ దయానిధీ! గురుపాదజలమును చల్లుడు.

శ్లో॥ యద్వైభవా దహం సద్యః కార్యసిద్ధి మవాప్నుయాత్.

తా॥ దాని ప్రభావమువల్ల నేను వెంటనే కార్యము ఫలసిద్ధిని బొందుటను ననుభవింతును. సుఖింతునని చెప్పెను.

శ్లో॥ ఇత్యుక్తః పుష్కర స్తేన వ్యాధేన దృఢబుద్ధినా
స్వగురుంచ హనూమంతం ధ్యాత్వా యోగవిదాం వరః

తా॥ ఇట్లు గాలుండు చెప్పగానే పుష్కర మహాముని యోగమును నేర్చినవారందరిలో మిక్కిలి గొప్పవాఁడుగావున వెంటనే తన గురువుగారిని శ్రీయాంజనేయస్వామివారిని ధ్యానమును జేసి,

శ్లో॥ పోక్షయామాస తస్యాంగే నిజపాదోదకం మునిః

తా॥ పుష్కరుండు వెంటనే తన పాదతీర్థమును గాలుని సర్వ శరీరముమీఁదను చల్లెను.

శ్లో॥ గురు పాదోదక స్పర్శ విశ్వాసా ద్ధత కిల్బిషః
సద్యోనివృత్తి మగమ ద్వ్యాధే ర్వ్యాధో దురాత్మనః

తా॥ గురువుగారి పాదోదకము యొక్క బిందువులు శరీరమునందంతటను తగులుటచేత వెంటనే యాతనిశరీరములో నుండురోగము మొదలంట నశించిపోయినది. వెంటనే కిరాతుండు మిక్కిలికూ్రరమగు ఆవ్యాధి బాధనుండి వెంటనే విడివడి సుఖముగా నుండెను.

శ్లో॥ తతో విమలదేహస్య గాలస్య విమలాత్మనః
సువర్చలాసమేత శ్రీ హనుమ ద్ద్వాదశాక్షరమ్
శ్లో॥ మంత్రరాజ మితిఖ్యాతం దిష్టవాన్ కరుణానిధిః

తా॥ పిమ్మట గురుపాద జల మహిమమువల్ల, విమల శరీరము కలిగినటువంటియును, విమలమనస్సు కలిగినటువంటియును, గాలునికి దయానిధియగు శ్రీపుష్కరమునీంద్రుండు సువర్చలా సమేత శ్రీహనుమంతునియొక్క ద్వాదశాక్షర మహామంత్రమును బోధించెను.

శ్లో॥ గాలో జపన్ మహామంత్రం సన్నిధావేవ సద్గురోః
అష్టోత్తరశతావృత్త్యా సద్యస్సిద్ధి మవాప సః

తా॥ గాలుండు శ్రీ హనుమన్మహామంత్రమును గురువు గారగు పుష్కరమహాముని దగ్గరనే యుండి జపించుచు నూట యెనిమిది పర్యాయములు జపించి వెంటనే ఫలసిద్ధిని పొందినాడు

శ్లో॥ గురు విశ్వాస మాహాత్మ్యాత్ గురు పాదాంబు సేవనాత్
మనో నైర్మల్యవత్త్వాచ్చ సద్యస్సిద్ధి మవాప సః

తా॥ గురువునందు మిక్కిలి విశ్వాసము కలిగియుండు మాహాత్మ్యమువల్లను, గురుపాదజలమును సేవించు చుండుట వల్లను, స్వచ్ఛమగు మనోవృత్తి కలిగియుండుటవల్లను గాలుండు సద్యస్సిద్ధిని పొందినాఁడు.

శ్లో॥ అతీంద్రియార్థజాలాని భూత భవ్య భవంతిచ
దిష్టమాత్రే మహామంత్రే బుద్ధవాన్ మృగయుస్తథా

తా॥ ఇంద్రియములవల్లఁ దెలిసికొనుటకు వీలులేని సమాచారములన్నియును, భూతకాల సమాచారములు వర్తమానకాల సమాచారములు, భవిష్యత్కాల సమాచారములు. జరిగినవి జరుగుచున్నవి జరుగఁబోవునవి యావద్విశేషములు, ఆ వేట కాఁడగు గాలుండు మంత్రోపదేశము కాఁగానే యన్నియును దెలిసికొనియుండెను.

శ్లో॥ ఏవం సర్వార్థ విజ్ఞానాత్ ప్రాగహం సుప్తవానపి
బుద్ధోఽహ మధునాచేతి జజాప వ్యాధవల్లభః

తా॥ ఇట్లు సర్వవస్తుపరిజ్ఞానము కలిగిన పిమ్మట పూర్వము నిద్రపోయియుంటిననియును, ఇప్పుడైనను మేలుకొంటిననియును, వెనుకటి యజ్ఞానకాలమునాటి జపముకూడ నిష్ఫలము చేయు

చుండునట్లు గాలుండు మహానిష్ఠతో సర్వకాలము శ్రీహనుమ న్మహామంత్రమును జపించుచుండెను.

శ్లో॥ నిధయోపి సమృద్ధిశ్చ విషయా స్తస్య చక్షుషః
గురువిశ్వాసమాహాత్మ్యా దభవన్ తస్య వశ్యగాః

తా॥ నిధులు కల ప్రదేశములు, అవి సమృద్ధిగాఁ గలుగు మార్గములు మొదలగు సన్నివిషయములును, ఆ గాలునికి గురువిశ్వాసముయొక్క మహిమమువల్ల కన్నులయెదుటనున్నట్లు స్పష్టముగాఁ దెలియుచున్న యవి.

శ్లో॥ ఖేచరత్వ మభూ త్తస్య సంచార స్సర్వవిష్టపే

తా॥ ఆ గాలునికి ఆకాశసంచారమునందు శక్తి కలిగినది. అన్నిలోకములు సంచరించుశక్తి కలిగినది.

శ్లో॥ సిద్ధచారణగంధర్వా ఇంద్రాద్యాఅపి దేవతాః
వ్యాధస్య గురువిశ్వాసా ద్విస్మయం పరమం యయుః

తా॥ సిద్ధులును, గంధర్వులును ఇంద్రుడు మొదలగు దేవతలును ఆ కిరాతునికిఁగలిగిన గురువునందలి విస్మయము చూచి మిక్కిలి ఆశ్చర్యమును పొందినారలు.

శ్లో॥ పపాత పుష్పవృష్టిశ్చ ననృతు శ్చాప్సరోగణాః
దేవదుందుభయో నేదు ర్వవు ర్వాతా యథాసుఖమ్

తా॥ పువ్వులవర్షము కురిసినది. అప్సరసలు నాట్యములు చేసిరి, దేవదుందుభులు మ్రోగినవి. వాయువులు వీచినవి ప్రపంచకమంతయును సుఖమునుపొందినది.

శ్లో॥ తతః పరమసంతుష్టో గాలో గురు మథాఽబ్రవీత్

తా॥ పిమ్మట గాలుండు మిక్కిలి సంతోషించినవాఁడై గురువగు పుష్కరమునీంద్రునితో నిట్లుపలికెను.

శ్లో॥ కృతార్థోస్మి మహాభాగ! తవ పాదాంబుసేవనాత్
మహామంత్రప్రదానాచ్చ సిద్ధోఽస్మి జగతాం త్రయే

తా॥ ఓ మహానుభావా! పుష్కరమునిచంద్రా! తమ
వజలమును సేవించుచుండుటవల్లను కృతార్థుండ నయినాను.
కష్టములు పోయినవి, సుఖమనుభవించుచున్నాను. తమరు
శించిన శ్రీ హనుమన్మంత్రముయొక్క ప్రభావమువల్లను
ాండులోకములయందును ప్రసిద్ధికలవాఁడ నయినాను.

శ్లో॥ సంప్రార్థయే పరంబ్రహ్మన్! భవంతు మనసా గురో!
తవ పాదాబ్జయుగళే భక్తిర్భూయా న్నిరంతరం.

తా॥ ఓ గురుసార్వభౌమా! పుష్కరమునిచంద్రమా!
కొకటి మిమ్ముకను ప్రార్థించుచున్నాను. నిరంతరము తమ
వముల నెడి తామరపూవులందు భక్తి పెంపొందునట్లు
మిమ్ము.

శ్లో॥ ఇదమేవ మమాభీష్ట మితోన్య న్నాఽస్తి మే మునే!
ఆదిశ్యతాం మమాజ్ఞాప్యం మాభూ త్కాలవిపర్యయః

తా॥ ఓ మహానుభావా! మిమ్ము నేనిదియే కోరుచున్నాను
తకంటె మఱేమియు వేఱుగాఁ గోరుచుండుట లేదు. కాల
ర్యయము కాకుండునట్లును తారుమారు గాకుండునట్లును
ముగా మీ రాజ్ఞనొసంగుడని ప్రార్థించెను.

శ్లో॥ వ్యాధస్య వచనం శ్రుత్వా పుష్కరః పుష్కరేక్షణః
తథేతి ప్రతిజగ్రాహ ముఖ్యశిష్యో భవానితి

తా॥ ఆ కిరాతుండగు గాలునిమాట విని కమలములు
తములుకలిగి యున్నటువంటి పుష్కరమహామునీంద్రుండు

నీ కోరిక నీవుకోరినట్లు సిద్ధించుననియును,నీవు నాకుముఖ్యశి:
ష్యుడయియుందువనియును ఆశీర్వచనము చేసెను.

శ్లో॥ మంత్రసిద్ధఇతి జ్ఞాత్వా న త్యాజ్యోహి కదాచన
పరిత్యాగాద్యో భవే న్నానం దారిద్ర్యంచ భవే న్మహత్

తా॥ మంత్రము సిద్ధి యయినదని తలంచుకొని
మును మంత్రమును జపించుచుండుట మానకుము సుమా!
మానితివేని గొప్ప ఇబ్బంది కలుగును. మిక్కిలి వె:
దారిద్ర్యము కలుగును.

శ్లో॥ యథాశక్తి జపః కార్యః హనుమత్ప్రీతయే సదా
భోక్తవ్యాహి మహాభోగా యథేష్టం బంధుభిస్సహ

తా॥ శ్రీయాంజనేయస్వామివారు ప్రీతిని పొం:
గాను ఓపిక ననుసరించి జపమును చేయుచునే యుండుము
నీ స్నేహితులు నీ బంధువులు నీ పుత్రులు నీ సేవకు
భార్యయు నెల్లవారలును కలసిమెలసి స్వేచ్ఛగా సర
ములు సర్వసుఖములు సకలైశ్వర్యములు అనుభవించుచుం

శ్లో॥ భుక్త్వా భోగాన్ తతో గాల ! హనుమత్పద మాప్నుహి
ఇత్యుక్త్వా ప్రేషయామాస వ్యాధం తదేశ్మ పుష్కరః

తా॥ ఈ లోకములో సర్వసుఖములు పొందుదు. పి
ఓ గాలుడా! శ్రీహనుమల్లోకమును పొందుదువు. అని
యా కిరాతవర్యుండగు గాలుని; పుష్కరమహాముని
నివాసమునకుఁ బంపెను.

శ్లో॥ ప్రేషితో గురుణా గాలో విసృజన్ బాష్ప ముత్తమమ్
ప్రదక్షిణ నమస్కారైః పూజయామాస తం గురుమ్

తా॥ ఇట్లు గురువుగారి యాజ్ఞను పొంది గురువుగారిని విడిచి వెళ్ళవలసివచ్చినదని కన్నీరుకార్చుచున్నవాఁడై ప్రదక్షిణము నమస్కారముచేసి యా పుష్కరగురూత్తమునిని బూజించెను.

శ్లో॥ అథ గురు పదపద్మ లగ్న చేతాః
శ్రిత నిజకార్య భరో గురుప్రసాదాత్
నిజగృహ ముపచక్రమే నిగంతుం
నిజ గురు సంప్రతిపన్న సౌమ్య భావః

తా॥ పిమ్మట గురూత్తమునియొక్క పాదపద్మముల యందు మనస్సును నిలిపినవాఁడై, గురువుగారి యనుగ్రహము వల్లఁ దనకార్యములు నెరవేర్చుకొనినవాఁడై, తనగురువునందు లగ్నమగు మంచిస్వభావముకలవాఁడై, గాలుండు తననివాసము నకుఁ బయనమయ్యెను.

:—"పైచరితముచే శ్రీహనుమద్ద్వాదశాక్షరమంత్రము నుపాసించి గురుభక్తితో గాలుఁడు కుష్ఠవ్యాధినుండి విముక్తుడైనట్లు దెలియఁ బడుటచే భక్తులెల్లరు గురుభక్తిగలవారై మంత్రము నుపాసించినయెడల మంత్రము సిద్ధించునని తెలియగలరు.మంత్రసిద్ధి సాధనములలో గురుభక్తియే ముఖ్యమని దీని భావము."

—: గురుభక్తిచే ధ్వజదత్తునకు మంత్రసిద్ధి :—

మైత్రేయః:—

శ్లో॥ కార్యసిద్ధి ముపాగమ్య వ్యాధో మన్మథసుందరః
తతః కింకృతవాన్ గాలః మద్యేమార్గం పరాశర !

తా॥ ఓ పపరాశర మునీంద్రా! మన్మథసుందరుఁడగు గాలుండు కార్యసిద్ధిని పొందినతరువాత త్రోవలో నేమి యాచరించెనో; చెప్పవలయు నని మైత్రేయుండు పరాశరునినడిగెను.

శ్రీ పరాశరః—

శ్లో॥ మైత్రేయ! శృణు వక్ష్యామి గాల వృత్తం యథాక్రమమ్
యద్వృత్తదర్శనా ద్భూయో దేవాఅపి ముదం యయుః

తా॥ శ్రీ పరాశరుండు ఇట్లు చెప్పుచున్నాఁడు. ఓమైత్రేయ మునీంద్రా! ఏ గాలవుని సమాచారము చూచి దేవతలుకూడ ముదమును పొందుచుందురో; ఆ మహాత్ముండగు గాలుని వృత్తాంతము యథాక్రమముగాఁ జెప్పెదను వినుము.

శ్లో॥ గచ్ఛ న్మార్గే శనై ర్గాలః ధ్వజదత్త మవైక్షత

తా॥ ఇట్లు గాలుండు వెళ్ళుచుఁ దోవలో ధ్వజదత్తుని జూచెను.

శ్లో॥ దృష్టమాత్రే ద్విజే తస్మి౯ త్యక్త్వా తత్పదవీం హఠాత్
భీతో మార్గాంతరం ప్రాప్తో గురునిందా యతోఽభవత్

తా॥ ఆ ధ్వజదత్తుం డేదియే నడుగుననియెంచి, గురునింద కలుగునని భయంపడి ఆతోవను విడిచి ఇంకొక తోవనే వెళ్ళుచుండెను

శ్లో॥ గచ్ఛంత మద్భుతాకారం సూర్యబింబ మివ స్థితమ్
దృష్ట్వా తం సహసోత్థాయ విప్ర స్త్వర్య క్సమాగతః

తా॥ ఇట్లు వెళ్ళుచున్నట్టియును, మిక్కిలి యాశ్చర్యకరమగు రూపముకలిగి యుండునటువంటియును, సూర్యబింబమువలె మిక్కిలిప్రకాశించు చున్నట్టియును ఆగాలునింగాంచి వెంటనే ధ్వజదత్తుండు లేచి, యాగాలుని కడ్డముగాఁబోవుచుఁడై

శ్లో॥ జవేన మహతా ధావ౯ మహానిశ్వాస ముత్సృజ౯
మహతా రంహసా సోఽపి క్షణా ద్గాలేన సంగతః

తా॥ ఎక్కువ వేగముగాఁ బరుగెత్తుచు, గొప్పగొప్ప నిట్టూర్పులు విడుచుచు, నెక్కువ చోరవగలవాఁడై; యొక్క క్షణములో గాలునిఁజేరి కలుసుకొనినాఁడు.

శ్లో॥ తం తథావిధ మాసాద్య విప్రో వచన మబ్రవీత్

తా॥ అట్లు ప్రకాశించు గాలునిం గాంచి ధ్వజదత్తుం డిట్లు పలికెను.

శ్లో॥ మా ముపేక్ష్య క్వగంతాసి ? సుహృ త్ప్రాణసమో మమ

తా॥ నాకు నాప్రాణముతో సమానుండవగు మిత్త్రుం డవుకదా! నన్ను విడిచి వెళ్ళుచున్నా వెక్కడికి ?

శ్లో॥ త్వదాగమన మేవాత్ర ప్రతీక్ష్యాఽహ మవస్థితః

తా॥ నేను నీరాకను చూచుచునే ఇట్లు ఇక్కడనున్నాను.

శ్లో॥ ఋజుభావం పరిత్యజ్య కథం గంతాసి వక్రతామ్?

తా॥ తిన్నని త్రోవను వదలి మెలికగా నున్న వంకర మార్గమును బట్టి వెళ్ళుచున్నా వేమి?

శ్లో॥ ఇదం రూపం కుతోలబ్ధం? కందర్పస్యాఽపి మోహనమ్
కుత్సితం పూర్వరూపంతు నివృత్తం కేన హేతునా ?

తా॥ ఓమిత్త్రమా! మిక్కిలి వికారముగానున్న నీరూప మెట్లుమారినది ? మన్మథునికంటెను మిక్కిలి యందమైన యీ యాకార మెట్లుకలిగినది ?

శ్లో॥ ఏత త్సర్వం మమాఖ్యాహి పృచ్ఛతో దీనవత్సల!

తా॥ ఓజాలికలవాఁడా ! నేను అడుగుచున్నదానికి నీవు తగిన ప్రత్యుత్తరము సర్వమును చెప్పుము.

శ్లో॥ ఏవం సంప్రార్థితో గాలో యథావృత్త మవేదయత్

తా॥ ఇట్లు ధ్వజదత్తుండు గట్టిగాఁ జెప్పవలసినదని బ్రి మాలుచుండఁగా గాలుండు జరిగిన సమాచారమంతయుఁ తెలియఁజేసెను.

శ్లో॥ పుష్కరస్తు మహాయోగీ గురు గ్గౌరవగోచరః ।
నిజపాదోదకేనైవ దుర్దశాం మే జహార సః

తా॥ మిక్కిలి గౌరవపాత్రుండగు పుష్కరమహామునీశ రుండగు గురుండు తన పాదజలముచేతనే నాయొక్క దుర్ద యంతయును నివారింపఁజేసెను.

శ్లో॥ తదనుగ్రహ ఏవాఽయం శ్రేయోహేతుః పరం మమ
తా॥ వారి యనుగ్రహముచేతనే ఈ తేజన్సు నాః సంప్రాప్తించినది.

శ్లో॥ తతో రూప మిదం ప్రాప్తం రమణీయం మయా ద్విజ !
తా॥ నాకు నీ మనోహరమగు రూపము ఆ గుః సార్వభౌముని దయవల్లనే కలిగినది.

శ్లో॥ ఇదానీ మహ మాగచ్ఛన్ మృగయాభ్యాసపాటవాత్
చమరీం ద్రష్టుకామస్సన్ వక్రమార్గ ముపాగతః

తా॥ నేనిప్పుడు వచ్చుచు వేటయొక్క యలవాః చొప్పున చమరీమృగమును చూడవలె నను కోరికతో, నీవంక మార్గము ననుసరించి వచ్చుచున్నాను.

శ్లో॥ ఇత్యుక్త్వా వ్యాధవర్యోపి నిజవేశ్మ క్షణా దగాత్
తా॥ ఇట్లుచెప్పి వెంటనే యా గాలుండు ఒక క్షః ములోనే తన నివాసమునకు వెళ్లెను.

శ్లో॥ ఆగత్య స్వగృహం గాలో భుంజన్ భోగా న్యథేప్సితాన్
పుత్ర మిత్ర కళత్రాద్యై ర్బహుకాలం విహృత్య సః

తా॥ తనయిల్లుచేరి తన పుత్త్రులతోను భార్యతోను మిత్త్రులతోను స్వేచ్ఛగా సుఖము లనుభవించి చాలకాల మిట్లు విహరించుచు,

శ్లో॥ హనుమన్మంత్రమాహాత్మ్యా దగమ త్పరమాం గతిమ్

తా॥ శ్రీ ఆంజనేయస్వామివారి మంత్రముయొక్క మాహాత్మ్యమువల్ల పరమపదమునందెను.

శ్లో॥ ధ్వజదత్తోపి విప్రేంద్ర స్సిద్ధ్యభావా చ్చిరాదపి
వ్యాధావిలంబసిద్ధేశ్చ నిర్వేదం పరమం గతః

తా॥ బ్రాహ్మణశ్రేష్ఠుండగు ధ్వజదత్తుండును తన కెంత కాలముగడచినను సిద్ధికలుగక పోవుటవల్లను, వ్యాధునకు వెంటనే సిద్ధికలుగుటవల్లను మిక్కిలి విచారమును పొందినాడు.

శ్లో॥ మహావేగేన సంభ్రాంతః పుష్కరం పున రాయయౌ

తా॥ ఇట్లు చింతించుచు మిక్కిలి తొందరయును తొట్రుపాటును పొందుచు వెంటనే తిరిగి పరుగెత్తుచుఁ బుష్కరముని యొద్దకు వెళ్లెను.

శ్లో॥ ప్రణమ్య శిరసా విప్రో వచనం పున రబ్రవీత్

తా॥ వెళ్లి ధర్మదత్తుండు పుష్కరమహామునికి నమస్కరించి యిట్లు పలికెను.

శ్లో॥ బ్రహ్మ! న్నహం ద్విజశ్రేష్ఠః వేదవేదాంగపారగః
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ స్సదాచారో జితేంద్రియః

తా॥ ఓ పుష్కర మహామునీంద్రా! నేను బ్రాహ్మణ వర్యుండను. వేదములు, వేదాంగములు తుట్టతుదవఱకును

జటవినాను. సకలశాస్త్రములలోని యర్థములు, నిశ్చయ జ్ఞానవ
సర్వమును దెలిసికొనినాను. మంచిప్రవర్తనమును మిక్కి
సమంజసమగు ఆచరణమును కలవాఁడను. పంచేంద్రియవ
లను వశ్యము చేసికొనినాను.

శ్లో॥ ఏవంవిధో జప న్మంత్రం నసిద్ధిం కథ మాప్నుయామ్?

తా॥ ఇట్టివాఁడను జపమునుచేసినాను. సిద్ధి కలగకుం
టకుఁ గారణమేమి ?

శ్లో॥ పురశ్చర్యాశ్చ బహుధా కృతాఅపి మహామునే!
మహతా నియమేనాఽహ మజపం మంత్ర ముత్తమమ్॥

తా॥ చాలసారులు పురశ్చర్యలుచేసినాను. ఓ పుష్క
మహామునిశేఖరా! మిక్కిలి గొప్ప నియమముతో నీ హను
న్మహామంత్రమును మిక్కిలి శ్రద్ధకలిగి జపమును చేసినాను.

శ్లో॥ నిరాహారో జితస్వాప స్స్నాత్వా పుణ్య సరిజ్జలే
వర్షాసు సికతాస్వేవ హేమంతే జలమధ్యమే.

తా॥ ఆహారము మానినాను. నిద్ర విడిచినాను. పుణ్యన
జలములో స్నానమును చేయుచున్నాను, వర్షకాలములో ఇస
తిన్నెలమీాదనుండి జపముచేసినాను. శీతకాలములో నీటినడు
నిలుచుండి జపముచేసినాను.

శ్లో॥ గ్రీష్మే త ప్తశిలాయాంచ జపన్నపి మహామునమ్
సిద్ధిం కదాపి నైవాపం విలంబః కేన హేతునా?

తా॥ వేసవికాలములో ఱాతిమీాద నిలువబడి జపః
చేసినాను. ఇట్లు చాలాకాలము ఈ మహామంత్రమును జపః
చేసినాను. ఇట్లెంతకాలము జపముచేసినను ఎప్పటికిని ఫలః
కలుగకుండుటకుఁ గారణంబేమి?

శ్లో॥ వ్యాధస్తు నీచజన్మాఽపి దురాచారో ద్విపాత్పశుః
కూరకర్మా దురాహార స్సదా విషయలంపటః.

తా॥ ఆ కిరాతుండగు గాలుండు మిక్కిలి హీనజాతిలోఁ బుట్టినాఁడు. చెడుప్రవర్తనము కలవాఁడు. రెండుకాళ్ళు గలిగి యుండియును పశువుతో సమానుఁడు. అతఁడుచేయు పనులన్నియును ఘోరములైనవి. దుష్టపదార్థములు భుజించుచుండును. ఎల్లప్పుడును ఇంద్రియములకు లోఁబడి ఇష్టమువచ్చినట్లు తిరుగుచుండును

శ్లో॥ సురాపానరతశ్చాపి హ్యాగమ్యాగమనోత్సుకః
దురాచారాశ్చ యేచాఽన్యే తేషు సర్వత్ర తత్పరః

తా॥ ఎల్లప్పుడును కల్లు తాగుచుండును. చేయరాని పనులు చేయుచుండుచు. వెళ్ళరానిచోట్లకు వెళ్ళుచుండును. ఈ ప్రపంచములో నేవియేవి చెడుపనులున్నవియో; ఆయా పనులన్నియును మిక్కిలి ప్రేమముతోఁ జేయుచుండును.

శ్లో॥కథమ్ మంత్రస్య యోగ్యోఽయం? కథం జానాతి తద్విధిమ్
భవతావా కథందత్తం? వ్యాధాయ కూరకర్మణే.

తా॥ అట్టినీచుండు మంత్రమును బోధించుటకెట్లు తగియున్నాఁడు? ఆ విధి అతనికెట్లు తెలియును? నీవెట్లు చెప్పినావు ఆ క్రూరకర్ముండునగు దురాత్మునకు?

శ్లో॥ కథమర్హతి గాలోఽయం? శ్వా యథా హవి రాధ్వరమ్

తా॥ యజ్ఞసంబంధమగు హవిస్సు కుక్కకు బెట్టరాని యట్లు మహామంత్రమును శ్రీ పుష్కరమునీంద్రా! నీచుండగు గాలునకుఁ జెప్పరాదుగదా!

శ్లో॥ ఆగంతుంవా కథంయోగ్య ? శ్శునీ వాధ్వరమండపమ్

తా॥ కుక్క యజ్ఞవాటికలోనికి వలె ఇతఁడు రావటమునకే విలులేదుకదా!

శ్లో॥ అథవా జపతో మంత్రం కిం నసిద్ధ్యతి? మే మునే!

తా॥ ఓపుష్కరమునీంద్రా! వానిమాటలు నా కెందుకు? నేను మిక్కిలి నియమముతో జపముచేయుచున్నానుకదా! నాకు ఫలసిద్ధి కలుగకుండుటకుఁ గారణంబేమి?

శ్లో॥ ఇత్యుక్తవంతం ధ్వజదత్త మగ్రతః
కిమేత దాశ్చర్య? మిహేతి చింతయన్
నివారయామాస స గాలదూషణా
చ్ఛనైశ్శనై స్సాంత్వవచోభి రాత్మవాన్

తా॥ ఇట్లు తనయెదుట సంభాషించుచున్న ధ్వజదత్తునింగని, ఇట్లు వీనికి మంత్రము సిద్ధింపకుండుటకుఁ గారణం బేమని మనస్సునందు సమాలోచనముచేయుచున్నవాఁడై, మెల్ల మెల్లగా ఆత్మజ్ఞానము నెఱింగిన పుష్కరమునీంద్రుండు ధ్వజదత్తున కా యా సంగతులు బోధించి గాలుని దూషించుచుండుటను క్రమముగా మాన్పించెను.

శ్లో॥ క్షిప్రం దిదృక్షు శ్శిథిలాన్యకృత్యో
మహామనో స్సిద్ధివిలంబహేతుమ్
ప్రత్యగ్దృశా దైవతసార్వభౌమమ్
విభావయామాస నిజాంతరంగే.

తా॥ ఇట్లు మాన్పి యితరకృత్యములన్నియును మానినవాఁడై శ్రీమహామంత్రము ధ్వజదత్తునికి సిద్ధింపకుండుటకుఁ గారణమును తెలియవలయును అని తొందరపడి దివ్యజ్ఞానమును

ధరించి దేవతాచక్రవర్తియగు శ్రీహనుమత్ప్రభువువారిని మనస్సులో ధ్యానించుచుండెను.

శ్లో॥ తతో యోగం సమాస్థాయ దృష్టవాన్ నిఖిలం జగత్
వర్తమానం యదేవాస్య భూతం భావి చ యత్పునః

తా॥ పిమ్మట యోగమును ధరించి భూతకాలమును వర్తమానకాలమును భవిష్యత్కాలమును సంచరించుచుండు సకల లోకములయొక్క సమాచారములను గుర్తించుచుండెను.

శ్లో॥ వివిచ్య సకలం పశ్యన్ ద్విజవృత్తాంతసంగ్రహమ్
నిశ్చికాయ మహాయోగీ హేతుం చాస్య విలంబనే.

తా॥ మహాయోగీంద్రుండగు పుష్కర మహామునీంద్రుండు ధ్వజదత్తునియొక్క పూర్వసమాచారము నంతయును గుర్తించి శ్రీ హనుమన్మహామంత్రమింతవఱకును ఫలసిద్ధిని కలిగింపకుండుటకుఁ గారణమును నిశ్చయించెను.

శ్లో॥ నిశ్చిత్యైవం మునిస్సమ్య గ్ధ్వజదత్త మథాఽబ్రవీత్

తా॥ ఇట్లు నిశ్చయించుకొని పిమ్మట ధ్వజదత్తునితో నిట్లనియెను.

శ్లో॥ అవిశ్వాసో మహానస్తి ద్విజ! తే గురుగోచరః

తా॥ ఓ ధ్వజదత్తమునీ! నీకు గురువు విషయములో మిక్కిలి సందేహము కలదు. నమ్మకము లేదు.

శ్లో॥ తస్మా ద్విలంబతే మంత్రం విధివ జ్జపతోఽపివా.

తా॥ కావున నీవు విధిప్రకారము కష్టించి శ్రద్ధతో జపించుచుండినను నీకు మంత్రము సిద్ధించుటకు ఆలస్యమగుచున్నయది.

శ్లో॥ మంత్రే తీర్థే ద్విజే దైవే దైవజ్ఞే భేషజే గురౌ
యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ.

తా॥ మంత్రమునందును, పుణ్యక్షేత్రమునందును, బ్రాహ్మణునియందును, దేవునియందును, జ్యోతిర్విదునియందును, వైద్యునియందును, గురువునందును ఎటువంటి అభిప్రాయము కలిగియుండునో; ఫలసిద్ధియును దాని ననుసరించియే యుండును కదా!

శ్లో॥ మంత్రే దైవేచ విశ్వాస స్తవాస్తి ద్విజసత్తమ!

తా॥ ఓద్విజదత్తా! నీకు మంత్రమునందు మిక్కిలి భక్తికలదు. దేవునియందును ఎక్కువభక్తికలదు. మంచి నమ్మక మున్నది.

శ్లో॥ కింతు నాస్తి తవ శ్రద్ధా గురౌ మంత్రోపదేష్టరి.

తా॥ అయితే మంత్రోపదేశమును చేసిన గురువునందు మాత్రము నీకు కొంచెమైనను భక్తిగాని నమ్మకముగాని శ్రద్ధ గాని లేదు.

శ్లో॥ దైవాద ప్యధికం మాన్యో గురు ర్మంత్రోపదేశకః.

తా॥ మంత్రోపదేశమును చేసిన గురువుగారియందు దైవముకంటెను మిక్కిలి యెక్కువ గౌరవముంచి పూజింప వలెను.

శ్లో॥ దైవస్వరూప మఖిలం బోధితం యేన చాత్మనః

తా॥ తనకు జ్ఞానోపదేశముచేసిన గురువు అన్నివిధము చేతను దైవముతో సమానుడు. పూజింపదగినవాడు.

శ్లో॥ గురువిశ్వాసమాహాత్మ్యా ద్గాలో నీచతరోఽపివా
ఇష్టసిద్ధి మవాప్యైవం భుంక్తే భోగాన్ యథేప్సితాన్

తా॥ గురువునందు మంచినమ్మకముగలవాఁడగుటవల్లనే, గాలుం డెట్టినీచుండయినను తనకోరికను నెరవేర్చుకొని స్వేచ్ఛగా సకలైశ్వర్యము లనుభవించుచున్నవాఁడు.

శ్లో॥ గురురేవ పరం దైవం గురో ర్నాన్యద్ధి కించన.

తా॥ గురువే పరమదైవము. గురువుకంటె మించిన మహామహిమగలపదార్థము వేఱొకటి లేదు.

శ్లో॥ గురుదైవతయో రైక్యభావా త్తరతి చేతనః

తా॥ లోకములో నెవ్వారైననుసరే గురువునకును దేవతకును భేదము లేదనియును. ఇద్దఱును నొక్కరేయనియును, తలంచుచుందురో; వారే యన్నికోరికలను ననుభవింతురు. ఇంతకంటె మిక్కిలి తేలికగాఁ దరించు సదుపాయ మింకొక్కటి లేదు.

శ్లో॥ గురుణోదీరితం వర్ణం వ్యర్థంవా సార్థమేవవా
తదేవ తారకం మంత్రి మితి వేదవిదో విదుః

తా॥ గురువుగారుచెప్పిన యక్షరము వ్యర్థమైనను, అర్థము లేనిదైనను, సార్థమయినను, మిక్కిలి యుపయోగము కలదైనను అదియే కష్టములనన్నింటిని నివారించును. సర్వశ్రేయములు కలిగించునని వేదవేత్తలు చెప్పుచుందురు.

శ్లో॥ త్వదర్థ మహ ముద్దిశ్య హనూమంత మభావయమ్

తా॥ నీ నిమిత్తమే నేను ఓధ్వజదత్తా! నామనస్సులో శ్రీహనుమత్స్వామివారిని సంభావనచేసినాను.

శ్లో॥ మా మనుగృహ్య కృపయా యథార్థకథనేన సః

తా॥ శ్రీహనుమత్ప్రభువువారు అనుగ్రహించి దయతో నున్నది యున్నట్లు తెలుసుకొనునట్లు చేసినారు.

శ్లో॥ ధ్వజదత్త ! భవానేవ సర్వశాస్త్రార్థకోవిదః
గురువిశ్వాస హీనత్వాత్ మంత్రసిద్ధిం నవిందతి.

తా॥ ఓధ్వజదత్తా ! నీవు అన్ని శాస్త్రములు తెలిసియున్న వాఁడ వనుటలో సందియము లేదు. నీకు గురువునందు నమ్మకము లేదు. ఆకారణముచేత నీకు నింతవఱకును మంత్రసిద్ధి కనఁబడ లేదు. నిశ్చయము.

శ్లో॥ గురు విశ్వాస పర్యంతం పురశ్చర్యావిధి ర్వృథా

తా॥ గురువుగారియందు నమ్మకము కలిగియుండునంత వఱకును నీవు చేయుచున్న జపముగాని, పురశ్చర్యావిధానము గాని యంతయును నిష్ఫలము.

శ్లో॥ మంత్ర దైవత మాహాత్మ్యం యస్మా ద్బోధయతి స్ఫుటమ్
తస్మా ద్గురు ర్మహాదైవ మిత్యావోచ త్కపీశ్వరః

తా॥ ప్రత్యక్షముగా, మంత్రమును దేవతను మాహాత్మ్యమును బాగుగా స్పష్టముగా బోధించుచుండుటచేతను, గురువు మహాదేవతవంటి వాఁడని శ్రీయాంజనేయస్వామివారు బోధించినారు.

శ్లో॥ త దిదానీం పున ర్విప్ర! గురువిశ్వాసపూర్వకమ్
ఇదమేవ మహామంత్రం జప నిశ్చలమానసః

తా॥ కావున నోధ్వజదత్తా! నీవిప్పుడు మంచిశ్రద్ధగలిగి గురువునందు మిక్కిలి యెక్కువ నమ్మకముంచి నిశ్చలమగు మనస్సుగలవాఁడవై యీ శ్రీహనుమన్మహామంత్రమునే తిరిగి జపము చేయుము.

శ్లో॥ తత స్సిద్ధ్యతి మంత్రం తే మాకురుష్వాఽత్రసంశయమ్

తా॥ పిమ్మట మంత్రము సిద్ధించును. ఫలము లభించును. ఈ విషయములో నీవెంతమాత్రమును సందేహించ నవసరము లేదు.

శ్లో॥ ఇత్యుక్తో గురుణా విప్రో హితవిశ్వాసపూర్వకమ్
ధ్వజదత్తః పునఃప్రాహ గురుం దైవతసన్నిభమ్

తా॥ అని శ్రీపుష్కర గురువరేణ్యుండు పల్కిన వెంటనే మంచి నమ్మకముతో నున్నవాఁడై, ధ్వజదత్తుండు శ్రీదేవతతో సమానుండగు పుష్కరునితో నిట్లు పలికెను

శ్లో॥ పాపోఽహం పాపకర్మాఽహం పాపాఽఽత్మా పాపసంభవః
అవిశ్వాసాబ్ధి మగ్నోఽహం తస్మా న్మా ముద్ధర ప్రభో!

తా॥ ఓ పుష్కర గురువరేణ్యా! నేను పాపిని, పాపపుఁ బనులు చేసినాను. పాపమగు మనస్సుగలవాఁడను. పాపములో నుండియే పుట్టినాను. అపనమ్మకము అను మహాసముద్రములో మునిగియున్న వాఁడను. ఆ సముద్రములోనుండి నన్నుఁ బైకి లేవఁదీయుము.

శ్లో॥ గురు విశ్వాస హీనస్య ప్రాయశ్చిత్తం వద ప్రభో!

తా॥ ఓ గురుస్వామీ! గురువుగారియందు నమ్మకము లేని నాకు ప్రాయశ్చిత్తమేమి? ఆ ప్రాయశ్చిత్త మార్గమును దెలుపుడు.

శ్లో॥ ప్రాయశ్చిత్త విహీనస్య నాస్తి కర్మాధికారితా

తా॥ ప్రాయశ్చిత్తము లేక తిరిగి కర్మ చేయుట కధికారము లేదుకదా.!

శ్లో॥ అధికారవిహీనస్య కృతం కర్మాఽపి నిష్ఫలమ్

తా॥ అధికారము లేనివాఁడు కష్టించి కర్మ చేసినను ఫలము కలుగదుకదా!

శ్లో॥ నహి శూద్రకృతో యాగః ఫలతీ త్యనుశుశ్రుమ

తా॥ శూద్రుండు జ్ఞానహీనుఁడు చేసిన యజ్ఞము ఫలింపదని వినుచుందుముకదా!

శ్లో॥ తస్మాత్పాపనోదాయ ప్రాయశ్చిత్తం సదూహ్యతామ్

తా॥ కావున నేను పాపమునుండి విముక్తుండ నగుటకు మంచి ప్రాయశ్చిత్తమును ఆలోచనముచేసి యొకటి సెలవిమ్ము.

శ్లో॥ దుర్లభం సులభంవాపి కరిష్యే నాఽత్ర సంశయః

తా॥ ఆ ప్రాయశ్చిత్తవిధానము కష్టమైనను తేలికయైనను తప్పక చేసికొనెదను. సంశయము లేదు.

శ్లో॥ ఏవం దృఢమతిం విప్ర మకృతార్థం దరిద్రకమ్
హనూమత్పాదతీర్థేన ప్రోక్షయామాస పుష్కరః.

తా॥ ఇట్లు దృఢమతియై వ్యర్థుండయియున్న యా దరిద్రుండగు ధ్వజదత్తునిమీఁద శ్రీ పుష్కర గురువరుండు శ్రీ హనుమత్ప్రభువువారి పాదతీర్థమును చల్లెను.

శ్లో॥ సంప్రోక్షణా న్నివృత్తశ్చ గుర్వవిశ్వాసకర్దమః

తా॥ ఇట్లు చల్లినవెంటనే గురువునందు నమ్మకము లేకపోవుట యను పాపమనెడి బురద వదలిపోయెను.

శ్లో॥ తతో గురుపదంభోజ జలేన స్నాన మాచరత్

తా॥ పిమ్మట గురువుగారియొక్క పాదకమలముల యందలి యుదకముచే స్నానముచేసెను.

శ్లో॥ ఇదమేవ మహానంత జన్మ సంపాదితైనసః
ప్రాయశ్చిత్త మితి వ్యక్త ముచ్చై రుచ్చారయన్ ద్విజః

తా॥ శ్రీ పుష్కరగురూత్తముఁడు ధ్వజదత్తునితో నిట్లు చెప్పెను. నీవు ఇదివఱలో నెన్నిజన్మములనుండియైనను చేసికొనిన పాపములు ఈ సంప్రోక్షణముచే నశించినవి. అని బిగ్గరగాఁ జెప్పెను.

శ్లో॥ అద్యప్రభృతి యోగ్యోఽయం సర్వకర్మ స్వితీరయన్
పాదసక్తమృదా తస్య చక్రే స్వస్యోర్ధ్వపుండ్రకమ్

తా॥ ఇదిమొదలు నీవు అన్నికర్మములు చేసికొనుటకు మిక్కిలి యర్హుఁడవనియును జెప్పుచున్నవాఁడై తనపాదముల యందలి మృత్తికను ధ్వజదత్తుని ముఖమునందు నిలువుగాఁ బొట్టువలె నుంచెను.

శ్లో॥ తతో విప్రో గురుం నత్వా జప్తుం తేన ప్రబోధితః
కార్యసిద్ధిం సముద్దిశ్య పుణ్యతీర్థ ముపాగమత్

తా॥ పిమ్మట ధ్వజదత్తుఁడు గురునకు నమస్కరించి గురువు మంత్రమును జపముచేయుమని ప్రబోధింపఁగానే కార్యము సిద్ధించుటను గుఱించి యుద్దేశించుకొని పుణ్యసరస్సునకు వెళ్ళెను.

శ్లో॥ ఆచమ్య విధివత్తత్ర ధ్యాత్వా గురుపదాంబుజమ్
సమభావనయా యుక్తో గురుదైవతయో ర్ద్వయోః

తా॥ వెళ్లి విధిప్రకారము ఆచమనముచేసి, గురువుగారి యొక్క పాదపద్మములకుఁ బ్రణమిల్లి, గురువుగారిని మంత్రదేవత

యగు శ్రీయాంజనేయస్వామివారిని ఇద్దఱిని సమముగా మనస్సున నిడికొని,

శ్లో॥ అష్టోత్తరశతం భూయో జజాప ద్వాదశాక్షరీమ్

తా॥ తిరిగి శ్రీహనుమన్మహామంత్రమును ద్వాదశాక్షరీయను పేరుగలదానిని యథావిధిగా నూటయెనిమిదిపర్యాయములు జపించెను.

శ్లో॥ సిద్ధప్రాయే మహామంత్రే జప్తమాత్రే మహాత్మనా
ఆయాస మంతరేణైవ సిద్ధిస్తస్య వ్యజాయత.

తా॥ ఆ మహాత్ముండు ధ్వజదత్తుండు సంసిద్ధముగానుండు మహామంత్రమును జపించుచున్నంతమాత్రముచేతనే ఏమియును ఆయాసము లేకయే అతనికి మంత్రము సిద్ధించినది.

శ్లో॥ తతో జపంత మవ్యగ్రం పుష్కరచ్ఛాత్ర ముత్తమమ్
సువర్చలాపతి శ్రీమాన్ కర్తుంవై విప్ర వీక్షణమ్

తా॥ పిమ్మట నిట్లు మిక్కిలి మహానియమముతో జపమును పుష్కరశిష్యుండగు ధ్వజదత్తుండు చేయుచుండగానే సువర్చలాదేవిప్రాణేశ్వరుండగు శ్రీ హనుమత్ప్రభువువారు ధ్వజదత్తునిఁ జూడవలెనను కోరికతో

శ్లో॥ అంగదాదీ న్మహాభక్తా నవాదీత్కపినాయకః

తా॥ అంగదుండు మొదలగు మహాభక్తులనుజూచి వానరసార్వభౌముం డిట్లు పలికెను.

శ్లో॥ సజ్జం భవంతః కుర్వన్తు వాహనం గమనాయ మే
యత్రాఽస్తే పుష్కరాభ్యాశే ధ్వజదత్తో మహామతిః

తా॥ ఓ వానరులారా! పుష్కర గురు నివాసమునందు ధ్వజదత్తుండు జపము చేయుచున్నవాఁడు. మీరందఱును నక్క-

డికి వెళ్ళుటకు సిద్ధముగానుండుడు. నేనువచ్చుటకుఁ గూడ నా వాహనము సంసిద్ధమును చేయుఁడు.

శ్లో॥ తపశ్చరన్ మహాఘోరం పుణ్యతీర్థజలాంతరే
సిద్ధిం నావిందతాఽద్యాపి సదేశోగమ్యతామితి.

తా॥ అతండు మిక్కిలి ఘోరతపమును జేయుచున్న వాఁడు. పుణ్యసరోవరమునందు రేవునందు జపించుచు నింతవఱకును ఫలసిద్ధిని గాంచినవాఁడు కాఁడు. మనమందరమును నాతని యొద్దకు వెళ్ళవలయును. అని యాజ్ఞాపించెను.

శ్లో॥ భర్తు రాజ్ఞావచ శ్శ్రుత్వా సర్వే ప్రీతి మవాప్నువన్

తా॥ ఇట్లు శ్రీహనుమంతుల వా రాజ్ఞ యిచ్చిన వార్తను విని యా వానరులందఱును సంతోషించినారు.

శ్లో॥ నవరత్నాంచితా కార సింహాసన సమన్వితమ్
ఉష్ట్రం హేమాద్రిసంకాశం నిన్యుః పరిజనా జవాత్

తా॥ పిమ్మట వారు మేరుపర్వతమువలె మిక్కిలి పచ్చని మేల్మి పసిండి మిసిమిపచ్చని చాయగల యొంటెమీఁద నవరత్నముల చేత నింపియున్న సింహాసనమును నమర్చి, సేవకులందఱును వెంటనే స్వామివారి సన్నిధికిఁ దీసికొనివచ్చినారు.

శ్లో॥ ఆనీత మద్భుతాకార ముష్ట్రం వాయుజవాన్వితమ్
నీలదత్తకరాలంబో హనుమా నారురోహ తమ్

తా॥ ఇట్లు తీసికొనిరాఁగా శ్రీయాంజనేయస్వామివారు వాయువేగముకంటె మిక్కిలి వేగము కలిగి, చూచుటకు మిక్కిలి చిత్రముగానుండు నొంటెమీఁద నీలుని చేయిపట్టుకొని యెక్కినారు.

శ్లో॥ మృగేంద్రఇవ శైలేంద్ర మింద్ర ఐరావతంయథా
హరి ర్యథా గరుత్మంతం వృషం వృషభ కేతనః

తా॥ పర్వతోత్తమముమీద నెక్కిన సింహామువలెను, వతమను గజోత్తమమునెక్కిన దేవేంద్రుండువలెను, గరుత్మంతునిమీదనెక్కిన విష్ణుమూర్తివలెను, వృషభముమీద నెక్కిన సాంబమూర్తివలెను,

శ్లో॥ వాహనోత్తమ మారుహ్య హనుమా న్మారుతాత్మజః
చిత్రావసుకృతస్తోత్ర సేనాంగద పురస్సరః

తా॥ వాయువుదేవుని కుమారుండగు శ్రీహనుమంతుండు ఉష్ట్రవాహానముమీదనెక్కి, అంగదుండు ముందునడచుచుండఁగా చిత్రావసువులు స్తోత్రములు చేయుచుండఁగా,

శ్లో॥ జగామ నిజవామాంక దీప్యమానసువర్చలః

తా॥ తమ యెడమ పార్శ్వమునందు సువర్చలాదేవి ప్రకాశించుచుండఁగా ధ్వజదత్తుని దగ్గరకుఁ బయనమై.

శ్లో॥ అథ గురుపదపద్మభక్తియోగాత్
కృతనిజమంత్రఫలే ఫలోన్ముఖేచ
ద్విజవర వర దాన సంభ్రమోఽగాత్
నిజపరివారయుతో గతో హనూమాన్.

తా॥ పిమ్మట గురువుగారియొక్క పాదపద్మములయందు మిక్కిలి భక్తిగలిగియుండుటవల్లనున్ను, తన మంత్రమును మిక్కిలి భక్తిశ్రద్ధలతో జపముచేసిచేసి ఫలముపొందుటకై సంసిద్ధముగా నుండినట్టి యుద్దేశము కలవాఁడౌటవల్లనున్ను, అట్టిభక్తునికి దప్పక వరమీయదలంచి మిక్కిలి వేగముతో నిజపరివారమును

వెంబడినుంచుకొని నడచుచు శ్రీహనుమంతుఁడు భక్తుని దగ్గఱకు వెళ్ళెను.

శ్లో॥ కరభ కలభ సంనిరీక్షణాచ్చ
జయనినదశ్రవణాచ్చ మాగధానాం
హనుమ దభిఖ్య జయధ్వజాగ్రా
త్పరిబుబుధే నిజదైవతం ద్విజేంద్రః.

తా॥ ఒంటెవాహనమును చూచుచుండుటవల్లను, స్తోత్రపాఠకులు స్తుతులు చేయుచుండుటవల్లను, శ్రీహనుమంతుని జయమును దెలుపు జండాచివర కనుపించుచుండుటవల్లను, ధ్వజదత్తుండు శ్రీహనుమత్ప్రభువారు ప్రత్యక్షమైరని తెలిసికొనెను.

మైత్రేయః—

శ్లో॥ తతః కిమకరోత్ ? ద్విప్రః నిశ్చిత్యాశు స్వదైవతమ్
ఆఖ్యాహి తన్మహాభాగ! పరాశర ! కృపాంబుధే !

తా॥ ఓ మహానుభావా ! పరాశరమునీంద్రా ! ధ్వజదత్తుండు శ్రీ హనుమంతుని గుర్తించి యేమిచేసెనో; చెప్పవలయునని మైత్రేయుండు పరాశరముని నడిగినాఁడు.

శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా మహాయోగీ పరాశరః
తత్కథాశ్రవణే వ్యగ్రం మైత్రేయ మిద మబ్రవీత్

తా॥ మహాయోగీంద్రుండగు పరాశరమునీంద్రుండు మైత్రేయుని ప్రశ్న విని యాకథ వినుటకు మిక్కిలి సంతోషముతో నుండిన మైత్రేయునితో నిట్లనెను.

శ్లో॥ మైత్రేయ! త్వం కృతార్థోసి యత స్తే ధార్మికీ మతిః
హనూమద్భక్తివిషయే నాలం బుద్ధింతు విందసి.

తా॥ ఓ మైత్త్రేయా! నీమతి ధర్మమునందే నిలిచి యుం డుటవల్ల నీవు మిక్కిలి కృతార్థుండవు. శ్రీ హనుమద్భక్తి విషయ ములో నీకుంగల యుత్సాహమునకుం బరిమితియే లేదు.

శ్లో॥ అనంతరంతు వృత్తాంతం ధ్వజదత్తస్య ధీమతః
మైత్త్రేయ! తే ప్రవక్ష్యామి సావధానమనా శృణు.

తా॥ ధీమంతుఁడగు ధ్వజదత్తునియొక్క తరువాత జరిగిన వృత్తాంతమును చెప్పెదను. ఓ మైత్త్రేయా! సావధాన మనస్సు కలవాఁడవై వినుము.

శ్లో॥ తతః ప్రేక్ష్య హనూమంతం వరదానార్థ మాగతమ్
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పూజయామాస వై ద్విజః

తా॥ పిమ్మట ధ్వజదత్తుండు తనకు వరమిచ్చుటకై వచ్చి యున్నవానినిగా శ్రీ హనుమంతునియొక్క ప్రసన్నరూపమున జూచి తెలిసికొని, యెదురుగా నేగి, నమస్కరించి పూజించెను.

శ్లో॥ నిజదైవ మువాచేదం ప్రాంజలి ర్ద్విజసత్తమః

తా॥ పిమ్మట స్వామివారికి నమస్కరించి దోసిలిధరించి యిట్లు చెప్పెను.

శ్లో॥ ఇదమర్ఘ్య మిదం పాద్యం పూజార్థం కుసుమాన్యపి
ఫలా నిమాని గృహ్ణీష్వ భక్తానుగ్రహతత్పర!

తా॥ ఇదిగో అర్ఘ్యము. ఇదిగో పాద్యము. ఇవిగో పూవులు. ఇవిగో పండ్లు. భక్తదయాపరా! వీనిని గైకొనుము స్వామీ! మీ పూజకొఱకు ఇవియన్నియును తెచ్చితిని. స్వీ కరింపుము.

శ్లో॥ పత్త్రం పుష్పం ఫలం తోయం య స్తే భక్త్యా ప్రయచ్ఛతి
సిద్ధ్యంతి తస్య కార్యాణి శ్రేయః పరంచ విందతి

తా॥ ఆకుగాని, పూవుగాని, పండుగాని, నీరుగాని, నీకు మంచిభక్తితో సమర్పించిన వారియొక్క కార్యములన్నియును సఫలంబులగును. పిమ్మట మంచి శ్రేయస్సుకలుగును.

శ్లో॥ తదత్ర గృహ్యతాం స్వామిన్! జల పుష్ప ఫలాదికమ్
భక్త్యా సమర్పితం తాత ! మదనుగ్రహకాంక్షయా

తా॥ ఓస్వామీ ! ఓతండ్రీ! జలము, పుష్పములు, పండ్లు మొదలగునవి భక్తితో సమర్పించుకొనుచున్నాను. నాయందు అనుగ్రహముకలిగి స్వీకరింపుము.

శ్లో॥ ఇత్యేవం ప్రార్థితో భక్త్యా హనూమా న్మారుతాత్మజః
విప్రోపహారం హస్తేన స్పృష్టవాన్ సాదరం హసన్

తా॥ ఇట్లు భక్తితో మిక్కిలి ప్రార్థించుచుండఁగా హనుమత్ప్రభువువారు ఆదరముకలవారై చిఱునవ్వునవ్వుచుఁ దన చేతితో విప్రుం డొసంగిన ఫలాహారములను స్వీకరించెను.

శ్లో॥ ద్విజ స్సంతుష్టచిత్తస్సన్ ఉపహారపరిగ్రహాత్
యథామతి యథాన్యాయ్యం తుష్టావ ప్రయతాంజలిః

తా॥ తానొసంగిన ఫలములు పువ్వులు జలము పత్రములు స్వీకరించుచుండుటచేత ద్విజదత్తుండు మిక్కిలి సంతోషించినవాఁడై దోసిలిధరించి తనశక్తికొలంది న్యాయ్యానుసారముగా స్తోత్రముచేసి తృప్తిపఱచెను.

శ్లో॥ వేదవేద్య! మహాభాగ ! పురాణపురుషోత్తమ !
తవ సందర్శనేనైవ దురితం మే నివర్త్యతామ్

తా॥ వేదములలోనున్న శక్తిసామర్థ్యములచేఁ దెలిసికొనదగియుండువాఁడా ! మహాసంపదలు కలుగువాఁడా ! పురాణ

పురుషోత్తమా ! తిమ దర్శనభాగ్యమువల్ల నా పాతకము లన్ని యును నశించినవి.

శ్లో॥ తవ సందర్శనాదేవ యోగినామపి దుర్లభమ్
బహుజన్మార్జితా త్పుణ్యా ల్లబ్ధవా నస్మి సాంప్రితమ్

తా॥ అనేకజన్మములనుండి సంపాదించుకొనిన పుణ్య ములయొక్క విశేషములవల్ల నేయ్యే దుర్లభమగు ఫలము కల గునో; యిప్పుడు తమదర్శనమువల్లనే యోగీశ్వరులకును సాధ్య ముకాని పదమును పొందినాను.

శ్లో॥ బ్రహ్మాదయ స్సురా స్సర్వే కాంక్షంతే యస్య దర్శనమ్
నిజహస్తాంబుజై ర్నిత్యం పూజయంతి పదద్వయమ్

తా॥ బ్రహ్మదేవుండు మొదలగు మహాదేవతలుకూడ నిత్యము నీయొక్క దర్శనమునే కోరుచుందురు. నీపాదకమలము లను తమ హస్తకమలములచే స్వయముగా నియమములతో బూజించుచుందురు.

శ్లో॥ గుర్వనుగ్రహ మాహాత్మ్యాత్ స త్వం సాక్షాత్కృతో మయా

తా॥ గురువుగారియొక్క యనుగ్రహముయొక్క మాహా త్మ్యమువల్ల నాకుం బ్రత్యక్షమయి యున్నారు.

శ్లో॥ తదస్య దుర్లభం ప్రాప్తం మద్భాగ్యం కేన గణ్యతే?

తా॥ కావున నాయొక్క యీ దుర్లభమగు భాగ్యవిశే షము నెవ్వరును వర్ణింపలేరు.

శ్లో॥ సర్వవేదశిరోభి స్త్వం భగవా న్భూతభావనః
స్తోతుం నశక్యసే దేవ! కియా న్స్తోతు మహం? ప్రభో!

తా॥ సకలములగు వేదములలో ముఖ్యమగు వేదాంత ములనంబడు ఉపనిషత్తులతో సృష్టికర్తయగు బ్రహ్మచేం గూడ

సర్వ జంతుస్వరూపుఁడవగు నీ మాహాత్మ్యము కొనియాడుటకు శక్యముకాదు. ఓస్వామీ! అల్పుండనగు నేను నిన్నుగాని నీ మహిమములనుకాని కొనియాడుట కెంతమాత్రమును శక్తుం డను గాను.

శ్లో॥ యస్య స్వరూప మజ్ఞాత్వా తత్త్వత స్సచరాచరం
జగద్భ్రమతి సంసారచక్రే నక్రాయతే నృణామ్

తా॥ ఓమహానుభావా! యాంజనేయస్వామీ! ఈ లోక మంతయును స్థావరములును జంగములును కలసి యావత్తు ప్రపంచకమును నీ స్వరూపమును దెలిసికొనలేక సంసారచక్ర ములో మొసలివలె మనుష్యులు అందఱును తిరుగాడుచున్నారు. నేను ఎంతటివాఁడను. నీ మహిమను దెలిసికొనుటకు నా కెంత మాత్రమును శక్తి లేదు.

శ్లో॥ కిమన్య దధికం మన్యేఽత్వత్పాదాంబుజసేవనాత్

తా॥ ఓ స్వామీ, తమయొక్క పాదకమలములు సేవిం చుటకంటె నెక్కువైనదింక వేఱేమియును లేదు.

శ్లో॥ అతస్తదేవ మే భూయా జ్జన్మజన్మాంతరేష్వపి

తా॥ కావునఁ దమ పాదకమల సేవయే యికముందు నే యేజన్మములు లభించినను నిరంతరము కలుగునట్లు దయచేసి వరమిమ్ము.

శ్లో॥ అపవర్గనిదానం య ద్దర్శనం భవతః పుమాన్
వినియుంక్తే భవే నీచే స నీచః పరమో మతః

తా॥ మోక్షము కలుగుటకుఁ గూడ ముఖ్యకారణమగు తమ దర్శనమును నీచమగు సంసార సుఖము లొసంగుదానినిగాఁ

దలంచుచుండువాఁడు మిక్కిలి నీచుండని నాయభిప్రాయము. నిశ్చయము.

శ్లో॥ త్వన్నామ స్మరణేనైవ మహాపాతకరాశయః
నశ్యంతి తత్క్షణాదేవ తూలభార ఇవాగ్నినా.

తా॥ తమ దర్శనముచేతనే కాకుండా, మీనామమును స్మరించుచుండుటచేతనే మహాపాతకములయొక్క సముదాయములు దూదిరాశి నిప్పురవచేతనువలె వెంటనే పటాపంచలై నశించిపోవును.

శ్లో॥ ప్రసీద జగతాంనాథ! దీనబంధో! దయానిధే!

తా॥ఓ జగత్తులకన్నింటికిని దేవుండవగుస్వామీ! దీనులను సంరక్షించుచుండువాఁడా! దయాసముద్రుఁడా! అనుగ్రహింపుము.

శ్లో॥ శిశుభావా త్కృతం యద్య త్తదాగః క్షంతు మర్హసి.

తా॥ చిన్నతనపుఁ జేష్టలవల్లనే యేపాపముగాని లోపముగాని చేసినానో; యవియన్నియుఁను సహింపుము.

శ్లో॥ త్వా మామనంతి శ్రుతయో జగతా మాదికారణమ్
త్వామేవ సృష్టికర్తారం పురుషం ప్రకృతేః పరమ్

తా॥ ఓ మహాత్మా! వేదములన్నియుఁను నిన్నే జగత్తులకన్నింటికిని మూలకారణమునుగాఁ దలంచుచున్నయవి. నిన్నే యీలోకముల నన్నింటిని సృష్టించుచుండువానినిగాఁ జెప్పుచున్నయవి. ప్రకృతికంటెను ముఖ్యమగు పురుషునిఁగా నిన్నే చెప్పుచున్నవి.

శ్లో॥ ఆనందాంబుధి మగ్నోఽహం విస్మృతాన్య ప్రయోజనః

తా॥ ఓస్వామీ! నేను ఇతరవిషయముల నన్నింటిని మఱచిపోయినాను. తమదర్శనము కలిగియున్నదనే గొప్పసంతోషముతో నిండియున్నాను.

శ్లో॥ కింకార్యం? కరవా ణ్యద్య హనుమన్నుచ్యతాం ప్రభో!

తా॥ ఓస్వామీ! తమకు ఏపనిచేయవలయునో సెలవిండు. ఆపని భారమైనదైనను తప్పక చేసెదను.

శ్లో॥ అద్య మే పితర స్సర్వే పరాంగతి మవాప్నువన్

తా॥ ఇప్పుడు తమసందర్శనము కలిగినందున మాపితృదేవతలందఱును మిక్కిలి దుర్లభమగు సుఖమును పొందుదురు.

శ్లో॥ వ్రతాని ఫలితా న్యద్య ఫలితా బ్రాహ్మణాశిషః

తా॥ నేను పూర్వము చేసికొనిన వ్రతములు నియమములు, దీక్షలన్నియును ఫలించినవి. బ్రాహ్మణులు మునులు పెద్దలు మొదలగువారి యాశీర్వచనములన్నియును ఫలించినవి.

శ్లో॥ ఫలితాశ్చ తపశ్చర్యా బహుజన్మార్జితా అపి

తా॥ నేను చాలా జన్మములనుండియును, చేసికొనిన తపశ్చర్యలన్నియును నేడు ఫలించినవి.

శ్లో॥ గంగాది సర్వతీర్థాని ఫలితా న్యద్య మే ప్రభో!

తా॥ గంగ మొదలగు సకల పుణ్యనదులును వానిని సందర్శించినందువల్ల ఫలములు అన్నియును సిద్ధించినవి.

శ్లో॥ అద్య మే సఫలం జన్మ జీవితంచ సుజీవితమ్

తా॥ ఇప్పుడు తమపాద సందర్శనమువల్ల నా జన్మము సఫలమైనది. నాయొక్క జీవితముకూడ మంచిజీవితమైనది.

శ్లో॥ గతా న్యహాని సర్వాణి దుర్దినానీతి మే మతిః

తా॥ గడచిన రోజులన్నియును నీ స్మరణములు లేకయే యున్నందున దుర్దినములని తలంచుచున్నాను.

శ్లో॥ య స్త్వం సాక్షాత్కృతో దేవో బ్రహ్మాద్యైరపి దుర్లభః

తా॥ నీవు బ్రహ్మాది దేవతలకుఁగూడ దర్శనము నీయని వాఁడవు. ఇట్టి సందర్శన భాగ్యములను నాకుఁ బ్రత్యక్షమై లభింపఁజేసినావు.

శ్లో॥ ప్రమాదా దథవా లోభా త్ప్రేయసీ దైన్యదర్శనాత్
శైశవాద్వా మయా పూర్వం కాంక్షితా స్సర్వసంపదః

తా॥ పొరబాటుననో, లోభమువలననో, భార్యయొక్క దైన్యమును చూచుటవల్లనో, చిన్నదనపుఁ జేష్టలవలననో నేను ఇదివఱలో సర్వసంపదలు కావలయు నను గోరికకలవాఁడనై యుండెడివాఁడను.

శ్లో॥ అధునాతు న తాః కాంక్షే దుఃఖభూతాహి సంపదః

తా॥ ఇప్పుడు మాత్రము ఆసంపదలు కావలయునని నేను కోరను. సకలసంపదలును దుఃఖమును కలిగించునవియేకాని యెంతమాత్రమును సుఖమును కలిగింపలేవు.

శ్లో॥ దేవ! త్వాం ప్రణిపత్య నమ్రశిరసా
యాచే వరం సాంప్రతమ్
భావస్తే పదపంకజే భవతు మే
భక్తిః పరా శాశ్వతీ.

తా॥ ఓ స్వామీ! నీకు శిరస్సు వంచి నమస్కారము చేసి ఇప్పుడు నేను నిన్నుఁ గోరుచున్నాను. నా భావము

ఎల్లప్పుడు నీ పాదకమలములయందే యుండుఁ గాక. మిక్కిలి ముఖ్యమగు నీ పాదభక్తి శాశ్వతముగాఁ గలిగియుండు గాక.

శ్లో॥ త్వద్భావ స్తవభక్తజాలవిషయే
భూయా త్సదేకాశ్రియే
స్యాంతే కాంక్షితమేతదేవ
హనుమ న్నత్వాం పరం ప్రార్థయే

తా॥ ఓ స్వామీ! నీ భావ మెల్లప్పుడును భక్తుల సమూహములయొక్క కోరికలు నెరవేర్చుటయందే యెల్లప్పుడు నివాసస్థానమై యుండుఁ గాక. ఓ హనుమన్మహాదేవా! నా మనస్సులో నున్న కోరిక యిదియే యింతకంటె నింక మఱియొక కోరికను నేను కోరను.

శ్లో॥ ఇత్యేవం ధ్వజదత్తేన ప్రార్థితో భక్తవత్సలః
సువర్చలాముఖం ప్రేక్ష్య జహాస పవనాత్మజః

తా॥ ఇట్లు ధ్వజదత్తుండు కోరుకొనఁగానే భక్తవత్సలుండగు శ్రీ యాంజనేయ స్వామివారు సువర్చలాదేవియొక్క ముఖమును చూచి చిఱునవ్వు నవ్వినారు.

శ్లో॥ సువర్చలే పశ్య నితాంతవల్లభే
గురుప్రసాదా న్మతిమాంశ్చ తాపసః
మద్భక్త భక్తిం నిరపాయనిర్మలాం
పృథగ్జనై ర్దుర్లభనామధేయాం.

తా॥ ఓసువర్చలాదేవీ! ఎల్లప్పుడును నాచెంతనేయుండు నట్టి ప్రియురాలా! చూడుము. ఇతఁడు గురువుగారియొక్క అనుగ్రహమువలన మిక్కిలి బుద్ధిగల మునీంద్రుండయినాఁడు.

అపాయము లేనట్టియును స్వచ్ఛమైనట్టియును ఇతరుల కెవ్వరికిని లేనట్టిదియును మిక్కిలి దుర్లభమగుభక్తిని నాయందుదుమిక్కిలి కలిగియున్నవాఁడు.

శ్లో॥ అహంతు సర్వలోకస్య పూజ్యో భాస్కరనందిని !
మద్భక్తో మమపూజ్యస్స్యా దయం పూజ్యతరఃప్రియే !

తా॥ సూర్యుని ముద్దుపట్టివగు ఓ ప్రియురాలా ! సువర్చలాదేవీ ! నన్ను లోకములన్నియును పూజించుచుండును. నేనో నాయొక్కభక్తుని మనస్సాక్షిగా బూజించుచుందును. ఈ ధ్వజదత్తుండు అందఱికంటెను నాకు మిక్కిలి పూజింపఁ దగిన భక్తుండయినాఁడు.

శ్లో॥ సద్వంశో నిరహంకారో జితామర్షో జితస్పృహః
బహుశ్రుతో మహాయోగీ తస్మాత్పూజ్యతరో మమ

తా॥ మంచివంశములోఁ బుట్టినవాఁడు, అహంకారము లేనివాఁడు, కోపమును జయించినాఁడు వాంఛలను విడిచినాఁడు, అనేక వేదశాస్త్రములు చదివినవాఁడు మహాయోగప్రభావము గలవాఁడు, ఇట్టి వనేక సద్గుణములు కలవాఁడు కావున నితనిని నేను మిక్కిలిగౌరవించి పూజచేయవలసియున్నది.

శ్లో॥ జితేంద్రియో జితస్వాపో జితద్వంద్వో జితశ్రమః
ఆధ్యాత్మవిద్యానిరత స్సర్వభూతదయాపరః

తా॥ పంచేంద్రియములను లోఁబరుచుకొనినవాఁడు, నిద్రను స్వాధీనముచేసికొనినవాఁడు, ద్వైధీభావము లేనివాఁడు, భేదాభిప్రాయము లేనివాఁడు, శ్రమను లోఁబరుచుకొనినవాఁడు, ఆయాసమును లెక్కచేయఁడు. ఆత్మయననేమో పరమాత్మయన

నేమో యను విద్యను విమర్శించుకొనుటయందు మిక్కిలి ఆసక్తి గలవాఁడు, సకలప్రాణులయందును దయకలవాఁడు.

శ్లో॥ ఆత్మప్రశంసావిముఖ స్సుముఖో మత్కథాశ్రుతౌ
పరనిందావిహీనస్య పంచయజ్ఞపరస్సదా.

తా॥ తనకుతాను బాగడుకొనుచుండువాఁడు కాఁడు. నాకథలు వినుటయందు మిక్కిలి సంతోషము కలిగియుండువాఁడు. ఇతరులను నోటమాత్రమును నిందించువాఁడును కాఁడు. బ్రహ్మయజ్ఞము మొదలగు పంచయజ్ఞములు ప్రతినిత్యమును చేసికొనుచుండువాఁడు.

శ్లో॥ ధ్వజదత్తో ద్విజశ్రేష్ఠ స్తస్మాత్పూజ్యతరో మమ.

తా॥ ధ్వజదత్తుండు అను నతఁడు బ్రాహ్మణశ్రేష్ఠులందరిలోను మిక్కిలి ఉత్తముఁడు. కావున నేను ఎల్లప్పుడును మిక్కిలి పూజింపఁదగియున్న వాఁడు.

శ్లో॥ దుశ్చరంహి తపస్తప్తమనేన శాంతవర్త్మనా
తస్య శ్రమాపనోదాయ త్వయాసహ సమభ్యగామ్

తా॥ చేయుటకు శక్యముగాని తపమును చేసినాఁడు. ఆతఁడు ఎంతయును దీక్షవహించి ఆయాసమును లెక్కచేయక మిక్కిలి నిష్ఠతో జపించినాఁడు. కావుననే యతని యాయాసము పోగొట్టుటకే నీతోఁగూడఁ గలసి మెలసి యిచ్చుటికి వచ్చినాము.

శ్లో॥ ప్రచలేదపి మేరుర్వా నేదీయాన్ భాస్కరోపివా
మద్భక్తస్య పరిశ్రాంతిం నదృశ్యేహం కదాచన.

తా॥ మేరువు మిక్కిలి కదలిపోయి సంచలించుచుండినను సూర్యుండు భయపడి కేకలు వేయుచుండినను నేనొక్కప్పుడును నాభక్తుని యొక్క యాయాసము ఎప్పుడైనను నేను జూడలేను.

శ్లో॥ మమావజ్ఞాంచ దుస్సోఢాం వియోగంవా సహే తవ
మద్భక్తవిషయే దైన్యం కదాచిదపి నోత్సహే.

తా॥ నన్ను ఎవ్వరైనను ఎన్నిరీతులచే నన్ను నిందించినను సహించియుందును. సహింపరాని నీవియోగమునైనను సహించి యుందునుకాని యొక్కప్పుడును నాభక్తుడగువాడు దీనత్వమును పొందియుండుటకెంతమాత్రమును నేను సహింపజాలను.

శ్లో॥ సత్యం బ్రవీమి సుశ్రోణి శృణుష్వానన్యమానసా
మద్భక్తస్యావమానంతు హృది శల్యాయతే మమ.

తా॥ ఓసువర్చలా! నేను యథార్థమును జెప్పెదను నిశ్చల మనస్సుకలదానవై వినుము. లోకములో నెవ్వరివల్లనైనను నాభక్తునకు నవమానము కలిగినయెడల నా హృదయములో శల్యముంవలె మిక్కిలి బాధను కలిగించును.

శ్లో॥ ఇత్యుక్తవంతం నిజనర్మవల్లభమ్
సువర్చలా ప్రాహ శుచిస్మితా సతీ
జిజ్ఞాసమానా ధ్వజదత్తవైభవమ్
పికస్వరా భాస్వరహేమభూషణా.

తా॥ ఇట్లు చెప్పుచున్నట్టియును తనకు భర్తయైనటువంటి శ్రీ యాంజనేయస్వామివారితో మిక్కిలి ప్రకాశించుచున్న బంగరునగలు కలదై, పికస్వరముకలదై చిఱునవ్వు నవ్వుచు

బతివ్రతయును యోగ్యురాలునగు సువర్చలామహాదేవి ధ్వజ దత్తుని వైభవమును తెలిసికొనఁగోరి యిట్లుపలికెను.

శ్లో॥ కథంను తప్తం కథయస్వ తేన త
త్పరిశ్రమో భక్తజనేన దుర్లభః
అయంతు తే భక్తఇతీరితం పురా
విరుద్ధ్యతే పూర్వమిదం పరంప్రభో!

తా॥ ఓస్వామీ! ధ్వజదత్తుండెట్లు తపముచేసినాడు? ఆతనితపమునందలి ప్రయాస మితరులకెట్లు దుర్లభము. ఇతఁడు మీభక్తుండని చెప్పితిరి. పూర్వపు చరిత్రమునకును ఇప్పటి చరిత్రమునకును చాల భేదము కనిపించు చున్నదికదా! ఈవిష యము సవిస్తరముగా సెలవిండు.

శ్లో॥ ఇతీవ సందేహపరం ప్రియావచో
నిశమ్య భర్తా ధ్వజదత్తసన్నిధౌ
ప్రచక్రమే వక్తు మసంశయం వచ
స్సుధారసస్యంది పదేపదే పునః

తా॥ ఇట్లు మిక్కిలి సంశయముతోనిండియున్న తన ప్రియురాలు అడిగిన ప్రశ్నమును విని శ్రీహనుమత్ప్రభువువారు ధ్వజదత్తునిదగ్గఱనే శంకయొక్కింతయును కలుగకుండునట్లును ప్రతిమాటయందును అమృతమును చిలుకరించునట్టియును మంచిరుచికలుగునటువంటి పలుకును పలికెను.

శ్లో॥ ధ్వజదత్తస్య వృత్తాంతం వదేయం తవ సువ్రతే
యస్య శ్రవణమాత్రేణ నశ్యేత్సందేహ ఈదృశః

తా॥ ఓ మంచివ్రతములుకలదానా ! ధ
వృత్తాంతమును సవిస్తరముగాఁ జెప్పెదను వినువ
తమును వినినయెడల నిక నిట్టి సందేహము కలు

శ్లో॥ అయం ప్రియే ! పూర్వభవేఽయముత్తమమ్
జపఞ్హి మంత్రం మమ సప్తవర్ణకమ్
ఫలస్పృహాలబ్ధవిలంబమత్సర
స్తత్యాజ నిందాం గురు మాచర త్పరః

తా॥ ఓప్రేయసీ ! ఇతండు పూర్వజన్మమ
యుత్తమమైనటువంటి సప్తాక్షరములు కలిగిన
మంత్రమును జపించుచున్నవాఁడై ఫలసిద్ధికిఁ గ
మును సహింపలేక ద్వేషబుద్ధికలవాఁడై గురువు
యెక్కువగా నా గురువుని నిందించుచు
విడిచిపెట్టెను.

శ్లో॥ పురాఽయం పురుషశ్రేష్ఠో ధర్మసారో మహానభూ
శ్రుతిస్మృతిపురాణజ్ఞః సర్వయోగాగమోత్తమ

తా॥ పూర్వ మితఁడు ధర్మసారుండను
మహాత్ముండు, వేదములు శాస్త్రములు పుర
యును దెలిసిన మహామహుండు సకలయోగవ
వాఁడు. సర్వధర్మములు నెఱింగినవాఁడు.

శ్లో॥ నిత్యకర్మపరో నిత్యం సదాచారేషు తత్పరః
స కదాచి ద్ద్విజశ్రేష్ఠ శ్శిష్యసంస్థై రనుద్రుతః

తా॥ ప్రతిరోజును నిత్యకర్మానుష్ఠాన
డువాఁడు సదాచారములయం దెంతయును

వాఁడు. అట్టి మహామహుండొకప్పుడు తన శిష్యులందఱును తన వెంట వచ్చుచుండఁగా

శ్లో॥ సమిత్పుష్ప ముపాహర్తుం ప్రవిష్ట ఉపగహ్వరమ్

తా॥ సమిధలును పూవులును దెచ్చుకొనుటకై వనములోఁబ్రవేశించెను.

శ్లో॥ తత్రాపశ్యద్ధర్మసారః భరతం క్షత్త్రియోత్తమమ్.

తా॥ ఆవనములో భరతుండును రాజవర్యుని ధర్మసారుండు చూచెను.

శ్లో॥ హనూమద్భక్త మత్యర్థం తృణీకృతజగత్త్రయమ్
వ్యగ్రం జపంత మత్యుచ్చై రవానుమత్సప్తవర్ణకమ్.

తా॥ అతఁడు హనుమద్భక్తుండు, మూఁడులోకములను లెక్కచేయువాఁడుకాడు. మిక్కిలి యెక్కువ జపముచేయుచుండువాఁడు. శ్రీ హనుమత్సప్తాక్షరమహామంత్రమును మిక్కిలి బిగ్గరగా ఉచ్చరించుచు జపముచేయుచున్నవాఁడు.

శ్లో॥ గురుదైవతమంత్రేషు సమవిశ్వాససంభవాత్
స్థిరీకృత్య నిజస్వాంతం ధ్యాయంతం నిజదైవతమ్

తా॥ గురువునందును దేవతయందును మంత్రమునందును సమానమగు నమ్మకముకలవాఁడు. తనమనస్సును స్థిరము చేసికొని తన మానసిక దైవము మిక్కిలి నిష్ఠతో సర్వకాలమును ధ్యానముచేయుచుండువాఁడు.

శ్లో॥ తంతు దృష్ట్వా మహాత్మానం సర్వే విస్మయమాగతాః.

తా॥ అటువంటి మహాత్ముని జూచి యందఱును ఆశ్చర్యమును పొందినారు.

శ్లో॥ తత్సమీపం శనైర్గత్వా ధర్మసార స్తమబ్రవీత్ .

తా॥ అంతలో ధర్మసారుండు నెమ్మదిగా భరతుని దగ్గఱకు వెళ్ళి యిట్లు పలికెను.

శ్లో॥ జప్యతే కిమిదం మంత్ర మనేన విధనాముసే!

తా॥ ఓ మునీంద్రా! నీవు ఏమంత్రమును జపించుచున్నావు? ఇట్టిస్వరూపముతో ఁ జేయు తప మెటువంటిదియని ధర్మసారుండు భరతునిగూర్చి యింకను ప్రశ్నించెను.

శ్లో॥ మంత్రింతూపాంశు జప్తవ్యమితి యోగవిదో విదుః

తా॥ యోగీశ్వరులు మంత్రమును రహస్యముగా జపింపవలెననియే చెప్పుదురు.

శ్లో॥ త్వామేవం భైరవస్వానై ర్మంత్రోచ్చారణ సంభవైః
త్రాసయన్ మహాసత్వాన్ కిమిదం జపసే స్వయమ్

తా॥ నీవు ఈరీతిగా పెద్దపెద్ద గొంతుకతో మంత్రమును ఉచ్చరించి యటువంటి మహాధ్వనులకు గొప్పగొప్ప జంతువులు కూడ భయపడి పారిపోవునట్లు స్వయముగా నిట్టి తపము చేయుచున్నావే యది యేమి చెప్పుము.

శ్లో॥ నశ్రుతోఽపి నవాదృష్ట ఈదృశో జపసంభ్రమః

తా॥ ఇటువంటి జపముయొక్క పద్ధతి ఇదివఱకెవ్వడును వినలేదు చూడలేదు.

శ్లో॥ ముద్రావా మాతృకాంన్యాస మంగన్యాసం పునః పునః

తా॥ ముద్రలుగాని మూలమంత్రములుగాని అంగన్యాసముగాని కరన్యాసముగాని మాటిమాటికి;

శ్లో॥ న్యాసహీనజపా న్మంత్రః నిష్ఫలః పరికీర్తితః

అంగన్యాస కరన్యాసములు లేకుండా చేసిన జపము నిష్ఫలమని పెద్దలు చెప్పుచుందురు.

శ్లో॥ కేనాయ ముపదిష్టస్తే మంత్రాభాసోంగవర్జితః

తా॥ మీకు ఈ అంగవిహీనమగు మంత్ర ముపదేశించినది యెవ్వరు?

శ్లో॥ ద్విపాత్పశు ర్నసందేహః సర్వకర్మబహిష్కృతః
త్వంచాపి తాదృశో మూఢో యోగ్యోఽయోగ్యో నబుధ్యసే.

తా॥ ఇట్లు తెలిసియును దెలియకయును చెప్పినగురువు గురువుకాడు. రెండుకాళ్ళుగల పశువువంటివాడు. అతడు ఏ కార్యములకును ఏకర్మలకును బనికిరాడు. ఇందుకు సందేహ మెంతమాత్రమును లేదు. నీవుకూడ మంచిచెడ్డలను గుర్తించువాడవుకావు. కావున నీవును మీగురువువలెనే మూఢుండవు అగుచున్నావు. కోన యోగ్యుడా అయోగ్యుడాయని దెలియలేవు.

శ్లో॥ ఆచార్యో వేదసంపన్నో విశుద్ధాత్మా జితేంద్రియః
విమత్సరః కృతజ్ఞశ్చ మంత్రాంగన్యాసకోవిదః

తా॥ గురువు, తాను చదివినది చెప్పినది ఆచరించువాడును, వేదములు నేర్చినవాడును, పరిశుభ్రమగు మనస్సు కలవాడును, ద్వేషములేనివాడును, భేదాభిప్రాయము లేనివాడును, చేసినమేలు జ్ఞాపకముంచుకొనువాడును, మంత్రమును మంత్రముయొక్క అంగములను మంత్రముయొక్క న్యాసములను తెలిసినవాడును, మిక్కిలి సమర్థుడును ఇంద్రియములనులోబరచుకొనియున్నవాడును,

శ్లో॥ ఆధ్యాత్మవిద్యానిరతో నిర్మాయో నిరహంకృతిః
జితక్రోధో జితస్వాపో మంత్రధ్యానపరాయణః

తా॥ మానసికతత్త్వమును ఆత్మమును జీవాత్మమును పరమాత్మమును వీనితత్త్వములను తెలిసినవాఁడును మాయ నెఱుంగనివాఁడును మాయనుచేయనివాఁడును అబద్ధము చెప్పని వాఁడును, అహంకారము లేనివాఁడును, నేను అనియును నీవు అనియును భేదభావ మొక్కింతయు నెఱుంగనివాఁడును కోప మును జయించినవాఁడును నిద్రను మానినవాఁడును మంత్ర మును సర్వకాలములందు ధ్యానముచేయుటయందు ఆసక్తికలిగి యుండువాఁడును అయియుండవలయును.

శ్లో॥ యస్తు నైవంవిధః కశ్చిత్ పశురేవ నసంశయః

తా॥ ఈపైనఁజెప్పిన సద్గుణములు లేనిగురువు నిశ్చయ ముగా రెండుకాళ్లుకలిగియుండు పశువుతో సమానుండు.

శ్లో॥ అథవా మునివేషేణ భవతా పురుషర్షభ !
మనోవినోదలాభాయ జపాభాసః యదీప్సితః

తా॥ అట్లుకాదేని ఓభరతా ! నీవు మునివేషము వేసు కొని మనోవినోదముకొఱకు జపము అని పేరుపెట్టుకొని నీకు ఇష్టమెట్లో

శ్లో॥ తథాశ్రమాతిరేకస్తే నిరాహారకృతో వృథా

తా॥ అట్లు సంచరించుచుంటివేని ఈ శ్రమపడియుండుట యును ఆహారము మానియుండుటయును అంతయును వ్యర్థము లగును.

శ్లో॥ అతిమాత్రకృశత్వేన నిరాహారోఽనుమీయసే
ఇహచాముత్రచాశ్రేయో మూఢోవా నేచ్ఛతి స్వయం

తా॥ నీవు మిక్కిలి క్షీణించియున్నావు ఈ నీరీతిని జూడగా నీవు తిండిమానినట్లు కనఁబడుచున్నాఁడవు ఇక్కడ సుఖము లేక పరమందు మేలుగాని దానిని మూఢుండైనను నెవ్వండును తనంతటఁదాను కోరుకొనండు.

శ్లో॥ ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే

తా॥ కారణమును లాభమును లేక, యే తెలివితక్కువ వాఁడుకూడఁ దాను పనికై పాటుపడడు.

శ్లో॥ ఇతిభిన్నోపి వాగ్వజ్రైః క్షత్రియో ద్విజజన్మనః
న చ కంపే విశాలాక్షి ! ధారాహత ఇవాచలః.

తా॥ అని యెన్నివిధములుగా వజ్రమువంటిమాటలచే నెన్నివిధములుగా భేదింపఁబడినను ఆభరతరాజు ఓసువర్చలా దేవీ, ఆ బ్రాహ్మణుని మాటలను లెక్కచేయక వర్షధారలకుఁ గొండ కదలక మెదలక యుండునట్లు చలింపకయుండెను.

శ్లో॥ తథైవోచ్చై ర్జపన్నాస్తే గురుదేవతభావనః

తా॥ యథాప్రకారముగా బిగ్గఱగా గురువును, దేవతను సమానముగా భావించుకొని ధ్యానించుచు జపము చేయుచునే యుండెను.

శ్లో॥ ఇది హుంకృత్య రాజేంద్రం స్మయమానముఖో ద్విజః
ఫలపుష్పాదిలోభేన చచార వనమండలే.

తా॥ ఇట్లు బ్రాహ్మణుండు భరతరాజును కోపించి పలికి సమిధలు, ఫలములు, పువ్వులు తెచ్చుకొనుటకు వనమునకుఁ బోయి యందందు సంచరించుచుండెను. మిక్కిలి ఆశ్చర్యము పడుచుండెను.

శ్లో॥ అథాంతరే మహాప్రాజ్ఞం మృకండుం మహితప్రభం
సప్తకోటి మహామంత్రాన్యభీష్టం దాయకం నృణామ్

తా॥ ఇట్లు సంచరించుచున్న వాఁడై యొక్కచోట మిక్కిలి ప్రాజ్ఞుండై యుండినటువంటియును మిక్కిలి మహా మహిమకల కాంతి కలిగి యుండినటువంటియును, ఏడుకోట్లు మహామంత్రములను దాను నేర్చి ప్రజల కందఱకును వారి వారి కోరికల ననుసరించి యుపదేశము చేయుచుండునటువంటియును మృకండుండు అను పేరు గలవానిని

శ్లో॥ దదర్శ సపరీవారం బ్రాహ్మణం కాశ్యపం యథా

తా॥ పరివారముతోఁ గూడియుండువానిని నొక బ్రాహ్మణుని కాశ్యపునిఁ జూచినట్లు చూచెను.

శ్లో॥ తతః ప్రణమ్య విధివత్ ధర్మసారో మునీశ్వరమ్
జగాద పరమప్రీతః కంచిన్మంత్రం దిశేతి సః

తా॥ పిమ్మట వానికి యథావిధిగ నమస్కరించి ధర్మసారుండు మృకండు మహామునిని మిక్కిలి ప్రేమ కలవాఁడై నా కొక మంత్ర మేదైనను నుపదేశింపుడని కోరుకొనెను.

శ్లో॥ మృకండురపి ధర్మాత్మా ప్రార్థయంతం మహామనుమ్
అనుజగ్రాహ విప్రేంద్రం కృపయా దీనవత్సలః

తా॥ మృకండు మహాముని కూడ ధర్మాత్ముండు కనుక నిట్లు మంత్రము జెప్పుడని యనేక విధములచేతఁ దనను ప్రార్థించుచున్నటువంటి యా ధర్మసారుని జూచి దీనులయందు మిక్కిలి కోరిక గలవాఁడును ప్రేమ కలవాఁడును గావున దయకలవాఁడై యనుగ్రహము నొందెను.

శ్లో॥ దిదేశ ధర్మసారస్య మంత్రం సప్తాక్షరం మమ

సప్తాక్షరములు కల నాయొక్క మహామంత్రమును ధర్మసారునకు మృకండుముని యుపదేశించెను.

శ్లో॥ యథాధ్యానం యథాన్యాసం ప్రయోగ ముపసంహృతిమ్
దిష్టవాన్ సరహస్యంచ ధర్మసారాయ వై మునిః

తా॥ ఆ మంత్రముయొక్క న్యాసప్రకారమును ధ్యానముచేయు విధానమును ప్రయోగము చేయుటను ఉపసంహరించుకొనుటయును రహస్యములన్నియును ధర్మసారునకు మృకండుండు బాగుగా బోధించెను.

శ్లో॥ గురూపదిష్టవిధినా ధర్మసారో మనుం జపన్
మంత్రసిద్ధింతు నోవేత్తి స్వయం పండితవాన్యపి

తా॥ గురువుగారు బోధించినట్లు ధర్మసారుండు మంత్రమును జపించుచుండి యెంతకాలము గడచినను తాను మిక్కిలి పండితుండే యైనను మంత్రసిద్ధిమాత్రము పొందలేకపోయెను.

శ్లో॥ క్షత్రియస్యావమానేన తద్గురో ర్నిందయా పునః
న ప్రసన్నో మహామంత్ర స్తతో దుఃఖమవాప సః

ఆ భరతరాజును అవమానముచేయుటచేతను వాని గురువుగారిని నిందించుటచేతను మహామంత్ర మెంత జపించినను సిద్ధిని కలిగింపలేదుకావున ధర్మసారుండు మిక్కిలి దుఃఖించెను.

శ్లో॥ తతో నిర్విణ్ణచేతస్క స్త్యక్త్వాన్ మంత్రముత్తమమ్

తా॥ పిమ్మట మిక్కిలి విచారమునే పొందుచు ఆ మహామంత్రమును అనుష్ఠానము చేయక విడిచివైచెను.

శ్లో॥ క్షత్రియస్యచ ధిక్కారాత్ మద్భక్తస్య మహాత్మనః
మంత్రసారవిహీనోఽభూత్ ధర్మసార స్తథాప్రియే!

తా॥ నాకు భక్తుండగు భరతరాజును నిందించుటచేత ఓ సువర్చలాదేవీ! ధర్మసారుడు మంత్రసారమును పొందలేని వాఁడైనాఁడు.

శ్లో॥ ఉచ్చైరుపాంశువా మంత్రం జపన్ భక్త్యా నసీదతి

తా॥ భక్తిగలిగినవాఁడు బిగ్గఅగానైనను మంత్రమును జపించవచ్చును. నెమ్మదిగా లోలోపల జపింపవచ్చును. ఏమియును లోపములు కలుగవు.

శ్లో॥ స్వాచారోవా దురాచార స్సద్వంశోవాఽపి దుష్కులః
స్త్రీవా పుమాన్వా యఃకశ్చి న్నమే భక్తః ప్రణశ్యతి

తా॥ మంచియాచారము కలవాఁడుగాని, చెడుఆచారము కలవాఁడుగాని మంచివంశమునందుఁ బుట్టియుండువాఁడుగాని, చెడువంశమునందుఁ బుట్టియుండువాఁడుగాని స్త్రీగాని, పురుషుండుకాని ఎవ్వండైనను నాయొక్క భక్తుండు చెడిపోఁడు.

శ్లో॥ మంత్రత్యాగా త్తథా విప్రో గురువవజ్ఞానకారణాత్
తదవిశ్వాసవశగో మగ్నో దారిద్ర్యవారిధౌ

తా॥ మంత్రజపమును మానియుండుటవల్లను గురువును అవమానించి యుండుటవల్లను మంత్రమునందు నమ్మకము లేనివాఁడై దారిద్ర్యసముద్రములోఁబడి మునిగిపోయినాఁడు.

శ్లో॥ తత్సంస్కారవశాదేవ భవేఽస్మిన్ సూర్యనందిని!
గుర్వాజ్ఞాహీనస్సన్ సిద్ధిం నావిందత ద్విజః

తా॥ ఆ పాప సంపర్కమువల్లనే ఈ జన్మమునందును కూడ ఓ సూర్యతనయా! సువర్చలాదేవీ! గురువుగారియొక్క యనుగ్రహము లేనివాఁడై యాధ్వజదత్తుండు మంత్రసిద్ధిని పొందలేక పోయినాఁడు.

శ్లో॥ తతః ప్రసాదయాంచక్రే స్వగురుం సిద్ధికారణాత్

తా॥ పిమ్మట నిప్పటికి సిద్ధికలుగు కారణము కలిగియుం డుటనుబట్టి తన గురువునందు మంచి మనస్సు కలవాఁడై యా గురువుయొక్క యనుగ్రహమును సంపాదించుకొనినవాఁడు.

శ్లో॥ నివృత్తవాసనో విప్రో గురుపాదాంబుసేవనాత్

తా॥ గురువుగారియొక్క పాదతీర్థమును సేవించుటవల్ల మునుపటి పాపములన్నియును పరిహారములై పోయినవి.

శ్లో॥ యదభావా త్పువిప్రస్య పరిశ్రాంతి రభూత్పురా
తత్ప్రసాదా న్మహామంత్ర స్సిధ్యతిస్మ సువర్చలే!

తా॥ ఇదివరలో ఓ సువర్చలాదేవీ! గురువిశ్వాసము లేనందుననే మంత్రము సిద్ధింపలేదు. ఇప్పుడు గురుభక్తి మిక్కిలి కల్గియున్నవాఁడు కనుకనే మంత్రము ఫలించినది.

శ్లో॥ ధ్వజదత్తః కృతార్థోద్య విహాయ ఫలకామనామ్
మహామంత్ర ప్రసాదేన సంసారం తర్తుమిచ్ఛతి

తా॥ ధ్వజదత్తుండు ఇప్పుడు కృతార్థుఁడయినాఁడు. ఇతర ఫలములు కోరలేదు. వేఱేకోరిక లేమియును లేవు. మహామంత్ర ముయొక్క యనుగ్రహముచేత సంసారమునుండి విముక్తుండగు టకుఁ గోరుచున్నవాఁడు.

శ్లో॥ ఏతత్తే కథితం దేవి ! ద్విజస్య చరితం మహత్
యస్య శ్రవణమాత్రేణ భక్తిస్స్యా దనపాయినీ.

తా॥ ఓ సువర్చలాదేవీ ! నేను నీకు మహత్తరమగు నీ ధ్వజదత్తుని చరిత్రమును జెప్పినాను. ఇది వినినయెడల వెంటనే మిక్కిలి నిర్మలమయినట్టియును అపాయము లేనటువంటి భక్తి కలుగును.

శ్లో॥ ద్విజస్య చరితం శ్రుత్వా భర్త్రా సమ్యగ్వ్యవస్థితమ్
భూయోపి శ్రోతుకామేన ప్రియా వచన మబ్రవీత్

తా॥ ఇట్లు ధ్వజదత్తుని చరిత్రమును శ్రీ యాంజనేయ స్వామివారు స్వయముగాఁ జెప్పఁగా సువర్చలాదేవి విని వారి భార్యయగు సువర్చలామహాదేవి తిరిగి యింకను వాని చరిత్రమును వినవలెనని కోరిక కలదై యిట్లు పలికెను.

శ్లో॥ కిమీప్సితం ద్విజస్యాస్య కిముద్దిశ్య జపత్యసౌ
త్వయా కిందాతు ముద్యుక్తం తత్సర్వం వద మేప్రభో !

తా॥ ఓ స్వామీ ! ఈ ధ్వజదత్తునియొక్క కోరిక యేమిటి ? దేనిని గోరి తపస్సు చేయుచున్నాఁడు. తమరేమి యితని కిచ్చుటకుఁ దలంచినారు. ఆ విషయమంతయును సెలవీయ వలయునని యడిగెను.

శ్లో॥ ఏవం సంప్రార్థితో దేవ స్స్వభార్యా మబ్రవీద్వచః

తా॥ ఇట్లు భర్తను గుఱించి సువర్చలామహాదేవి సంప్రశ్నము చేయఁగా శ్రీ యాంజనేయ స్వామివారు భార్యతో నిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ విప్రోఽయం పూర్వసంస్కారా ద్దరిద్రిత్వ ముపాగతః
ఉపాదద త్సదా విప్రో బహుకాలం నినాయ హ.

తా॥ ఈ బ్రాహ్మణుండు పూర్వ పాపములవల్ల మిక్కిలి దరిద్రత్వమును పొందినాండు. ప్రతి రోజును ఉపాదానము చేసి చాలకాలము గడపినాండు.

శ్లో॥ కదాచి త్సకళత్రస్య దైన్యదర్శన విహ్వలః
ధనమాహర్తుకామస్సన్ నైమిశారణ్య మాగతః

తా॥ ఒకప్పు డతండు తన భార్యయొక్క దీనస్థితిని స్వయముగాం జూచి జాలి కలవాండై ధనమును సంపాదింప వలె నని యాసక్తి కలవాండై నైమిశారణ్యమునకు వచ్చినాండు.

శ్లో॥ ఇదానీం మంత్రమాహాత్మ్యాత్ గుర్వనుగ్రహ వైభవాత్
మహాఫలాభిలాషస్సన్ జహాతి ధనవాంఛితమ్.

తా॥ ఇప్పుడు మంత్ర ప్రభావము చేతను గుర్వనుగ్రహము చేతను మహాఫలమును కోరుచున్నవాండై ధనమునందలి వాంఛను విడిచివేసినాండు.

శ్లో॥ తథాపి మమ భక్తేన కాంక్షితాః ధనసంపదః
అతస్తు ధ్వజదత్తోఽయం నిజబంధుసమావృతః

తా॥ అయినను ఇదివఱలో ఈభక్తుండు ధనసంపదలను కోరికొని యున్నవాండు. కావున నీధ్వజదత్తుండు తన బంధువులతోను, మిత్రులతోను కూడుకొని యుండువాండై ఇంతటి నుండియును

శ్లో॥ భునక్తు సకలాన్ భోగా నంతే గచ్ఛతు మత్పదమ్

సకలైశ్వర్యములును అనుభవించి పిమ్మట నాసమీపమునందు నివసించును.

శ్లో॥ మమ సందర్శనాదేవ సిద్ధిం కైవల్యముత్తమమ్
మహాఫలాభిలాషోఽస్య పునరుక్త స్సువర్చలే.

తా॥ నాయొక్క దర్శనముచేతనే యితనికిఁ గైవల్యప్రాప్తి కలుగును. ఓ సువర్చలాదేవి ! యితనియొక్క మహాఫలమేదియో యది తెలియఁజేసెదను వినుము

శ్లో॥ అతోఽస్య ధ్వజదత్తస్య సర్వసంపత్సమృద్ధయే
సమర్పయ శ్రియం సాక్షా దంశభూతాం తవ ప్రియే

తా॥ ఓ ప్రియురాలా! కావున నీధ్వజదత్తునకును సర్వసంపత్తులతోను నిండియున్నట్టియును నీయొక్క యంశయైనట్టి వంటియును సాక్షాత్తు శ్రీస్వరూపము నితని కిమ్ము.

శ్లో॥ ఏవం సంబోధితా భర్త్రా తథాజ్ఞాం ప్రతిగృహ్ణతీ
నిజాంశం ప్రేషయామాస ధ్వజదత్తగృహంప్రతి.

తా॥ ఇట్లు భర్తయగు హనుమంతుఁడు బోధించిన వెంటనే యాసువర్చలామహాదేవి భర్తయొక్క మాటను శిరసావహించి తనయొక్క యంశను ధ్వజదత్తుని యింటికి బంపెను.

శ్లో॥ హనూమద్వచనం శ్రుత్వా నిజసంపత్తి కారణమ్
ధ్వజదత్తః పునఃప్రాహ స్వదేవం ప్రయతాంజలిః

తా॥ తనసంపత్తికలుగుటకుఁ గారణమగు శ్రీ హనుమంతుని వాక్యమును విని ధ్వజదత్తుండు తిరిగి స్వామివారితో నిట్లు. దోసిలి ధరించి నమస్కరించి పలికెను.

శ్లో॥ స్వామిన్ కుతో మమాజ్ఞాతం పునస్సంసారబంధనమ్
తవ సందర్శనాజ్జంతు స్తరేత్సంసారసాగరమ్.

తా॥ ఓస్వామీ! తిరిగి సంసార నరకబాధ నాకు నెందుకు నాజ్ఞాపించెదరు. తమ సందర్శనమును పొందినవారు సంసార సాగరమును దాటుచుందురుగదా!

శ్లో॥ దుర్లభం తవపాదాబ్జం త్యజేయం కథమీశ్వర!

తా॥ దుర్లభమగు మీపాదకమలములు ఓ స్వామీ! ఎట్లు విడువఁగలను?

శ్లో॥ సంసారబంధవిచ్ఛేదః కాంక్షితోఽద్య మయా ప్రభో!

తా॥ ఓస్వామీ! ఇప్పుడు నేను మిమ్ము సంసారనరక బాధనుండి విముక్తుడనగుటనుమాత్రము కోరుచున్నాను.

శ్లో॥ సఫలం కురు మత్కామం విలంబం న సహామ్యహమ్

తా॥ కావున నా కోరికను సఫలము చేయుడు. ఆలస్య మయినయెడల నేను ఆగలేను. వెంటనే సంసారముక్తిని కలిగింపుము.

శ్లో॥ సిద్ధం ఫలం ప్రాప్య కోవా కథం జహ్యాత్తు బుద్ధిమాన్

తా॥ లోకములలో బుద్ధిమంతుండెవ్వండైనను సిద్ధముగా నున్నఫలమునుపొంది తిరిగి చేతులార ఎట్లువిడిచిపెట్టును. కావున దమ పాదకమలములసేవయే దయచేయుడు. సంసారము నాకక్కర లేదనెను. మఱియును నిట్లనుచుండెను.

శ్లో॥ అతస్తుచ్ఛఫలం మాభూత్ దీయతాం శాశ్వతం ఫలమ్.

తా॥ ఓదేవా! ఇందువల్ల ఈ తుచ్ఛఫలము నాకువద్దు. శాశ్వతఫల మొసంగుము.

శ్లో॥ ఏవం సంప్రార్థితో దేవో ధ్వజదత్తేన ధీమతా
గృహీత్వా చుబుకే విప్రం ప్రార్థయామాస మారుతిః

తా॥ ఇట్లు ధ్వజదత్తుండు బుద్ధిమంతుఁడుకనుక మిక్కిలి ప్రార్థించుచుండఁగా, స్వామివారు వానిని గడ్డముపుచ్చుకొని బుజ్జగించి యోదార్చి చెప్పెను.

శ్లో॥ ఇదమేకంతు మద్వాక్యం శ్రోతవ్య మనసూయయా

తా॥ ఓధ్వజదత్తా! యీ యొక్కటియే నేనుచెప్పిన మాటను అసూయలేక వినుము నేనుచెప్పినట్లు నడుచుకొనుము.

శ్లో॥ భోక్తవ్యాహి మహాభోగా స్త్వయాద్య సహబంధుభిః
నచే ల్లోకాపవాదస్స్యా ద్యావదాచంద్రతారకమ్.

తా॥ ఇప్పుడు నీవు నీ బంధువులందఱితోఁ గలసిమెలసి సర్వభోగములు అనుభవించి తీరవలయును. లేనియెడల చంద్రుండు నక్షత్రము లుండుదనుక నుండునటువంటి గొప్ప లోకనింద కలుగును.

శ్లో॥ ధ్వజదత్తో దరిద్రస్సన్ హనూమన్మంత్రతత్పరః
సంపత్కామోజపన్ భూయ స్సంపదం నా ప్తవానితి

తా॥ ధ్వజదత్తుండు మిక్కిలి దరిద్రుండై దరిద్రవిచ్ఛిత్తి కొఱకు శ్రీహనుమన్మంత్రమును జపించి హనుమన్మంత్రము యొక్క ప్రభావమువల్ల సంపదలను పొందలేక పోయినాఁడు. అని అందఱును అంతటను చెప్పుకొనుచుందురు.

శ్లో॥ అతో మంత్రస్య సిద్ధ్యర్థం మమాజ్ఞాపాలనాయ చ
మన్మంత్రజపసిద్ధ్యర్థం భోగాన్ భుంక్ష్వ యథాసుఖమ్

తా॥ కావున శ్రీమంత్రము సిద్ధించుటకొఱకును నేను చెప్పినమాటను వినుటకొఱకును నాయొక్క మంత్రము జపించి ఫలమును పొందియున్నవాఁడవు కావున స్వేచ్ఛగా సకలభోగములను అనుభవింపుము.

శ్లో॥ తతో మత్పదమాసాద్య సర్వోపప్లవవర్జితమ్
సంసారసాగరోత్తీర్ణో భవిష్యసి న సంశయః

తా॥ పిమ్మట అన్ని యుపద్రవములను పోఁగొట్టుచున్నట్టి నాయొక్క నివాసమును పొంది సంసారసముద్రమును దాటినవాఁడవై సుఖింతువు. ఇందు కెంతమాత్రమును సందేహము లేదు.

శ్లో॥ భక్తసంరక్షణార్థాయ పర్యటన్ తవ వేశ్మని
వసామి పిహితాకారః సర్వోపద్రవనాశకః

తా॥ భక్తులను సంరక్షించుచుండుటకొఱకు నీయింటియందు నెవ్వరికిని నగపడకయుండి యే యాపదలు రానీయక నీ సమీపముననే నివసించియుందును.

శ్లో॥ డిండిమధ్వనినా విప్ర ప్రతిజానీహి సత్వరః
యత్ర కుత్రాపి విషయే న మే భక్తః ప్రణశ్యతి

తా॥ ఇంక ఘంటాపథముగాఁ జెప్పెదను. నామాట వినుము. నాభక్తున కెందును ఏ విషయమునందును కొంచెమైనను కష్టముగాని నష్టముగాని యుండదు. అతని కోరికలన్నియును నెరవేరుచుండును.

శ్లో॥ ఇత్థం ప్రభంజనసుతేన నిజోన్ముఖేన
సంచోదితో ద్విజవరో బహువారమీశమ్
అద్వైతనిశ్చితమతి ర్బహుమాన్య దేవ
మంగీచకార నియతో ధియ మాత్మభోగమ్.

తా॥ ఇట్లు శ్రీ యాంజనేయస్వామివారు స్వయముగాఁ దననోటితో బోధింపఁగా ధ్వజదత్తుండు విని స్వామివారిని అనేక విధములుగాఁ జాలసార్లు పొగడి, కొనియాడి, బహుమానించి, ప్రపంచకమునందంతటను నొక్కఁడే పరమాత్మయను నిశ్చయ జ్ఞానము కలవాఁడై శ్రీ స్వామివారి యాజ్ఞానుసారము తాను భోగ సుఖములు అనుభవించుట కంగీకరించియుండెను. తన మనస్సును మాత్రము నియమమునం దుంచు కొనెను.

శ్లో॥ కామం విధాయ సఫలం ద్విజనందనస్య
వాతాత్మజోపి గమనాయ మతిం చకార
సుగ్రీవమైందపనసాంగద గీయమాన
లీలావదాతమహిమా గుణభూమదామా.

ఇట్లు శ్రీ వాయుకుమారుండగు హనుమత్ప్రభువువారు ధ్వజదత్తుండు కోరుకొని తపంబు చేసిన కోరికల నన్నింటిని నొసంగి సుగ్రీవుండు మైందుండు పనసుండు అంగదుండు మొదలగు వానరు లందఱును తనయొక్క లీలలను దానగుణములను మహిమము లను పొగడుచుఁ బాటలు పాడుచుండఁగా మంచిమంచి సుగు ణములకు నివాసస్థానమగు శ్రీస్వామివారు కూడ గమనమునకు సంసిద్ధుండయ్యెను.

శ్లో॥ అథ నిజపదముచ్చై రప్రవాహాధిరూఢో
హరిరివ గరుడాంకో ధర్మపత్నీ సహాయః

జయజయశుభశబ్దై రూపణీయప్రయాణ
స్సకలనిగమవేద్య శ్శ్రీహనూమాన్ జగామ.

తా॥ సిమ్మట నొంటెవాహనమునందు నెక్కి గరుత్మంతునిమీద నధిష్ఠించిన విష్ణుమూర్తివలెఁ దనధర్మపత్నియగు సువర్చలాదేవిసహితుండై జయ జయ అను శబ్దములచేతఁ దన ప్రయాణమెల్లెడ వెల్లడికాఁగా సకలవేదసారములచేతను బేర్కొనఁబడుచుండు శ్రీహనుమంతుండు నిజనివాసమున కరుదెంచెను.

మైత్రేయః :—

శ్లో॥ కిమకారి ద్విజేనాథ ! ధ్వజదత్తేన ధీమతా
పరాశర ! మహాప్రాజ్ఞ వృత్తాంతం బ్రూహి మే ప్రభో !

తా॥ మైత్రేయముని పరాశరమహామునీంద్రుని నడుగుచున్నాఁడు. ఓ పరాశరమునీంద్రా ! బుద్ధిమంతుఁడును బ్రాహ్మణవర్యుండునగు ధ్వజదత్తుండు ఏమిచేసెనో ఆ వృత్తాంతమంతయును నాకుఁ జెప్పుము.

శ్రీపరాశరః :—

శ్లో॥ ప్రాప్తకామస్తు మైత్రేయ ! విప్ర స్సంతుష్టమానసః
ఉపపేదే యథాత్మానం పుష్కరం గురుమాత్మనః.

తా॥ పరాశరమునీంద్రుఁడు చెప్పుచున్నాఁడు. ఓ మైత్రేయా! ధ్వజదత్తుండు తనకోరికలన్నియును ఫలించుటచేత మిక్కిలి సంతోషించిన మనస్సుకలవాఁడై పిమ్మట మహాతపస్సంపన్నుఁడగు తనకు గురువుగారగు పుష్కరుని యొద్దకు జేరెను.

శ్లో॥ ప్రదక్షిణనమస్కారైః పూజయన్ విధివద్గురుమ్
ముఖప్రసాదం సంభావ్య కార్యసిద్ధి మవోచత.

తా॥ యథావిధిగఁ బ్రదక్షిణముచేసి నమస్కరించి, పూజించుచున్నవాఁడై ముఖవర్చస్సునుబట్టి కార్యము సిద్ధిని పొందుటను గూర్చి యిట్లు పలికెను.

శ్లో॥ బ్రహ్మన్నద్య కృతార్థోఽస్మి తవానుగ్రహవైభవాత్.

తా॥ ఓపుష్కరమునీంద్రా! తమ యనుగ్రహ విశేషము వల్ల నేను కృతార్థుండ నయినాను.

శ్లో॥ దైవతంచ మయా దృష్టం బ్రహ్మాద్యైరపి దుర్లభమ్
శ్రేయసోఽస్య భవాన్మూల మతస్త్వాం శరణం వ్రజే.

తా॥ బ్రహ్మ మొదలగు దేవతలకుఁగూడ మిక్కిలి దుర్లభమయినటువంటి శ్రీ యాంజనేయస్వామివారి దర్శన మయినది. ఈమేలున కంతకు మీరే ముఖ్యులుకావున మిమ్ము శరణు కోరుచున్నాను.

శ్లో॥ త్వదనుగ్రహలేశేన దరిద్రో ధనితా మగామ్.

తా॥ తమ అనుగ్రహము కొంచెము కలుగుటచేత దరిద్రుండను ధనవంతుండ నయినాను.

శ్లో॥ ఋణప్రతిక్రియం కర్తుం నశక్నోమి మహామునే!

తా॥ ఓపుష్కర మహామునీంద్రా! తమ ఋణమును నేను తీర్చుచుకొనలేను.

శ్లో॥ అనేకజన్మసాహస్రైరితి మే నిశ్చితా మతిః.

తా॥ ఎన్నివేలజన్మాలలో నైనను తమ ఋణము దీరదు. ఇది ముమ్మాటికిని నిశ్చయము.

శ్లో॥ భావతః ప్రియశిష్యేణ విధేయేన మయా గురో!
కింవిధేయ మిదానీం తే తద్బ్రూహి కరవాణ్యహమ్

తా॥ ఓగురుసార్వభౌమా! తమకు మిక్కిలి విధేయుం డను ప్రియశిష్యుండను. తమరు ఏదిచేయమనిచెప్పితే యది వెంటనే చేసెదను. తమరు సెలవీయుడు.

శ్లో॥ ఇత్యుక్తో ధ్వజదత్తేన పుష్కరః శిష్యవత్సలః
జగాద వదతాంశ్రేష్ఠ స్స్మితోదంచితవాఙ్మనిః.

తా॥ ఇట్లు ధ్వజదత్తుండు చెప్పగానే శిష్యులయందు మిక్కిలి ప్రేమము కలిగియుండునటువంటి మంచిమాటకారియగు పుష్కరుండు చిరునవ్వు నవ్వుచు నిట్లు పలికెను.

శ్లో॥ హనూమతః ప్రసాదేన కృతకృత్యోఽస్మి శిష్యక.

తా॥ ఓ ప్రియమైన శిష్యుడా! శ్రీహనుమంతుని యను గ్రహమువల్ల నేను కృతకృత్యుండనైనాను.

శ్లో॥ నాస్తి కృత్యావశేషోఽద్య నిష్కామతపసో మమ

తా॥ కోరిక లేవియును లేకయే యేకోరికలను కోరకయే తపస్సుచేయుచున్న నాకుం జేయవలసిన పనియే లేదు.

శ్లో॥ హనుమద్భక్తివిషయే మాప్రమథాః వ్యగ్రితాం ద్విజ!

తా॥ శ్రీహనుమత్ప్రభువువారి భక్తియం దెప్పుడును ఓ ధ్వజదత్తా! లోపము నేమాత్రమును చేయబోకుము. మిక్కిలి జాగరూకత కలవాఁడవై యుండుము.

శ్లో॥ త్వమేవ యోగ్యకాలేషు హనుమన్మంత్ర ముచ్చరన్
ప్రమాదం మాభజ క్వాపి భజతో నిజదైవతమ్

తా॥ నీవు తగిన వేళలయందెల్లప్పుడును శ్రీహనుమ న్మహామంత్రమును జపించుచుండుము. మనస్వామివారికి సేవ చేయు విషయములో నొక్కింతయును బొరపాటు చేయకుము.

శ్లో॥ అస్మాకం మిష్టదేవస్య త్వమాజ్ఞాం పరిపాలయ

తా॥ మన స్వామివారు చెప్పిన యాజ్ఞను తప్పక నెర వేర్పుము, అశ్రద్ధచేయకుముసుమా.

శ్లో॥ ఉపభుజ్యాఽఖిలాన్ భోగాన్ శీలయా సాధువృత్తయా
అంతే హనూమతస్థానం ప్రాప్నుహి ద్విజసత్తమ!

తా॥ నీవు ఇప్పుడు సకలభోగములు అనుభవించి మంచి స్వభావము మంచి పనులు కలవాఁడవై కాలము గడపి పిమ్మట శ్రీహనుమత్ప్రభువువారి సాయుజ్యమును పొందుదువు.

శ్లో అహం వసామి చాత్రైవ తదాజ్ఞాగౌరవాత్ సదా

తా॥ నేను వారి యాజ్ఞననుసరించి యిక్కడనే జపము చేసికొనుచు నుందును.

శ్లో॥ హితోపదిష్టో గురుణా ధ్వజదత్తో మహామతిః
తథేతి ప్రతిజగ్రాహ పాదమూల ముపాగతః

తా॥ ఈప్రకారము గురువుగారగు పుష్కరుం డానతి యివ్వఁగా ధ్వజదత్తుం డంగీకరించి గురువుగారి పాదములమీఁద సాష్టాంగపడి నమస్కరించెను.

శ్లో॥ అథ సమ్మానితశ్శిష్యః పుష్కరేణ ద్విజోత్తమః
ద్విత్రాంస్తు పదవిన్యాసా ననుయాతో మహాత్మనా

తా॥ పిమ్మట పుష్కరమహాముని శిష్యుండగు ధ్వజ దత్తునిని గౌరవించి ప్రయాణముచేసి రెండుమూఁడడుగులు వెంటనే నడచి సాగనంపెను.

శ్లో॥ తిర్యక్కృత్య నిజగ్రీవాం గురుం పశ్యన్ ముహుర్ముహుః
తత్పదాబ్జం హృది ధ్యాయన్ జగామ నిజపట్టణమ్.

తా॥ పిమ్మట ధ్వజదత్తుండు వెనుకకుఁదిరిగి గురువుగారిని చూచుచుఁ జూచుచు వారి పాదపద్మములు మనసునందు నిలిపి ధ్యానముచేయుచుఁ గొంతకాలమునకుఁ దన పట్టణమునకు వెళ్లెను.

శ్లో॥ శనైర్గచ్ఛన్ తథావిప్రో దదర్శ నిజమందిరమ్

తా॥ ఇట్లు పట్టణముప్రవేశించి మెల్లమెల్లగా ధ్వజదత్తుండు తనయిల్లు సమీపించి చూచెను.

శ్లో॥ సుధామండల సంస్పర్ధి ప్రాసాద శతశోభితమ్
నానారత్నాంచితద్వారం హేమప్రాకారవేష్టితమ్

తా॥ ఆయిల్లు అనేకములగు మేడలు అమృతమయములై మిక్కిలి తెల్లనికాంతితో విరాజిల్లుచుండునవిగా మారిపోయి యున్నయవి. ఆమేడలలోని ద్వారములు బహువిధరత్నములచే నమర్పఁబడియున్నయవి. ఆమేడలయొక్క ప్రాకారములు బంగారుచేఁ గూర్పఁబడియున్నవి.

శ్లో॥ ధ్వజదత్తాభిధానాంకధ్వజైశ్చ సమలంకృతమ్

తా॥ ధ్వజదత్తుండు అను గుర్తులుగల జండాలు అందంకటలను నలరారుచున్నయవి.

శ్లో॥ మహాజవై ర్మహోత్సాహై ర్హయైశ్చ పరివారితమ్

తా॥ మిక్కిలి గొప్పవేగములుగల మంచి యుత్సాహములుకల అనేకములగు గుఱ్ఱము లందు నిండియున్నవి.

శ్లో॥ ఐరావత సమాకారై ర్గజైశ్చ గజయూథపైః
ఉష్ట్రై రష్టపదాకారై ర్వేష్టితం చ యథాక్రమమ్

తా॥ దేవేంద్రునియొక్క వాహనమగు ఐరావతముతో సమానమగు ననేకములగు నేనుగులును ఏనుగు సేనలును నం

దందు నంతట నిండియున్నవి. బంగారు రంగు గల యొంటెలు చాల నున్నవి.

శ్లో॥ ఆపీనభారవహానా ద్గచ్ఛంతీభి స్సుమంజులమ్
ధేనుభి ర్బహుసంఖ్యాభి స్సమంతా త్పరివేష్టితమ్

తా॥ మిక్కిలి మంచి నిండు పాలపొదుగులు కలిగి ముద్దుగాను ముచ్చటగాను నడచుచుండు పాడియావు లసంఖ్యాకములుగా నెన్నియో మందలు మందలుగా నందు నంతట నిండియున్నవి.

శ్లో॥ దాసీభి ర్దాసముఖ్యైశ్చ సేవితంతు దివానిశమ్

తా॥ రాత్రిం బవళ్లు దాసీలు సేవకులు ననేకులు సేవించు చున్నారు.

శ్లో॥ ద్వీపాంతర సమానీత నానావస్తుసమన్వితమ్

తా॥ ఇతర ద్వీపములనుండి తీసికొని వచ్చి యనేక వస్తుసముదాయములు నలరారుచున్నయవి.

శ్లో॥ రాశీకృతై ర్ధనైర్ధాన్యై రత్నైశ్చ వివిధైరపి
పట్టవస్త్రై ర్మహామూల్యైర్దివ్యపీతాంబరైరపి

తా॥ అనేకములు ధనరాసులు ధాన్య రాసులు రత్న రాసులు మిక్కిలి విలువగల పట్టువస్త్రములు పీతాంబరములు ఎన్నియో యందు మిక్కిలి ప్రకాశించుచున్నయవి.

శ్లో॥ దుకూలై ర్బ్రాహ్మణైశ్చాపి సమంతా దుపశోభితమ్

తా॥ ఎక్కడఁ జూచినను రవసెల్లాలు సిల్కులు అంతట నిండియున్నవి.

శ్లో॥ గృహోపకరణై రన్యై రుపభోగోపశోభితమ్

తా॥ ఇంకను గృహమునకుఁ గావలసిన పనిముట్లు ఎన్నియో రకములు లెక్కపెట్టుట కలవికాని వందు నిండియున్నయవి.

శ్లో॥ అనర్ఘై స్స్వర్ణపాత్రైశ్చ సర్వత స్సమలంకృతమ్

తా॥ మిక్కిలి విలువగల బంగారుపాత్ర లనేకములందు నలంకరింపబడి యున్నయవి.

శ్లో॥ ఏవం సర్వసమృద్ధం తద్గృహరత్నం నిరీక్ష్య సః
విస్మయం పరమం ప్రాప హనుమద్వైభవం స్మరన్

తా॥ ఇట్లు సర్వ వస్తు సమృద్ధి కలిగియున్న యా గృహరత్నమును చూచి మిక్కిలి యాశ్చర్యము కలవాఁడై శ్రీ హనుమత్ప్రభువుగారి మహిమమును ధ్యానించుచుండెను.

శ్లో॥ నిజాగమనసంభ్రాంతై ర్బంధుభి ర్బ్రాహ్మణోత్తమః
ప్రత్యుద్గత స్సుహృద్భిశ్చ ప్రవివేశ గృహోత్తమమ్

తా॥ ఇంతలో శ్రీధ్వజదత్తుండు వచ్చినవార్త తెలిసికొని వానిబంధువులు మిత్రులు వచ్చి వీనినిదీసికొనివెళ్లి వీనిభవనములోఁ బ్రవేశపెట్టినారు.

శ్లో॥ స్వగృహీతాంగుళీభిశ్చ సఖీభి స్సంహతోరుభిః
పశ్యన్ గృహాగరీయస్త్వం నిజాంతఃపుర మావిశత్

తా॥ మంచిమంచి శరీరములు మంచిమంచి యూరువులు మొదలగు నవయవములుగల స్త్రీలు తమవ్రేళ్లతోఁ బట్టుకొని నడిపించుచుండఁగా నింటియొక్క మహిమమును చూచుచు సంతోషించుచు దన యంతఃపురమునందుఁ బ్రవేశించెను.

శ్లో॥ తత్ర సాధ్వీం నిజాం భార్యాం సఖీభిః పరివారితామ్
మహాభాగ్యవతీత్యేవ నిత్యం బంధుజనై స్స్తుతామ్

తా॥ ఆయంతఃపురములో మిక్కిలి సాధుగుణములు కలిగి యుండినట్టియును చెలికత్తెలతో సేవింపఁబడు చున్నట్టియును గొప్పయదృష్టవంతురాలని బంధువు లందఱిచేతను స్తుతింపఁబడు చున్నట్టియును తనభార్యను చూచెను.

శ్లో॥ సర్వలక్షణసంపన్నాం వామాంగీం వారిజేక్షణామ్
తారామధ్యగతాం తన్వీం చంద్రరేఖామివ స్థితామ్

తా॥ ఆమె మంచిమంచి లక్షణములతో నిండియున్నది. ఎడమప్రక్కనుండు నవయవములు మిక్కిలి ప్రసిద్ధలక్షణములు కలదై యుండునది. నక్షత్రములయొక్క మధ్యలోనుండు చంద్ర బింబమువలె నాస్త్రీలందఱిలోను మిక్కిలి కాంతికళలుకలిగి శోభిల్లుచున్నయది.

శ్లో॥ స్వర్ణతాటంక సంరోచత్కపోల ద్వయజృంభితామ్

తా॥ బంగారు చెవులపోగులు పెట్టుకొనుటచేత మిక్కిలి కాంతులతోనిండిన చెక్కిళ్ళు రెండును కలిగియుండినది.

శ్లో॥ నవరత్నప్రభాలిప్త మేఖలాదామశోభితామ్

తా॥ నవరత్నముల కాంతితోఁ గలిసియుండు ఒడ్డాణ ముచే మిక్కిలి ప్రకాశించుచుండినది.

శ్లో॥ క్వణత్కంకణ విద్యోతి మణిబంధాం సుమధ్యమామ్

తా॥ మంచిమృదువులగు ధ్వనులు చేయుచుండు ముఱు గులు ధరించి మణికట్టులు నడుము మొదలగు అవయవములచే మిక్కిలి శోభించుచున్నది.

శ్లో॥ కంఠలంబి మహామూల్య ముక్తాహారమనోహరామ్

తా॥ మంచిమంచి వెలలుకల ముత్తెముల హారములు కంఠమునందు ధరించి మనోహరముగా నున్నది.

శ్లో॥ మంజుమంజీరనినదాం దివ్యపీతాంబరాంచితామ్

తా॥ మిక్కిలి మృదుమధురధ్వనులుగల యందెలు ధరించినది. మిక్కిలి కాంతులుకల పట్టుపీతాంబరములు కట్టుకొని యున్నయది.

శ్లో॥ ఏవం విచిత్రభూషాఢ్యాం బాలాం దృష్ట్వా ద్విజోత్తమః
ఉవాచ వచనం ధీర స్సుహృద్బంధుసమావృతః

తా॥ ఇట్లు అనేకాభరణములతో నెంతయు విరాజిల్లుచున్న బాలికవలెనున్న యామెనుజూచి తనస్నేహితులు బంధువులు తనయొద్దనుండఁగా ధైర్యముతో నామెకిట్లనెను.

శ్లో॥ అయిప్రియే! కృతార్థోఽస్మి తవ సౌశీల్యవైభవాత్

తా॥ ఓప్రియురాలా! నీయొక్క మంచిస్వభావమునకును నీవైభవమునకును మిక్కిలి సంతోషించుచున్నాను. కృతార్థుండ నయినాను.

శ్లో॥ పుష్కరోనామ ధర్మాత్మా మహాయోగీ మహాతపాః
సాక్షాత్కృతహనుమాంశ్చ సర్వభూతదయాపరః

తా॥ పుష్కరుండను అను మహాముని కలండు. ధర్మమగు మనస్సుకలవాఁడు మహాయోగములు కలవాఁడు. మంచి తపశ్శాలి. శ్రీ హనుమత్ప్రభువువారిని ప్రత్యక్షముగాఁజూచి మాటలాడుచుండువాఁడు. సకలప్రాణులయందును దయకలిగియుండువాఁడు.

శ్లో॥ సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః సదాచారో జితేంద్రియః

తా॥ సకలశాస్త్రములలోని సారములు తెలిసినవాఁడు మంచియాచారములు కలవాఁడు. ఇంద్రియములను లోబరచుకొని యున్నవాఁడు.

శ్లో॥ ఏవంభూతస్తు విప్రేంద్రో నైమిశారణ్యగహ్వరే
పుణ్యతీర్థం సమాసాద్య జపన్నాస్తే నిరంతరమ్

తా॥ ఇట్టి సుగుణములుగల యాపుష్కరుండు నైమిశారణ్యమందు మధ్యమునం దొక పుణ్యతీర్థ సరస్సుయొక్క తీరమునందుం జేరి నిరంతరము తపము చేయుచుండువాడు.

శ్లో॥ నిష్కామజపకర్తాసౌ హనుమన్మంత్రతత్పరః
సంపూర్ణసర్వకామోఽపి దీనానుగ్రహవాంఛయా

తా॥ అతఁడు నిష్కాముఁడై శ్రీహనుమన్మహామంత్రమును జపము చేయుచుండును; అతనికి అన్నికోరికలు అరచేతిలో నున్నప్పటికిని దీనులను రక్షింపవలెనని తలంచి

శ్లో॥ జపత్యనుదినం సాక్షాత్ హనుమద్ద్వాదశాక్షరీమ్
తా॥ ప్రతిరోజును శ్రీహనుమద్ద్వాదశాక్షరీ మహామంత్రమును జపించుచుండును.

శ్లో॥ అథాస్మిన్నంతరే సాధ్వి! తవ దైన్యనిరీక్షణాత్
అతీవ దుఃఖితోభూత్వా త్వత్సంభాషణవిహ్వలః

తా॥ తరువాత నింతలో నోపతివ్రతాతిలకమా! నీవు దీనురాలివై యుండుటచూచి మిక్కిలి దుఃఖించి నీతో మాటలాడలేక,

శ్లో॥ ఉపాదానచ్ఛలేనైవ నిష్క్రాంతోఽహం గృహాంగణాత్
తా॥ ఉపాదానమునకు వెళ్ళుచున్నానని చెప్పి నేను ఇంటినుండి వెళ్ళిపోయినాను.

శ్లో॥ నిర్గత్యతు చిరంధ్యాత్వా స్మృత్వా తవ ముఖాంబుజమ్
క్వగంతవ్యం మయాచేతి చింతాక్రాంత ఇవాభవమ్

తా॥ వెళ్ళి చాలసేపు ధ్యానించి నీముఖకమలమును స్మరించి యెక్కడికి వెళ్ళుదును ? ఏమిచేయుదును? అనువిచారములో మునింగియున్నాను.

శ్లో॥ తతో ధైర్యం సమాస్థాయ సర్వసంపజ్జిగృక్షయా
నిద్రాహారవిహీనోఽహం నైమిశారణ్యమావిశమ్

తా॥ పిమ్మట ధైర్యము తెచ్చుకొని అన్ని సంపత్తులు సంపాదించుకొందమను కోరికతో నిండియుండి నిద్రాహారములు మాని యెట్లో నైమిశారణ్యమునకు వెళ్ళినాను,

శ్లో॥ ప్రవిశ్యతు మహారణ్య మద్రాక్షం పుష్కరమ్ మునిమ్

తా॥ ప్రవేశించి మహారణ్యములో నొకమునిని పుష్కరుండను వానిని జూచినాను.

శ్లో॥ దృష్ట్వాతు సుమహాత్మానం జపంతం పావకోపమమ్
విజ్ఞాప్య మమ వృత్తాంతం గతోఽస్మి శరణం మునిమ్

తా॥ అగ్నిహోత్రునితో సమానముగానుండి జపము చేయుచుండు ఆమహాత్ముని చూచి, నాసంగతియంతయు నతనికిఁ జెప్పి యాపుష్కరుని కాళ్ళపైఁబడి శరణు కోరినాను.

శ్లో॥ తతః శ్రుత్వాతు మద్వాక్యం పుష్కరో దీనవత్సలః
హనుమన్మంత్రదానేన సద్యో మా మనుగృహ్ణాతు.

తా॥ నామాటవిని యాపుష్కరుండు వెంటనే దీనులయందు మిక్కిలి ప్రేమము గలవాఁడు గావున నాకు అనుగ్రహించి శ్రీహనుమన్మహామంత్రమును ఉపదేశించెను.

శ్లో॥ తదనుగ్రహమాహాత్మ్యా ద్దృష్టం దైవత ముత్తమమ్

తా॥ ఆయనుగ్రహము యొక్క మాహాత్మ్యము వల్లనే శ్రీ హనుమత్ప్రభువు వారిని నాకన్నులార జూచినాను.

శ్లో॥ తతో హనుమతా తేన దత్తో మే వరఉత్తమః

తా॥ పిమ్మట శ్రీహనుమత్ప్రభువువారు నాకొకవరము నిచ్చినారు.

శ్లో॥ ఇహ సర్వసమృద్ధిశ్చ పరత్రచ పరాగతిః

తా॥ ఈలోకములో సకలైశ్వర్యములు అనుభవించి పిమ్మట పరలోకముచేరి సుఖింపుమని సెలవిచ్చినారు.

శ్లో॥ ఏవం వరం గృహీత్వాఽహమాగతోఽస్మి తవాంతికమ్

తా॥ ఇట్లు వరములు పొంది నీ దగ్గరకు వచ్చినాను.

శ్లో॥ వినా తవ వియోగార్తిః నాస్తి క్లేశో మమ ప్రియే!

తా॥ ఓ ప్రేయసీ! నీకును వియోగదుఃఖము లేదు. నాకును కష్టము లేదు.

శ్లో॥ త్వద్దైన్యస్మరణాదేవ ఖేదో భవతి నాన్యథా.

తా॥ నీయొక్క దీనత్వము తలంచుకొంటే నా కిప్పటికి విచారము కలుగుచున్నయది. ఇంకొకబాధ యేమియును లేదు.

శ్లో॥ త్వయైవతు మహాకష్టం భుక్తం దారిద్ర్యసంభవం

తా॥ నీవే దరిద్రమువల్ల మిక్కిలి యెక్కువ కష్టము అనుభవించియున్నావు.

శ్లో॥ ఇత్యుక్తవంతం ప్రోవాచ పతిశీలా పతివ్రతా

తా॥ ఇట్లు భర్త చెప్పుచుండఁగా భర్తయందే తన స్వభావము నంతయు నింపియుండినట్టి పతివ్రత భర్తతో నిట్లనెను.

శ్లో॥ స్వామి న్న కించిత్ కష్టం మే త్వత్పాదాసక్తచేతసః

తా॥ స్వామీ! తమ పాదములయందు మిక్కిలి ప్రేమ యుకల నాకు నే కొంచెము కష్టమును లేదు.

శ్లో॥ కింతు ధిఙ్మా మిమాం దుష్టాం త్వద్వియోగేఽపి జీవితమ్

తా॥ తాము వెళ్లగా దమవియోగమునందును జీవించి యుండు దుష్టురాలనగు నా జన్మము మిక్కిలి నింద్యము.

శ్లో॥ జ్ఞాత్వాతు నానుగంత్రీం మాం భవతః పాదపద్ధతిమ్
అంతరంగ మిదం మన్యే శత్రురేవ న సంశయః.

తా॥ తమరు వెళ్ళుట తెలిసియును మీ వెంట మీ పాదముల ననుసరించి గాలేకపోతిని. నిజముగా నా యంతరంగము శత్రువనే యనుకొనవలసియున్నది. ఇందుకు సందేహ మెంతమాత్రమును లేదు.

శ్లో॥ త్వద్గతం ఖిద్యమానాయా స్త్వద్వార్తాం మే న వక్ష్యతి

తా॥ మీయందే లగ్నమైయుండియు మిమ్ము గుఱించి దుఃఖించుచున్న నాకు మీవార్తయే తెలుపకున్నది.

శ్లో॥ ఉపకర్త్రీంతు తాంమన్యే మూర్ఛనాంతు కథంచన

తా॥ ఒక సమయములో మూర్ఛవచ్చినయెడల నుపకారముచేసిన దానినిగా దలంచుచుండెడిదానను.

శ్లో॥ యయా వియోగదుఃఖాని నైవాజ్ఞాసిష మన్వహమ్

తా॥ ఆ మూర్ఛవచ్చినప్పుడు తమవియోగదుఃఖమే నాకు లేకుండెడిది. కావున మూర్ఛయే యుపకారము చేయున దయ్యెను.

శ్లో॥ పురస్సరం మమస్వాంతం తవ మార్గప్రదర్శకమ్

శ్లో॥ పునర్నాయాతి శత్రుత్వా త్త్వాముపాదాయ సంభ్రమాత్

తా॥ నామనస్సు నాకుశత్రువుగాన నీకు త్రోవజూపుచు నీతోనేయుండి సుఖించుచు నావద్దకు మరల రాలేదు.

శ్లో॥ ఇదానీం బహుమన్యే తాం గాధాం జీవంత్యహం పునః

తా॥ ఇప్పుడు జీవించియుండుటవల్ల అగాధను గౌరవించు చున్నాను.

శ్లో॥ త్వద్దర్శనమహానంద సముద్రోదకసంప్లుతామ్

తా॥ తమదర్శనము కలిగినదను మహానందసముద్ర జలముతో గాధ యేకమైపోయినది.

శ్లో॥ ఏవం వదంతీం భార్యాంతు బాష్పపూరితలోచనః
ఆలిలింగ జవాద్విప్రః పరమానందనిర్భరః

తా॥ అని యిట్లుచెప్పుచున్న భార్యనుచూచి ధ్వజదత్తుండు ఆనందబాష్పములు ప్రసరించుచుండఁగా మహానందముతోఁ దన భార్యను గౌఁగిలించుకొనెను.

శ్లో॥ తతస్సంతుష్టచిత్తస్సన్ స్వభార్యా మిద మబ్రవీత్

తా॥ పిమ్మట సంతోషించిన మనస్సుకలవాఁడై తన భార్యతో నిట్లనియెను.

శ్లో॥ కష్టాన్యహాన్యతీతాని లంఘితో దుఃఖసాగరః
ఇదానీం త్యజ కష్టాని హనుమద్దయయా ప్రియే !

తా॥ ఓప్రియురాలా! కష్టపుదినములు గడచిపోయినవి. దుఃఖసముద్రమును దాటినాము. శ్రీహనుమంతుని దయవల్ల కష్టములను మఱచిపొమ్ము. ఇంక మనకుఁ గష్టములురావు.

శ్లో॥ అధునా త్వం మహాభాగే భుంక్ష్వ భోగాన్ యథేప్సితాన్

తా॥ ఇకముందు నీవు గొప్పయదృష్టవంతురాలవు. సకల భోగములు స్వేచ్ఛగా ననుభవింపుము. సుఖింపుము.

శ్లో॥ భునక్తు సకలాన్ భోగాన్ భద్రబాహూ ర్యథేప్సితమ్

తా॥ భద్రబాహువుకూడా స్వేచ్ఛగా సుఖముగా భోగము లనుభవించుచుండును.

శ్లో॥ భద్రోపి మహాప్రాజ్ఞో భ్రాతా మే భ్రాతృవత్సలః

తా॥ సోదరప్రీతిగల మహాప్రాజ్ఞుండగు భద్రకుండును సకలభోగము లనుభవించుచుండును.

శ్లో॥ గుర్వనుగ్రహమాహాత్మ్యాత్ హనుమన్మంత్రవైభవాత్
తవ భాగ్యోదయాచ్చైవ సమృద్ధా స్సర్వసంపదః

తా॥ పుష్కర గురువుగారియొక్క యనుగ్రహ విశేషమువల్లను శ్రీహనుమత్ప్రభువారియొక్క మంత్రప్రభావమువల్లను నీయొక్క యదృష్టమువల్లను మనకు సర్వసంపదలు సమృద్ధిగాఁ గలిగియున్నయవి.

శ్లో॥ అథో యథేష్టమన్నాని భుంజంతా మర్థినస్సదా
బాంధవాశ్చ యథాకామ మీప్సితార్థాన్ భుజంతు నః

తా॥ మనయింటికి వచ్చు నతిథులును యాచకులును స్వేచ్ఛగాఁ బ్రతినిత్యమును అన్నమును భుజించుచుందురుగాక. మనబంధువులందఱును వారివారికిఁ గావలసిన వస్తువులను సేకరించి సుఖముగా నివసించుచుందురు గాత. సంతోషమును పొందుచుందురుగావుత.

శ్లో॥ ఇత్యాదిశ్య వధూం విప్రో విరరామ మహామతిః

తా॥ ధ్వజదత్తుండిట్లు భార్యకుఁజెప్పి యూరకుండెను.

శ్లో॥ ఏకోక్తి తదాజ్ఞాం శీలాపి సుశీలా భర్తృచోదితా

తా॥ పిమ్మట మంచిస్వభావముగల శీలాదేవికూడఁ దన భర్తగారి యాజ్ఞననుసరించి సంచరించుచుండెను.

శ్లో॥ తతః కదాచి ద్విప్రేంద్రః పుణ్యకాలే నదీతటే
స్నాత్వా సుశీలయా పూర్వం శీలయా భార్యయాసహ

తా॥ పిమ్మట గొంతకాలమునకు ధ్వజదత్తుండు సుశీల యగు శీలయను భార్యతోఁగలసి యొక పుణ్యపరువదినమునందు నొక పుణ్యనదిలో స్నానముచేసి

శ్లో॥ యథావిధి యథాన్యాసం హనుమద్ద్వాదశాక్షరమ్
దారిద్ర్యపంకశమన మజ్ఞానధ్వాంతనాశనమ్

శ్లో॥ ఏవం విధం మహామంత్రం కళత్రాయ దిదేశ సః

తా॥ యథావిధిగా, న్యాసములతోఁగూడ శ్రీ హనుమ ద్ద్వాదశాక్షర మహామంత్రమును దారిద్ర్యమును పోఁగొట్టు దానిని అజ్ఞానమును రూపుమాపుదానిని తన భార్యకు ధ్వజ దత్తుం డుపదేశించెను.

శ్లో॥ అష్టాక్షరం మహామంత్రం భద్రకాయ దిదేశవై

తా॥ శ్రీహనుమంతునియొక్క అష్టాక్షర మహామంత్ర మును భద్రకున కుపదేశించెను.

శ్లో॥ సప్తమంత్రాత్మికాం విద్యాం భద్రబాహోస్తు దిష్టవాన్

తా॥ శ్రీహనుమత్ప్రభువువారియొక్క సప్తాక్షర మహా మంత్రమును భద్రబాహువున కుపదేశము చేసెను.

శ్లో॥ ఏవం హనూమతో మంత్రాన్ పితృమాతృకులద్వయే
విప్రః ప్రవర్తయామాస యథాన్యాసం యథారుచి

తా॥ ఇట్లు శ్రీ హనుమత్స్వామివారియొక్క మహా మంత్రములను తన తండ్రివంశమువారికిని, తన తల్లి వంశము వారికిని అందఱకును వారివారి కోరికల ననుసరించి న్యాసము తో సహా యుపదేశించెను.

శ్లో॥ ధ్వజదత్తో మహాప్రాజ్ఞ స్సుహృద్బంధు సమన్వితః
యథాసుఖం యథాన్యాయ్యం సర్వాన్ కామానభుంజత.

తా॥ ధ్వజదత్తుండు మహాప్రాజ్ఞుండై స్నేహితులతోను బంధువులతోను పరివారముతోను కలసిమెలసి యథావిధిగా మంత్రమును ధ్యానించుచు స్వేచ్ఛగా, న్యాయానుసారముగా సర్వ సుఖములు సకలైశ్వర్యములు అనుభవించుచుండెను.

శ్లో॥ ఇతి బహుతిథికాలం భుక్తభోగో ద్విజేంద్రో
దురిత చరిత దూరం వాయుసూనోః పదంతత్
అలభత సులభాత్మా శాంతచిత్తప్రచారో
భవనిధననిరాసం కర్తుకామ స్సకామమ్.

తా॥ ఇట్లు ధ్వజదత్తుండు చాలకాలము సకలభోగములు అనుభవించుచు దురితమార్గమును చూడనివాఁడై శ్రమించి జ్ఞానభావము కలవాఁడై నిర్మలమగు శాంతమగు మనస్సు కలవాఁడై సంసార సాగరమును దాటినవాఁడై మిక్కిలి శాశ్వత సుఖమును ఇచ్చుచున్నట్టి శ్రీ హనుమత్స్వామివారి పదవిని స్వీకరించి శాశ్వత సుఖ మనుభవించు చుండెను.

శ్లో॥ ఏతత్ చరిత్రం పఠతాం శృణ్వతామపి సర్వదా
సిద్ధ్యంతి సర్వకార్యాణి హనుమత్పదమాస్థితమ్

తా॥ శ్రీ ధ్వజదత్తుని చరిత్రమును చదివినవారికిని వినినవారికిని ఎల్లకాలమును అన్ని కోరికలు నెరవేరుచుండును. పిమ్మట శ్రీహనుమత్పదవి తప్పక లభించును.

పైకథాభాగముచే దరిద్రుడగు ధ్వజదత్తునకు క్రమముగా గురుభక్తి కలిగి హనుమత్సాక్షాత్కారము కలిగి యిహలోక పరలోక సుఖము లన్నియు గలిగినట్లు దెలియుటచే గురుభక్తికి మించినది మంత్రసాధనలలో లేదని దేలుచున్నది.

ఓమ్

# శ్రీపార్వతీపరమేశ్వరవిహారము

## వేంకటాచలము

శ్లో॥ తతఃకాలే మహాదేవః పర్యటన్ పృథివీ మిమామ్
పార్వతీసహిత శ్శ్రీమాన్ వేంకటాచల మాగతః

ఉ॥ అంత వసంత మెయ్యెన విహారముచేయుచు దంపతీశ్వరుల్
సంతసిలం బొనర్చుచు విశాలమనస్కులఁ జేయుచున్న స
ర్వాంశ దిగంత జంతుతతి హర్ష సముత్సుకమై భ్రమింప ని
శ్చింతత శంకరున్గని విచిత్రము తెల్పఁగ గౌరి పాలియున్.

ఉ॥ వింత ప్రియంబుగాంచుటలు వేడుకఁగూడుట వింతవాసినన్
జింతిలు టంతగన్గొనిన సిగ్గులుటల్ బిగికౌఁగిలింతలం
దెంతయు మేనులొక్కటని యెంచుట లింపుఁగఁ దోఁచెఁ గాముని
సంతతి కెంతసంతస మొసంగ వసంతుఁ డటంచుఁబల్కినన్

వ॥ ఆసమయమందు.

సీ॥ కోనముక్కున సగంబు కోతికి కాంతుఁడొసంగు
ఫలముపొత్తున నెక్కి యలరుఁ జిలుక
కలికిమచ్చిక మెచ్చి కమ్మ కెంజివు రిచ్చి
ముదము నొందెడు మేల్మి నోదవు పికము
తలపురా విరితేనె వలపు తీరఁగఁగ్రోలి
చెలికారమును బెంచు కులమధుపము
మేలెంచి నళినీమృణాలముల్ ముద్దుగాఁ
జెలికిచ్చి పొంగు రాజీవహంస

గీ॥ కలసిమెలసి విహారముల్ కులుకునీటుఁ
బక్షులన్నియు నొక్కట వైభవమున
మన్మథుని యుత్సవంబుల మనసులుంచి
తనరుటలు చూచి యుభయులు తత్క్షణంబ.

చ॥ మనములు తొందరింపఁ జనుమానము మానము హెచ్చరింప నూ
తనముగ రమ్యవర్తనము తళ్కొసగంగ ముఖంబు మోముకొం
తిని హృదయంబు మానసముతీరను భావ ముదారభావముల్
గొనఁగ రమింప స్వాత్మలను గోరిక లీరికలెత్త నెమ్మినై.

చ॥ ఇటువలెఁ బార్వతీసతి మహేశ్వరసంగతిఁ గ్రీడసల్ప ను
న్నటు నొకచోట మేను లెనయంగ మొగంబు మొగంబు నిక్కనొ
క్కటి యయి తోకతోక పెనయంగ నెదుర్కొని క్రీడచేయు మ
ర్కటమిథునంబు మన్మథసుఖస్థితి దృష్టికి గోచరించినన్

ఉ॥ తగ్గనిసిగ్గునన్ బురవిదారి ముఖాబ్జము తేఱి చూడలే
కగ్గిరికన్య యున్న తెఱఁ గాతఁడెఱింగి లతాంగి మంచిదే
యిగ్గతిఁ గూడి క్రీడ ఘటియింతము రమ్మని మర్కటాకృతిన్
దగ్గఱి మేల్మి బంగరు కటారి వజీరుని కేళిఁ దేలఁగన్

ఉ॥ తెల్లనివేల్పు తేజమును దేవి ధరించుట కోపలేక మే
నెల్లఁ జెమర్ప శంకర! మహేశ్వర! దీని ధరింపఁజాల నీ
యుల్లమునందు నెంచి మఱి యొండొకచోటను నుంపుమన్న నే
మెల్లన నవ్వి భూమిపయి మేల్మినొసంగె నమోఘ వీర్యమున్

కం॥ దశశత వత్సరములు భూ
మి శివోదిత తేజ మాక్రమించి ధరింపన్
వశ గాక దీనదశతోఁ
గృశితోన్నతి నేగుదెంచి యీశ్వరుఁబలికెన్.

మత్తకోకిల:—ఏడు శైలము లేడువారిధు లేడుదీవులు మోసినన్
వాడు చెందనినాకు దేవరవారితేజము తాల్పఁగాఁ
గూడకున్నది వానికంటెను ఘోరమైనది దీని నీ
వేడనైనను నిల్పవే పరమేశ! మ్రొక్కెద నావుడున్

ఉ॥ భూమికి దుర్భరంబయిన భూరిమయంబగు తేజ మొక్కటన్
నేమమునై భరింపుమని నిశ్చలతన్ శివుఁడన్న నగ్నియున్
బ్రేమమునై దఱిన్నిలిచి వీడక తాలిచి తానుగూడ ను
ద్దామము వీర్యమున్ సరిగఁ దాల్పఁగ లేక కలంగియిట్లనున్.

ఉ॥ ఈశ్వర! నీదు తేజము సహింపఁగజాల వహింపవే యనన్
విశ్వహితేచ్ఛ దానిగొని వేయిసమల్ భరియించి పిమ్మటన్
శాశ్వత సత్త్వసంపదఁ బ్రశస్తికి నెక్కిన గాడ్పుఁబిల్చి గౌ
రీశ్వరుఁ డమ్మహాబలున కిచ్చె భరింపుమటంచుఁ దేజమున్.

కం॥ ఆ వాయువు వేయేడులు
శైవంబగు తేజమూని చరియించి జగ
త్పావన కంజన కిచ్చిన
నావరమున నితనిఁగనియె నన మఱిఁ బలికెన్.

తా॥ పరమేశ్వరుండు పార్వతీదేవితోఁ గూడి సంచరించుచు శ్రీ వేంకటాచలమునకు విచ్చేసెను. ఆ సమయము వసంతకాలము; నానాప్రాణులును మన్మథోన్నతిని బూని యున్నారు. చిలుక ప్రియురాలికి పండినపండు సగముకొఱికి యిచ్చుచున్నది. కోవిల నెచ్చెలికిఁ గ్రొంజివురు సగము మెక్కి యొసంగుచున్నయది. తుమ్మెద పూఁదేనె తానుద్రావియే తనయింతికి విందొసంగుచున్నయది. రాజహంస తామరపుష్పములు కైసేసియే పొలతికి సమర్పించుచున్నయది. పార్వతీపరమేశ్వరులు నొకరినొకరు నన్యోన్యమనురాగమునన్ గనుంగొనుచు వలపులోనే మునింగి తేలుచుండిరి. అంత మర్కటమిథునము రతిచేయుచుండుటను గనుంగొని తామును మర్కటరూపములుధరించి సురతానంద సుఖమును జూరఁగొనిరి. అంతఁ బార్వతి గర్భమును ధరించినది. ఆ మహాతేజమును బార్వతి భరింపలేక యున్న శివుండు భూమిపయి నునిచెను. పుడమియును దాల్ప శక్యముగాక భయమందుచున్న శంకరుండవ్వీర్యమ్ము నగ్నియం దునిచె. ఆ యగ్నిహోత్రమ్మునున్ దత్తేజమున్ సహింపలేమి నంత మృత్యుంజయుండు వాయువునందు

ఆ వాయువును వేయిసంవత్సరములు మోసి పిమ్మట నంజనీదేవి కొసంగెననిచెప్పి నంతనే యంజనీదేవి వృత్తాం తెల్పుమని యడుగుటయును.

ఓవిమలాత్మ! వేయిసమ లోపికఁ దాలిచి వాయుదేవు డ
ద్దేవుని తేజ మంజనకుఁ దెచ్చి యొసంగిన దేమి? యంజనా
దేవి యనంగ నెవ్వనిసతీమణి? యెవ్వనికూతు? రామె యా
పావనుఁ డుద్భవింపఁ గల భాగ్యము కల్గుట లేమి తెల్పవే!

తా॥ వాయుదేవుఁడు వేయిసంవత్సరములు తన్మహావీర్య ఎట్లు ధరించెను? పిమ్మట అంజనాదేవి కిచ్చుటకుఁ గతం అంజనాదేవి యెవ్వరు? ఎవ్వరికూతురు? ఎవ్వని భార్యయో మని యడిగినంతనే యిట్లు చెప్పఁదొడంగె

పూర్వమునన్ సుపర్వగిరి భూమి నశేష విశేష శేముషీ
ర్విభుఁ డుగ్ర వైరికరి కేసరి కేసరి నా జటీశ్వరా
ర్వచన ప్రబుద్ధ శుభ శీలుఁడు వానరపాలుఁ డొప్పుఁద
న్ర్వదివేలు పర్వతమునందలి వానరు లాశ్రయింపఁగాన్

ఘన్ దేజము భాగ్యమును గలిమియున్ బ్రాయంబు, బ్రాభత్వమున్
గాఁ డయ్యును బ్రహ్మచర్యనియతిన్ గాఢప్రభావోన్నతిన్
ఁచ్ఛా విషయాభిమాన మద హింసా దైన్య శూన్యాత్ముఁడై
న్ ఘోరతపం బతండు జివిమ చైత్రేశ్వరాధిత్యకన్

మదమ సత్య శౌచము లెసంగ వహించితి బ్రహ్మచర్య మిం
ముదముతో గృహస్థవిధిఁ గైకొన మంచు సురల్ హితోపదే
మొసఁగి పోవ నంత నిజచారు గుణాన్వయశీల కానుకూ
ముగల కన్యఁ గైకొనఁ దలంచి పరామరిశించుచున్నెడన్

తా॥ పూర్వము మహామునుల యాశీర్వాద ప్రభావమున బలశాలియగు కేసరియను వానరోత్తముఁ డొకఁడుం

డెను. అతండు వానరులు పదివేవురు తన్ను సేవించుచుండ నమిత తేజముతోఁ విరాజిల్లుచు బ్రహ్మచర్యవ్రతమునం దెంతయు మఱి మంచి నియమముతోఁ జాలకాలము తపంబొన రించి ఫలసిద్ధినిగాంచెను. ఇట్లు తపస్సిద్ధిని గైకొని యుండియును బ్రహ్మచర్యమునే యవలంబించియున్న కేసరిని సురలు కనుం గొని వివాహముచేసికొనుటకుఁ బ్రోత్సాహమును గలిగించిరి. ఆ కేసరియును తన కనురూపయగు సతిని వివాహము చేసికొను టకై ప్రయత్నము చేయుచున్నంత, నంతలో

సీ॥ మచ్చ పొందని చందమామయో పగలును గాంతిని వీడని కలువపూవొ?
మలినంబు కాంచని మణియద్దమో? మేను చెక్కు చెదరనట్టి చిగురుటాకొ?
మొనలు విచ్చనియట్టి మొల్లమొగ్గయొ? మన్ను వంకయుఁ గాంగని సంపెసవరొ
తావియే వీడని పూవుబంతులో? వెచ్చ కైకొనసట్టి బంగరు తునకయొ?

గీ॥ యనఁగ నవయవసౌష్ఠవంబినుమడించి యలరుచుండఁగ నొకకన్నె వెలయఁజేసి
బ్రహ్మదేవుం డహల్యయ న్పడతిఁదెచ్చి గౌతమమునీంద్రునకునిచ్చెఁగౌతుక
(మున

సీ॥ గౌతమమౌనియుఁ గౌతూహలమ్మునై భార్య నహల్యను బహువిధముల
సంతోషమొనరించి సంతృప్తిఁగైకొని యున్నంత సంసార యోగఫలము
నందనుండును శతానందుఁ డుద్భవమయ్యె నంజనాదేవియు నయ్యెఁ బుత్రి
ముద్దులు ముచ్చటల్ మునుకొని పొందిరి సంతానములయందు సంతతంబు

ఆ॥ ఇట్లు కొంతకాల మేగిన యోగియు యోగనిష్ఠఁ బూనియున్నవాఁడు
పొలతి శ్రీయహల్య పుత్రిపుత్రికలను బెంచుచుండె నెంతొ ప్రీతితోడ

వ॥ ఇట్లుండ

సీ॥ శ్రీరామచంద్రావతారానుసంగతిఁ దత్కాలనిరూపముతో తలఁచితలఁచి
దేవతలాయాయి తీరులు దారులు కైకొనియుండిరి కరము ముదము
గాంచుచునుండిరి ఘనమౌనివర్యులు దేవేంద్రుఁడును మహాదివ్యదృష్టిఁ
గనుకొని యాద్యంతమును భవిష్యత్తును సూక్ష్మి నందునకు నుద్యుక్తుఁడగుచు

గీ॥ శ్రీయహల్య యెందును నివసించియుండె; నచ్చటికి మెల్లమెల్లన నరిగియరిగి యల్లనల్లన దిరుగాడి యుల్లమలర; మదనవశుఁ జిక్కె నిక శతమఁఖుడు (నయ్యు

క॥ దేవేంద్రుని సంగతిచే
దేవి కహల్యకును సుతుఁడు దివ్యుఁడు పుట్టెన్
శ్రీవాలి యనెడి నామము
చే విలసిల్లెను బలప్రసిద్ధుం డతఁడున్

సీ॥ సకలకర్మలకును సాక్షియై యంతట నిండియుండినయట్టి చండకరుఁడు
తామసగుణ మంత దగ్ధరిల్లఁగఁజేసి తేజ మెల్లెడ నింపు దివ్యగుణుఁడు
అఖిల జంతువులకు నత్యంతసమ్మోద మొనరించుచున్నట్టి ఘనబుధుండు
స్వప్రతిభను నింపి జగమునయం దతి శక్తిని బ్రకటించు సాధువరుఁడు

గీ॥ లోకబాంధవుండును మదిలోఁ దలంచి
విష్ణుమూర్తి శ్రీరాముఁడై వెలయుననుచు
నందుఁడాను ముందంజ నొందవలయు
ననుచుఁదెలసియె తత్కాలమునకు మొనసి

క॥ గౌతమ మున్యాశ్రమును
గౌతుకమునఁ జేరి మౌనికాంత నహల్యన్
జేతము మెచ్చఁగఁ గనుగొని
నీతిని దలపోయఁ డేమి నేర్పొ? తీర్పో?

క॥ సూర్యునిసంపర్కంబున
సూర్యనిభుఁ డహల్యయందు సుతుఁ డుదయించెన్
శౌర్యనిధి మహామహుఁ డని
వార్యనయబలుండు జ్ఞానవంతుఁడు నంతన్

క॥ మునుకొని యీ బాలునిఁ గ
న్గొని సుగ్రీవుం డనుచు వినోదముతోడన్
జనులందు రంద ఱెల్లెడ
వినయ విధేయములు గలుగు వీరుం డగుటన్

వ॥ అంత

తా॥ బ్రహ్మదేవుండు మిక్కిలి సౌందర్యవతియగు నొక్కస్త్రీని సృష్టించి యహల్య యను నామంబిడి గౌతమమునీశ్వరున కిచ్చెను. గౌతమమహాముని యహల్యతో సంసారము చేయుచుండఁగా శతానందుం డను పుత్త్రుండును అంజనాదేవి యను పుత్త్రికయును బుట్టినారు. అంత గౌతమముని యోగనిష్ఠను గైకొని యుండెను. కొంతకాలమునకు శ్రీరామచంద్రుని యవతారమును, ఆయవతారమునం దనుకూలముగ దేవతలందఱు నాయా సమయములయందు జనించుచుండుటయును దన యాత్మలో దేవేంద్రుండు తెలిసికొనినవాఁడై కాలమునకు లోఁబడి యహల్యను గామించియుండెను. దేవేంద్రునివల్ల నహల్యకు నొకకుమారుండు కలిగెను. వీనిపేరు వాలి యని యందురు.

అన్నికర్మలకు సాక్షియై చీకటులు పోగొట్టి యెల్లెడ వెలుతురును కలిగించు సూర్యభగవానులు కూడ, విష్ణుమూర్తి శ్రీరాముఁడుగా నవతరించుననని తెలిసికొని కాలమునకు వశుండై యహల్యను గూడి యెంతయును సంతోషించె. సూర్యునివరమువల్ల నహల్యకు సుగ్రీవుం డను సుపుత్త్రుండు కలిగె. ఇతఁడు మిక్కిలి వినయ విధేయతలు గలవాఁడును బలపరాక్రమములు గలవాఁడును నయియుండెను.

అంత.

చ॥ వనజభవుం డహల్యకగు వైఖరినిన్ దలపోసి చూచి పా
వన వనితామణిన్ దురితభావము ముంగొని కూడియున్న దే
మని యనువాఁడ? దైవకృత మయ్యది మార్పఁగలేను నేను నిం
కను సుఖమున్ గొనంగఁ దగుకాలము వచ్చుత నెట్టులేనియున్

తా॥ బ్రహ్మదేవుం డహల్యకుంగలిగిన వాలి సుగ్రీవులను గనుంగొని కాలవశము తప్పింపరాదు. ఇంక ముందైనను అహల్యకు మంచిరోజులు వచ్చుంగాక యనుచుం దలపోయుచు నుండెను. అంతలోన.

ఉ॥ గౌతమమౌని యోగమును గైకొను నిష్ఠను వీడునంతనే
చేతము తొందరించుటను శీఘ్రమె యంజన తండ్రితోడ నీ
రీతియు నంతయుణ్ దెలిపెం బ్రీతియు భీతియు తెల్పంగాదు వి
ఖ్యాతము బాల్యవర్తనము కల్ల నిజంబును దాప దింతయేణ్.

ఉ॥ మౌనియు దేవనాథు నసమాన మహోగ్రత నెంచి యెంచి యెం
దేనియు నిట్టి పాపి కలండే? కులదేవిని నీట ముంచునే?
పూనిక చేతం జేసె నిటం బోవునె? చేసినకర్మ వేయి యో
యోనులు వీనికంచు నభియోగముచేసి శపించె నింద్రునిణ్.

వ॥ మఱియును బదంపడి

ఉ॥ కాతరభావమూని మదిం గైకొని కోపము ఘోరరూపుండై
నీతివిహీనతణ్ గరము నేర్పును బూని యహల్య నిట్టులణ్
జేతనుబట్టి యుంటి వెటు చేటగునంచుం దలంపవైతి? వీ
పాతకముణ్ గ్రహింపు మిటం బాయదు నిన్నెపుడేని భాస్కరా!

ఉ॥ రాహువు కేతువుణ్ గినుకం గ్రౌర్యమునొంది క్రమక్రమంబుగా
సాహసమూని నిన్నొకటం జక్కంగ మెక్కుచు నుందు రెప్పుడుణ్
మోహము వట్టి పోవునొకో? మోసముచేయును దర్భలందు నీ
బాహులు కుంగునంచు ముని పట్టి శపించె రవిణ్ ౹౹

క॥ ఆశాపము విని సూర్యుండు
స్వాశాభంగమ్ము కలిగి యతితాపమునణ్
నాశంబు కలిగె నని ముని
పాశయమును దెల్పి యిట్లు ప్రార్థించె మొగిణ్

తా॥ గౌతమముని యోగమునుండి లేచిన వెంటనే తత్పుత్రిక యంజనాదేవి తండ్రితో నీయింద్రభాస్కర వృత్తాంత మంతయును జెప్పుటయును వెంటనే గౌతముండు మిక్కిలి కోపించి యింద్రునిని వేయియోనులుగల వానినిగా శపించి వేగమే సూర్యునిఁగూడఁబ్రతియమావాస్యయందును రాహువును గేతువును క్రమక్రమముగా నిన్ను మ్రింగుచుందు రని శపించెను. ఈ శాపము వినినయంతనే భయపడి సూర్యుండిట్లు గౌతమమునిని బ్రార్థించెను.

ఉ॥ గౌతమమౌనివర్య ! ననుఁ గామము మోహమునందు ముంచుటన్
నీతిని వీడి నీదుసతినిన్ గమకించితి క్షుద్రబుద్ధినై
బాతక మావహిల్లినది పాపము శాపము క్రమ్మరింపఁగాఁ
జేతమునందు నిన్నెపుడు సిద్ధిగనుంతు ననంగ మౌనియున్

ఉ॥ కామముఁ గ్రమ్మఱించుటకుఁగా నిఁక నీకును నెంతశక్తిరో
తామసమైన శాపమును దార్పఁగ నాకును నంతశక్తియే
నేమము చేయుదున్ వినుము నిష్ఠను బర్వములందు నెప్పుడో
మామక శాపపద్ధతి క్రమంబుగ వచ్చుచునుండు భాస్కరా !

క॥ అనవిని సూర్యుం డంతనె
చనె దేవేంద్రుండు వచ్చి సంయమిపదముల్
గొని మన్నింపుము శాపం
బును ద్రిప్పుము కినుక విడుము ప్రోవుము మౌనీ !

మ॥ అని ప్రార్థింపఁగ గౌతమీంద్రుఁడు సురేంద్రా! నాదు శాపంబునన్
విను మేనైన మఱెవ్వరైన మఱలన్ వెన్పుట చేయంగలే
మని నీవెంచుము కాని నేనొకటి యిట్లందున్ దగన్ యోనులె
కనిపించున్ గన నీకుఁ గన్నులయియే కన్పించు లోకాళికిన్

క॥ అన సంతసించి యింద్రుఁడు
చనె స్వారాజ్యంబు లోకసమ్మతి యయ్యెన్
మును కొని పశ్చాత్తాప
మ్మును జెందుట కొంత మేలు మాధాత్ములకేన్

ఓ గౌతమమహామునీంద్రా! నేను గామమోహితుఁడనై నీకు మహాపకారముచేసితిని. నన్ను రక్షింపుము. శాపమును తగ్గింపుము. అని సూర్యుండు ప్రార్థించినంతనే గౌతముఁడు ఓభాస్కరా! నీవు కామమోహితుఁడవైన రీతినే నేనును దమోమోహితుఁడనైనాను. అయినను నా శాపము నేను మరల్పలేను. గాని యొక యుపాయమును దెల్పెదను వినుము. ఈ శాపము నీకుఁ బ్రతియమావాస్యయందును రాదు. పర్వములందుమాత్ర మెప్పుడో యొక్కప్పుడు వచ్చుచుండు నని యనుగ్రహించి శాపమును గొంతతగ్గించెను. పిమ్మట దేవేంద్రుండు గౌతమమునీంద్రునకు మ్రొక్కి యోసంయమీంద్రా! నేనును నజ్ఞానవశంబునఁ జేసిన లోపమును క్షమించి శాపమును మరలింపుమని ప్రార్థించెను. గౌతమముని కొంత శాంతించి యో దేవనాథా! నా శాపమును నేను గాని మఱి యెవ్వరునుగాని మరల్పలేరు. ఒకసంగతిని జెప్పెదను వినుము. నీ శరీరము నీకు మాత్రము యోనులుగాఁ గనపించుచుండును. లోకులకుఁ గన్నులవలె నగుపడుచుండు నని పలికినంతనే దేవేంద్రుండు నిజలోకమ్మున కరిగె. సూర్యుండును స్వస్థానంబును జేరియుండె. తప్పు చేసిన వెనుకఁ బశ్చాత్తాపమును బొంది యున్నను గోరంత మేలుకదా!

వ॥ అంత గౌతమమునీంద్రుం డిట్లు చింతించుచు,

సీ॥ సామాన్యముగ నుండఁజాలక యీఘన యోగనిష్ఠను నేను నొందు టేల ?
దేవేంద్రుఁ డిద్దాని భావించి చెచ్చెఱ దురితమౌ మార్గమ్ముఁ ద్రొక్క నేల ?
సూర్యుండు దివ్యమౌ చూపును నొందక కీడునొందఁగఁ గ్రిందు మాడ నేల ?
ముందు వెన్కలనైన మూచూడ కీరీతి నొరులను దూషించుచుండు టేల ?

గీ॥ మునులయందు దపకీర్తిని గొనితి నేమి
చేయువాఁడను ? బాపంబు వాయు టెట్లు ?
మును గనుంగొన నూయిగుయు వెనుక గోయి
యనఁగ నయ్యెను నాబ్రతు కక్కటకట !

ఉ॥ భానుఁడు నింద్రుఁడుం బరమ పావన మూర్తులు బ్రహ్మభావ వి
జ్ఞానులు ధర్మవర్తనులు గౌరవముం విడనాడి నింద్యులై
మానము నిల్పలేక యవమానము నొందిరి మన్మథార్తులై
మానక నాదుభార్యయును మాయనుమున్గె నికేమి చేయుదుం ?

శా॥ నాకుం గల్గిరి పుత్రి యంజన, శతానందుండు పుత్రుండు స
త్సోకపత్నిఁ నహల్యయం దెటులు పెంతుం వీరి దుష్టాత్మకుం
వీకం నైచుట యెట్లు ? నింద కలిగెం వే తేల యానందము స
ద్రేకంబూని శపించె ఱాయిగను నార్తిం దా నహల్యాసతిం

శా॥ అంతం జింతనుమున్గి యెంతయు నహల్యాకాంత ప్రాణేశ్వరుం
జెంతం జేరి సహింపు మస్మదఘముం జిత్తంబునం జేర్చి యీ
వంతం వీడఁగ దారిఁ జూపుమని సంప్రార్థించినం మౌని శా
పాంతంబుం రఘురామపాద గతిచే నౌనంచు శాసించినం

క॥ పతిపాదములకు మ్రొక్కుచు
సతియు నహల్యాంబ యంతఁ జట్రాయిగ నా
కృతి నొందె గౌతముండును
వెతచే దుఃఖించుచుండె వేమఱు నాత్మం

తా॥ పిమ్మట గౌతమమునీంద్రుం డిట్లు చింతించుచుండెం. నేను సామాన్యముగా నుండక యీ మహాయోగమును బూను టెందుకు? దేవేంద్రుఁడును సూర్యుండును దుష్కృత్యము చేయు

ఱెందుకు? నేను వారిని శపించు టెందుకు? అయ్యో! సూర్యుఁడు దేవేంద్రుఁడు మంచి ధర్మాత్ములు, మిక్కిలి పుణ్యవంతులు. వారు కాలవశమున దురితము చేసినారు. నాకు లేక లేక శతానందుఁడు కలిగినాఁడు. అంజన పుత్త్రిక యైనది. వీరు మిక్కిలి పసి పిల్లలు. వీరిని నేను పెంచుట యెట్లు? ఈ పాపముచేసిన భార్యను గృహమున నుంచుకొనుట యెట్లు? అని విచారించి కోపమును వహించి తనభార్యయందు లోపముండుటనుబట్టి "నీవు శిలవై పడియుండుమని శపించెను" అంత అహల్య ప్రాణనాథునిఁ గని నమస్కరించి యజ్ఞాన వశంబునఁ జేసిన తప్పు మన్నించి నన్నురక్షించి నా శాపము నివారించు పద్ధతి సెలవిండని ప్రార్థించెను. అది చూచి గౌతమమునినాథుం డొక్కింత జాలిగొనిన వాఁడై శ్రీరామచంద్రుని పాదములు తగిలినప్పుడు నీవు శాపమునుండి విముక్తురాల వగుదువని చెప్పెను. వెంటనే యహల్య శిలాకారము నొందినది. గౌతముఁడు దుఃఖించుచుండెను.

సీ॥ అంజన కొంచెమే నాఁచక మానితో నున్న దంతయుఁ జెప్పియుండుటయును
మునియు నొక్కింతేని మనమునఁ దలఁపక కోపదైవమ్మనే కోరుటయును
దివ్యప్రభావుఁడౌ దేవేంద్రునకు యోని కలితముల్ దృష్టులు కల్గుటయును
పావనమూర్తియౌ భాస్కరునకు రాహుకేతువుల్ శత్రులై కెరలుటయును

గీ॥ వాయిలేక యహల్య చటాగ్రి యగుట చూచిచూచి యట్లూరక మూఢలేక
తప్పు లొప్పుల నైనను దలఁపుఁగొనక, అంజనను శపించెను గిన్కనంది వాలి.

ఉ॥ నీవు సహింపు లేక యిటు నెమ్మది దుఃఖమునందు ముంచి యు
న్నావు రవిప్రముఖ్యులను. నాతివి కా వికఁ గోతి నాతివై
భావమునందుఁ గ్లేశమునె పైపయి నొందుచు నుందు వెందు నీ
జీవిత మంత చీకనుచుఁ జెచ్చెటఁ బల్కెను గోపరూపుఁడై.

ఉ॥ ఇట్టులు వాలి శాపమును నెక్కువ కిన్క నొసంగఁ దాను నిం
కెట్టులు సైపవచ్చు? నని యెంతయు వంతను మున్గియున్నఁ దా
నట్టులె చూచి యంజనను "నమ్మ భయంబ దియేలనమ్మ! నే
నెట్టులొ కాచియుండెదను నెప్పుడుఁ గంటికి ఱెప్పగాను నినున్."

మ॥ అని సుగ్రీవుఁడు వల్క నంజన మనంబం దంత సంతాపమున్
గొన కేమైనను గాని సమ్మతమె నాకున్ బొమ్మటం చుండి వా
లిని నీచుండవు కమ్మటంచుఁ బలికెన్ లేశంబునున్ గాంచకా
త్మను నొక్కింతయు నోర్వలే గోరులు శాంతంబేది నిందించినన్

తా॥ అంజనాదేవి కొంచెమైనను సంశయింపక గౌతమ మునితోఁ జెప్పుటయును, వాని మనసునందు మిక్కిలి కోపించుటయును, దేవేంద్రునకుఁ గలిగిన పరాభవమును, సూర్యునకుఁ గల్గిన కష్టమును, అహల్య చట్రాయియై పడియుండుటయును, దలంచుకొని మిక్కిలి దుఃఖించి వాలి యంజనాదేవిని "నీవు కోతివి కమ్మని" శపించెను. శాపమునకు భయపడి దుఃఖించుచున్న యంజనను సుగ్రీవుం డూరడించి నిన్నుఁ గాపాడుచుండుటకు నేను పూనుకొన్నాను. నీకేమియును భయము లేదని యోదార్చెను. అంజనాదేవి యొక్కింత సంశయంబును వదలి వాలిని నీచుఁడ వగుదువని నిందించెను. ఇట్టి నిందను ఎవ్వరును సహింపలేరు.

సీ॥ అంత గౌతమముని యత్యంత దుఃఖంబు నొంది మానసమందుఁ గుందికుంది
భార్య నిందిత యయి పడియుంట సంతానమును జూచు దిక్కు లేకునికి వగచి
పావనమూర్తుల భాస్కరేంద్రుల నట్లు బాధించినట్టి భావంబు తెలసి
కోతిరూపంబునఁ గోమరితయుండుట స్వాత్మను దలపోసి యంతనంత

ఆ॥ తనదు తపమును గొంత సార్థకము చేసి, మౌనముద్రను ధరియించి మంత్రతంత్ర
యంత్రములు లేకయే యథార్థార్థమెల్లఁ దెలసియుండెఁ దపోభాగ్యకలన చేసి

వ॥ తనతనయఁగాంచి

శా॥ అమ్మా! యంజన! దుఃఖముఁ విడువుమమ్మా! నీవుఁ బ్రారబ్ధమా
నమ్మా! కొంత యదృష్టమున్నది సుమా! యాపూలము న్నాకు ని
క్కమ్మా నీచరితంబు తెల్లమయె నింకన్ నేను ధన్యుండఁ జి
త్తమ్మందుఁ బరమేశ్వరిన్ గొనుము సార్థంబౌను నీపుట్టువున్

ఉ॥ గౌరియు శంకరుండుఁ దిరిజగన్నుతమూర్తులు వేంకటాద్రిపైఁ
జేరి స్మరాప్తి వానరతఁ జెంది సుఖింపఁగ వీర్య మొందఁగా
నేరమి గౌరిఁ గాంచి భువినిన్ విడిచెన్ క్షితి మోయలేమిచే
నేరిమి నగ్నిపై నిలిపె నెమ్మిని వహ్నియుఁ బూనకుండినన్

సీ॥ శంకరుం డావీర్య మింకవాయువుఁ జేర్చె ననిలంబు మోయలేకునికి కునికి
గాలి పాటుల నెల్లఁ గాంచితి వీవు సుకన్య విద్యాధరకన్య వగుచు
హాస్యంబుచేసితి వంత గౌరియు నిన్నుఁ గోపించి యోకన్నె! కోతివగుచు
నీ వీర్యమును మోయు మీవేడ్క నని శపించెను దాన నీరూపు సిద్ధమయ్యె

గీ॥ నీవు తగినట్టి వరుని మన్నింపుమమ్మ, నెమ్మి నీదుకోరిక సఫలమ్ముగాంచు
ననిన నంజన తండ్రిని నభినుతించె, గౌతముండును బొందెను గౌతుకమ్ము.

తా॥ పిమ్మట గౌతమమహాముని నిజకాంత నిందితయై పడియుండుటయును, సూర్యునిని దేవేంద్రునిని శపించుటయును, దన కొమరితకుఁ గోతిరూపము వచ్చుటకును మిక్కిలి విచారించి తపోమహిమచే నొక్కింత మనోనిగ్రహముచేసి సర్వంబును దెలిసికొని పుత్త్రికన్ జూచి నీ పూర్వకర్మ ఫలమువల్ల నీకీ కష్టము సంప్రాప్తించినది. కాని మేలునే పొందఁగలవు. పరమేశ్వరిని బ్రార్థించుచుండుము. పూర్వము గౌరియు శంకరుండును వేంకటాద్రిమీద విహరించుచుఁ గోతుబరూపములు ధరించినారు. పార్వతి శివవీర్యమును మోయఁజాలకున్న నుగ్రుం డది భూమిమీద నుంచెను. పుడమియును మోయ లేకుండుటను

గాంచి యగ్నిహోత్రమందుంచెను. అగ్నికూడ నీశ్వర తేజమును భరింపలేకుండుటను గమనించి హరుం డవ్వీర్యమ్ము వాయువు నందు నిలిపె. వాయుదేవుండును మోయుటను శక్తుండుగాక బాధపడుచున్న సమయములో నీ వొక విద్యాధరునకుఁ బుత్త్రివి. సుకన్య యను పేరు గలదానవు. ఆ పవనునిఁ గనుంగొని నవ్వితివి. పిమ్మట ననిలుండును కోపించి యీ శంభు తేజమును నీవే కోతివై భరింపుమని నియమంబుచేసె. కావున నీకీ కోతిరూపము కలిగినది. పిమ్మట నీకు మంచి మేలే కలుగునని చెప్పఁగా నంజనాదేవి తండ్రిని కొనియాడెను. తండ్రియును మిక్కిలి సంతసించెను.

సీ॥ కుంజరుం డనువాఁడు కోరి సంతానంబు శివుఁగూర్చి తపము సేయుచున్న
వానితపమునకుఁ బశుపతి యుప్పొంగి పుత్త్రి లభ్యంబగుఁ బొమ్మటన్న
నెట్టకేలకు మది నిచ్చగించియె కుంజరుఁడు గృహంబును జేర రూఢిఁదవిలి
గౌతముఁ డంతటఁ జేత మల్లారింగఁ జని చూచి యచ్చట సాధువైన

గీ॥ వాని వానరుఁ గుంజరు వైభవమునఁ, గూడుకొని యున్న వానినిఁ గోర్కెఁ గాంచి
మంచిమాటలు చెప్పి సమంచితముగఁ, దనయఁ బంపుమటంచు వానికి నిచ్చె.

సీ॥ పేదవానికి మేల్మి పెన్నిధి కల్గిన ట్లానందమంది యత్యంతముగను
అంజనాకన్యను నౌరససుత కన్న మించినరీతిఁ బోషించుచుండ
అంత వివాహమ్మునందు సమయమౌటఁ గలఁగుచు స్వాత్మలోఁ గుంజరుండు
అందందుఁ దిరుగుచు నెందును ననుకూల వర్తనుం డగునట్టివాఁడు లేమి

గీ॥ మదిని బరితాపమును బొంది మలసిమలసి
మఱల నన్వేషణముచేయ మనసునుంచి
యొక్కయెడ సాధువర్తనుం డుత్తముండు
నగు నొకని వానరాధిపు ననుగమించి

క॥ కేసరి యనునామమునన్, వాసిని గన్నట్టివాని వైభవయుక్తన్
భాసుర గుణరూపముల వి లాసంబులు కలుగువాని లాలించి కడున్

సీ॥ బ్రహ్మదేవునకును బంధువు చేకూర్చి ముద్దు ముచ్చట లొందు ముఖ్యపుత్రి
ఆశ్రమమర్యాద లన్నింటి గుర్తించి సత్యంబు నెలకొల్పు జ్ఞానమూర్తి
సత్ప్రవర్తనమును సంపాదనము చేసి మేల్కొను చున్నట్టి మేల్మిమించు
సాధుసంఘములను జ్ఞానివర్గములను నతిథులఁ బోషించునట్టి పట్టి

గీ॥ నన్నుఁ బ్రేమించి యీ కన్నె మిన్నఁ గొనుము
మాకు మీకును శ్రేయం బుసహిమ మొందు
నీవు నేలుకోఁదగినట్టి నేర్పుగలది
కేసరీ ! నాదుతనయచేఁ గీర్తి గొనుము.

క॥ అని యంజనను గేసరి
కిని నిడి సమ్మోదమంది కేవలతృప్తిన్
గొనిచేసె వివాహమ్మును
మునుకొని దంపతులు ముద్దుముచ్చట లొందన్

తా॥ కుంజరుండను వానరుండు సంతానముకొఱకై శివునిగుఱించి తపంబొనరించె. శివుండు ప్రత్యక్షమై యొకకన్య లభ్యమగునని వరమిచ్చి యంతర్ధానమయ్యె. అంతట గౌతమ మునికుంజరునికొక్క యభిలాషను దెలిసికొని తన తనయ యగు నంజనను బుత్రికగాఁ బెంచుకొనుమని కుంజరున కొసంగె. కుంజరుండు సంతసించి యంజనను బెంచుచుండెను. వివాహ సమయమందు కుంజరుండు వరాన్వేషణము చేసిచేసి తుదకుఁ గేసరి యను వానరేంద్రునిం గని యనురూపదాంపత్యమని యెంచి వానితో ఈ యంజన బ్రహ్మదేవున కల్లారుముద్దుగాఁ బెరిగినది. అన్ని మర్యాదలు గుర్తెఱింగినది. అని యా కేసరి కిచ్చి యంజనను వివాహ మొనరించి సంతోషించుచుండె.

ఉ॥ అంతట గౌతముండు విని హర్షముతోడను గాంచి కేసరిన్
స్వాంతము పల్లవించినది యంజన నీవు పరిగ్రహించుటన్
జింతలు వాసిపోయినవి సిద్ధుడ వుత్తమభావమూర్తి వ
త్యంతము వృద్ధినొందుడని యాశ్రమభూమికి నేగె నిష్ఠమై.

తా॥ ఈ వృత్తాంతమును గౌతమముని విని సంతోషించి వచ్చిచూచి దంపతులను దీవించి నిజాశ్రమమునకుఁ దపమొనరించుటకై వెళ్లెను.

ఉ॥ కేసరి యంజనారమణి కేలును గైకొని భాగ్యమందు శ్రీ
కేసరి యంచు సంతసిలి వృత్తమునందు గభీరతన్ మహా
కేసరి యన్నిధర్మములఁ గేవల యోగ విధానమందు నా
కేసరి యౌ నటంచు నభివృద్ధి కరంబని పొంగె స్వాత్మలోన్

తా॥ కేసరి యంజనాదేవిని వివాహమై భాగ్యమందు లక్ష్మీదేవితో సమానురాలనియును, స్వభావమునందును గంభీరతయందును సింహముతోఁ బోలియున్నది యనియును, ధర్మములందును యోగాభ్యాసమునందును దనకు సమానమై యున్నదనియును, అభివృద్ధి కలిగించునదియనియును దన మనమునందు మిక్కిలి సంతోషించెను.

చ॥ అనుగుణ రూపవంతుఁడు మహాత్ముఁడు యోగ్యుఁడు బుద్ధిశాలి య
త్యనుపమ యోగమూర్తి యని యంజన కేసరినిన్ దలంచి నె
మ్మనమున మించి పొంగినది మానము మౌనము ; నీతి ప్రీతి సం
జననము సాధుభావమును జక్కఁగ నున్నవి మేలె పొందుచున్

తా॥ మంచిరూపము కలవాఁడనియు, మహాత్ముఁడనియు, యోగ్యుఁడనియు, బుద్ధిమంతుఁడనియు, మంచియోగియనియును గేసరినిఁ జూచి యంజన మిక్కిలి సంతోషించినది. మర్యాద

గుర్తెఱుంగుట, మౌనముగా నుండుట, ధర్మము తెలుసుకొనుట, ప్రేమించుట, మంచితనము మంచి యభిప్రాయము కలుగుట ఇవి మేలునే కలిగించును.

సీ॥ అనుకూలరాలైన యిల్లాలు కల్గుటకంటె భాగ్యమేమని యెంచు భర్త మదిని
బహుయోగ్యుఁడయినట్టి భర్త కల్గుటకంటె సౌభాగ్యమేమని సతి తలంచు
చక్కనిరూపంబు సరస సంభాషణ కల యింతి కల్గుట బలిమి పతికి
మంచివర్తనమును మధురవాగ్జాలంబు కల భర్త దొరకుట కలిమి సతికి

గీ॥ దంపతులకుఁ గేసరికిని ధర్మమునకు, అంజనాదేవికిని రత్నహారమునకు
తగినరీతిని సమకూర్చె ధాత వ్రాత మేల్మి బంగారునకుఁ దావి మిసిమివలెను.

తా॥ తగిన యిల్లాలుకల్గుట భర్తకు మహాభాగ్యము. మంచి భర్త కలుగుట భార్యకు మిక్కిలి సౌభాగ్యము. చక్కని యాకారము సరసముగా మాటలాడుట నేర్చిన సతి భర్తకు మంచి నిండు. మంచినడత మధురముగా మాటలాడుట నేర్చిన పెనిమిటి భార్యకు మంచిసంపద.

మన కేసరికిని అంజనాదేవికిని ధర్మమునకు రత్నహార మునకు వలె, బంగారునకును పరిమళమునకునువలె దాంపత్యము చక్కఁగా దిద్ది తీర్చి బ్రహ్మదేవుండు సమకూర్చి వ్రాసినాఁడు.

సీ॥ సంసార కల్పవృక్షమునందు సంతాన ఫలము పండుట మహాభాగ్యమనియుం
పితృ మాతృ సేవ వివేకంబుతోఁ జేయ సంతు కల్గుట గొప్పసంపదనియుం
పేరు ప్రతిష్ఠలు తీరుగా నెలకొల్పఁ బిల్లలుండుట మంచివృద్ధి యనియుం
ధర్మంబు స్థిరముగాఁ దనరింపఁజేయుట కాత్మజుల్ కరము ముఖ్యంబటంచు

గీ॥ నంజనయుఁ గేసరియుమనమ్మందుఁ దలఁచి, తమకుసంతానమునుగోరితగినరీతి
ధర్మకార్యముల్ నోములు తపము జపము, చేయుచుండిరి సంతతశ్రేయముగను.

తా॥ సంసార కల్పవృక్షమునకు మంచిపండు సంతానము. తల్లిదండ్రుల కుపచారము సంతువల్లనే కల్గును. పేరు ప్రతిష్ఠలు పిల్లలవల్లనే కల్గును. పిల్లలున్నవారికే శాశ్వతధర్మము నెరవేరును కావున సంతానముకల్గుట ముఖ్యమని తలంచి, కేసరియును అంజనాదేవియును; నోములు తపములు జపములు దానములు ధర్మములు చేయుచున్నారు. పుణ్యకార్యములు చేయుట మిక్కిలి శ్రేయస్కరముకదా!

సీ॥ ఫల దానము లొనర్తు రెలమిఁ గోర్కె ఫలించు ననియెంచి తపసిముత్తైదువులకు
వృద్ధోపసేవ గావింతు "రిష్టావాప్తి ర స్తను" దీవన లభిలషించి
ద్విజదంపతులఁ బార్వతీమహేశ్వరులంచు సతతంబు గొల్తు రీప్సితము వెలయ
పరితాప మణగింపఁ బాంథుల యుదరముల్ నింపుదు రన్నపానీయములను
తే॥ ధనకనకవస్తు వాహన ధాన్యకన్య కాది బహుదానముల్ సేసి యభిమతార్థ
సిద్ధికై సేయఁగా వలసినవియెల్లఁజేసి రంజనయును భక్తిఁ గేసరియును.

సీ॥ జలధికట్ట వినాయకుల సూర్యచంద్రుల వరలక్ష్మి నలమార్గశిరము లక్ష్మి
కలగౌరి నుత్తరాగౌరి సాంవత్సర గౌరిని బదియారుగౌరిఁ బసుపు
పట్టి మహాగౌరి నిట్టుప్పగౌరిఁ దంగేటిగౌరిని జల్లకూటిగౌరి
సావిత్రిగౌరిని జల్దిగౌరిఁ గరళ్ళగౌరి నయ్యాదిత్యగౌరిఁ గూర్చి
గీ॥ నోచె నివి మున్నుగాఁగ మున్నూటియీద నలువది వ్రతంబు లాత్మజాతాభిలాష
నంజనాదేవి యెవ్వ రే మాచరింపు; మనిరో యవియెల్లఁ దోడ్తోడ నాచరించె.

క॥ ఆకైన దెల్లఁ బత్తిరి
యేకడ రాయైన దెల్ల నీశ్వరుఁ డనుచున్
జేకొని భక్తి భజింపుదు
రా కపిదంపతులు నియమమందుచు నెమ్మిన్

సీ॥ తార్కాణమనుచు పెద్దలచేత శకునముల్ కొనకొని చూపించి కొన్ని నాళ్ళు
ప్రతివారముల నుపవాసవ్రతిపూని యిడి దానిఁ గోరియాకర్షించికొన్ని నాళ్లు
తెలియఁ బ్రాణాచారములఁ బ్రాప్తమని దైవసన్నిధి శయనించికొన్ని నాళ్లు
ఋషులదీవెన లెంచియెదురుచూచి దినంబులెన్ని యూఅటఁజెంది కొన్ని నాళ్లు
గీ॥ కడగి యూరక చనుచున్న కాలగతికి ఖిన్నమతితోడ విన్నవైయున్న వేళ
ధర్మదేవతవారిపైఁ గూర్మికలిగి యాత్మజోదయ మెఱుక సేయఁగఁ దలచి

తా॥ మునికాంతలకుఁ బసుపు దానము చేయుచు, వృద్ధులను సేవించుచు, దంపతులను గౌరీశంకరులనుగాఁ బూజించుచు, బహుంబీదజనులకు అన్నదానములు చేయుచు ధన ధాన్య వస్త్ర వాహన కనక కన్యాదానము లనేకములు చేయుచు నుండిరి.

సముద్రపుఁ జెలియలికట్ట, వినాయకులు, గౌరులు మొదలగు నోములు నోచినారు. ప్రతియాకు పత్రిగాను, ప్రతి రాయియు దేవుఁడుగాను బూజించుచున్నారు. శకునములు చూపించుకున్నారు. ఉపవాసవ్రతధర్మము లాచరించినారు. దైవముల సన్నిధి ప్రాణాచారములు పడి మ్రొక్కుచున్నారు. మునులను సేవించి వారి దీవెనలుకొఱకు నిరీక్షించుచున్నారు. ఎన్నియో రీతుల చేత సంతానముకొఱకుఁ బడరానిపాట్లు పడినారు. అట్లుండఁగా ధర్మదేవతలు వీరి పుణ్యకార్యములకు సంతోషించినారు. ఒక సమయమందుఁ గపిదంపతులగు కేసరియందును అంజనాదేవి యందును దయకలదై సంతానవిషయమును దెలియఁజేయ వలెనను కోరికతో—

సీ॥ చందమామకు సంతసము గూర్చ మోముపై పొంకమౌ కుంకుమ బొట్టుపెట్టి
సింగమ్మునకు మేలు చేయఁగా నడుముపై మినసెడి యొడ్డాణమును ధరించి
తామరపువులను దర్కించి కాళ్లపై బంగరందెల నమరంగఁజేసి
తుమ్మెదలకుఁ గాంతి తోడరింపఁ గొప్పుపై విరజాజిపూవుల సరములుంచి

గీ॥ పండి యెండిన సొరకాయ బుఱ్ఱ పట్టి, చేతివే్రళ్లతో ప్రతితీవ చిలుకరించి,
ధర్మదేవాధిదేవత తగినయట్టి చక్కదనమూని యొఱుకలసాని యగుచు
ఓయమ్మ! సోదడుగరో! సోదె, బంగారుసోదె, రతనాలసోదె,
ముత్తేలసోదె, పొంగైనసోదె, పొత్తైనసోదె, సోదమ్మసోదె,
ఉన్నదున్నట్టు, లేనిదిలేనట్టు తెల్సికొన్నట్టు, చెప్తానమ్మ
చెప్తా నిజమ్చెప్తా, మాయమ్మ సోదమ్మ సోదె;

క॥ అను వీధులందుఁ గేకలు
వినిపించిన నంజనాంబ వేవేగ మె దా
సినిఁ జూచి సోదెయమ్మిని
మునుకొని తీసికొని రావె ముం దనిపలుకన్

క॥ ఓసోదమ్మా! సోద
మ్మా! సోదడుగుదుము రమ్మి యమ్మా! యనఁగా
నే, సోదమ్మియు వెనుకొని
వేసారుచు వచ్చె నచ్చువెట్టుచు మచ్చుల్

క॥ పిలచే దెవ రోయమ్మా!
మొలచే మొలకల్ వరాల మొగ్గల్ చెప్తా
నిలుచోవమ్మా నడలే
నిలు నిలుమమ్మా కుతంత నీవేమమ్మా!

వ॥ అంత

క॥ అంజన సోదమ్మను గని
యంజన కూర్చుండఁ బెట్టి యాసనమందున్
ప్రాంజిపురాకుల కేటుల
యంజలులన్ ముత్తైములను నమరించి తగన్

క॥ కులదేవతలను దలచుచుఁ
దలఁచిన దంతయును జెపుము తగిన ట్లమ్మా
కలదంత కల్లొ నిజమో?
వెలపోసెద ముత్తెములను వేగమె యనినన్

క॥ ఏమమ్మా ! యెందతికో
నీముందటఁ జెప్పినానె నిజమే తల్లీ !
సామీ ! దేవీ ! గురుఁడా !
నా మాటెల్లను నిజమ్మె నమ్మవె నన్నున్

క॥ అని చేతనుండు బెత్తము
కొను మమ్మా ! యనుచు నిచ్చి కోరిక లెల్లన్
మనమున నిడుకొనుమమ్మా
యని యెదురుగ నుండి యిట్లు ధ్యానించె నొగిన్

తా॥ ధర్మదేవత మోమున గుండ్రని కుంకుమబొట్టు పెట్టుకొని, నడుమున నొడ్డాణముంచుకొని, కాళ్లకందెలు తొడుగుకొని, కొప్పున దండలు చుట్టుకొని, సొరకాయబుర్ర పుచ్చుకొని, వేళ్లతో శ్రుతి మేళవించుచుఁ గేకలు వేయుచు నెఱుకలసాని యయి తిరుగుచు వచ్చె. అది విని యంజనాదేవి దాసీని పంపించి సోదమ్మాయని జూచి నాకు నిజముగా నున్నది యున్నట్లు సోదె చెప్పుము. ఈ ముత్తెములు నీకిత్తు ననిచెప్పి దోసిలినిండ ముత్తెములు పోసికొని కూర్చుండె. ఎఱుకలసానిబెత్తముచేతికిచ్చి యెదుఱుగాఁ దానును గూర్చుండి నేను చాలామందికి సోదె చెప్పినాను. నమ్మకముగాఁ జెప్పుదునని తన గురుదేవతలను ధ్యానించు చుండెను.

ఓ, యిగినేశుఁడా! ఓయి, గనేశుండా! ఓయీరబొద్దుఁడా ఓ తిరుపతి యేంకటేశుఁడా! ఓ కాశీయిశ్వేశుండా! నీకు సరణ శరణు.

ఓయమ్మ! శారదాంబా! ఓసమ్మ కనకదుర్గాంబా! ఓకంచి కామాచ్చీ! ఓ కాశీవిశాలాచ్చీ! ఓకొల్లాపురమ్మా! ఓ బీబీ నాంచారమ్మా! ఓయలివేలుమంగమ్మా! నీకు శరణు సరణు.

క॥ అమ్మరో! రావే! బంగరు
కొప్పెమ్మలుగాలు ముత్తియములు కొనితేవే! నీ
నెమ్మదికోరికఁ దెల్పెద
నమ్మితిఁ గొలాపురమ్మ! నమ్మా! వినవే!

ఓ సామీ! యేకాంబరేశయ్యా! శ్రీరంగనాయకులూ! చెలియనాంచారమ్మా! ఓ యరదరాజులూ! ఓ యేకుకళ్ళతల్లీ! ఓనూకాలమ్మా! ఓసామీ! మీపాదసాచ్చి. చల్లంగసెప్పండి బాబూ!

ఓ యమ్మా! తలచుకోమాయమ్మా! చక్కంగసెపుతా! అనుచున్న సోదమ్మతో అంజన యిట్లు చెప్పుచున్నది.

జంపె — ఖండగతి

ఓరామ! నీపేరు -నూరుపేరును మగని
పేరు నీసవతులకుఁ - బేరేమిచెప్పవే? ॥ఓ॥
ఇందుముఖి! నీసవతు - లెందరే? నీబిడ్డ
లెందరే? తలిదండ్రుఁ - లెచట నున్నారే?॥ఓ॥
ఆడుబిడ్డలునెంద? - రత్తయేమాత్రమే?
తోడికోడండ్రతోఁ - గూడియున్నావా? ॥ఓ॥

వ॥ అని యడిగిన యంజనకు సోదమ్మ చెప్పుచున్నది,

మేలుచెప్పెదఁగాని - యేల తక్కినజోలి?
చాలుచక్కఁగవిను - మోలమ్మ! నాపలుకు॥మే॥
నూటిగాగడ్డంబు - నూపితేమగవాఁడు
బోటిపేరేకొమ్మ - బుజముపైతోడౌను ॥మే॥
సంతానమే పొట్ట - సాయఁజూపిన నమ్మ
పంతమున నొసలైతే - బాసికముల్ వేర ॥మే॥

పట్టిబొట్టును జూప – పతి యేంకటేశుండు
చిట్టిబొట్టును జూప – శ్రీ. యయ్యవారౌను॥ మే॥
పడతి! నీకడుపున – బుడుతఁడౌ శంకరుఁడు
తోడగి రక్కసిమూక – మడిచుంపఁగలఁడమ్మ! ॥మే॥
రామకార్యము తీర్చి – ప్రబలకీర్తిని జెందు
నేమమున భక్తుఁ – డై చెలఁగువాఁ డోకొమ్మ! ॥మే॥

క॥ అవ్వా! నీపతి యనుమతి
నివ్వటిలన్ దపముసేయు నీవెతలెల్లన్
దవ్వగునని యివ్విధమున
న వ్వనజాస్యయు నదృశ్యయై యుండుటయున్

తా॥ ఓవిఘ్నేశ్వరుఁడా! ఓగణేశుఁడా! ఓవీరభద్రుండా! ఓ వేంకటేశుండా! ఓకాశీవిశ్వేశుఁడా! ఓశారదాంబా! ఓకనక దుర్గాంబా! ఓకంచికామాక్షీ! ఓకాశీవిశాలాక్షీ! నీకుశరణు, అని యెఱుకలసానియై ధర్మదేవత ఇంకను ధ్యానించు చుండె. ఓస్వామీ! ఏకామ్రేశ్వరా! ఓవరదరాజులూ! ఓ వేయికన్నుల తల్లీ! అని ప్రార్థించి అమ్మా! తల్లీ! చక్కఁగా నీదేవుళ్లను తలచుకో తల్లీ! అనిన సోదమ్మను చూచి నీపుట్టువు నీసంతానము చెప్పుమనెను. అంతట సోదమ్మ అంజనను చూచి నా సంగతి నీకెందుకు? నీకడుపున శివుండు కొడుకై పుట్టును. రాక్షసులను జంపును. రాముకు భక్తుండౌను. నీవు నీపెనిమిటి యిష్టప్రకారము తపము చేయుము నీబాధలన్నియుఁ బోవును. నీకు మేలు గలుగు ననిచెప్పి సోదమ్మ (ధర్మదేవత) అదృశ్యయై వెడలిపోయెను.

సీ॥ అంజనాదేవి యీయఖిలంబు పతికిఁ గేసరికిఁ దెల్ప నతండు సతికిఁ బల్కె-
మును శంబసాధనుఁ దునిమితిఁ దత్కుమారుఁడు శంఖశబలుండు
గోపమూని
యేను నై తపమును నేను బ్రభాస తీర్థమునఁ జేయుచు నుండఁ దాకె
నన్ను
వానిఁ జంపితి భరద్వాజుండు మెచ్చి కేసరియను పేర్పెట్టి "వరసుతుండు

గీ॥ బల పరాక్రమవంతుఁడు భాసితుండు రామభక్తుండు కల్గును" నేమమునను
బెండ్లి యగు మనిచెప్పె వివేకమునను వాని మాట తప్పదు జేనికైనఁగాని.

క॥ నీకొక వాక్యము చెప్పెద
లోకములకుఁ బ్రాణమైన లోకేశ్వరుఁ డా
లోకింప వాయుదేవుఁడె
గాక తదన్యుండులేఁ డొకఁడు సేవింపన్

క॥ విశ్వవ్యాపకుఁ డగుటను
శాశ్వత బలుఁడౌట నఖిల జంతుక్రీడా
ధీశ్వరుఁ డగుటను నీకిఁక
విశ్వాసము పవనునందె వెలయింపదగున్

చ॥ తరుణిరో! యీసదాగతి సదా గతిగా మదినుంచి ధ్యానత
త్పరత భజింపఁ దత్కరుణ ధర్మదయాబల సత్యకీర్తి స
త్వరమతి దాంతి శాంతి గుణధైర్య పరాక్రమ వేద శాస్త్ర వి
స్ఫుర దణిమాది వైభవ విభుత్వ హితుండు సుతుండు కల్గెడున్

సీ॥ జలజాస్య వేలాగు సైరించెదో కదే! బలు వాన కాలంబు బట్టబయట
లతకూన వేరీతి వెతఁ దోర్చెదో కదే! మండు వేసవి నగ్నిమధ్యమమున
లోలాక్షి వెటుల నాలోకించెదో కదే! యుదయాస్తమములఁ దాఁగ నుగ్రకరుని
ప్రమద వేగతిభక్తి ప్రకటించెదో కదే! ఫలదాతయగు వేల్పు పాదయుగళి

తే॥ అబల వేతీరు నిర్భీతి నధివసింపఁ గలవో కదె! గండభేరుండ ఖడ్గ గండ
క ప్రకాండ ప్రచండ మహా కానలోన వెలది! దైవాజ్ఞయెట్టిదో?
తెలియరాదు.

చ॥ చెలి! విను పుంజకస్థల మశేష తపఃఫలదాయి. యచ్చటన్
నెలకొని గంధవాహు నతినిష్ఠ భజింపుము నేను నీకుఁగా
వలసిన కృత్యముల్ నెఱపువాఁడ మదాజ్ఞ సమీరదైవమున్
గొలిచిన నీగుణమ్మునకు గొప్ప యటంచును భర్త తెల్పినన్

తా॥ అంజనాదేవి సోదివృత్తాంతము కేసరితోఁ జెప్పెను. కేసరి "మున్ను తాను శంబసాధనుని జంపితిననియును అతని పుత్త్రుఁడు శంబ శబళుండు నన్ను ద్వేషించి ప్రభాస తీరమున నేను తపము చేయుచుండఁగా నయ్యెడ హింసచేయుచుండఁగా వానిని నేను జంపినాను. భరద్వాజుండు మెచ్చి నన్నుఁ జూచి కేసరి యను పేరుపెట్టి నీకు లోకోపకారుండును మహాబలుండును నగుకొమరుండు కలుగుననియుఁ జెప్పెను. వాని మాట సత్యము కావున నీవు లోకములకుఁ బ్రాణముతో సమానుఁడును బ్రాణస్వరూపుడగు వాయుదేవునిఁగూర్చి తపము చేయుచుండుము.

నీవు తపముచేయుట మిక్కిలి కష్టము. వానకాలము బయటనుండియును, వేసవికాలమునందు నగ్నిమంటల మధ్యయందును నుండి తపము చేయుట మిపులకష్టము. అడవులలో భయంకర మృగములు చాలాగలవు. నీవు ఎట్లు తపముచేయఁ గలవో కదా! అయినను దేవుని యాజ్ఞ దాటలేము కదా! నీకు మంచిప్రదేశమును జెప్పెదను వినుము. పుంజకస్థలము అను పుణ్యభూమి కలదు. అందు నీవు పవనుని గుఱించి తపమును జేయుచుండుము.

క॥ అంజన యంతనె భర్తకు
నంజలి యిడి పుంజకస్థలాంతరమున హ్యా

ద్రింజకునిఁ బవను నెద జన
రంజకునిఁ గ నిలిపి తపము ప్రాజ్ఞతఁ జేసెన్.

క॥ ప్రతిరోజును బవనుని కృప
హిత ఫల మొకటొకటి చెంత నెసగుటచే స
మ్మతి దానిఁ దినుచుఁ దపమును
మితిమించిన రీతిఁ జేయ మేల్మి నతండున్

ఉ॥ ఇందుకళాధరుండు ధరియింపఁగ మున్నిడినట్టి తేజము
య్యిందునిభాస్య కోర్కి ఫలియింప ఫలాకృతిఁ జెంతనుంచి పా
వం దరుణీలలామ ప్రతివాసర లబ్ధఫలంబె యంచు స్వా
త్మం దలపోసి లోఁగొనినఁ దచ్ఛివతేజ మమోఘమౌటచేన్

క॥ సారమగు గర్భం బొదవిన
నారీతిలకంబు గని మనంబున నిదియే
కారణముననో ? యని నియ
మారంభము మానె విస్మయాన్వితమతియై

తా॥ అంతనే యంజనాదేవి భర్తను సమస్కరించి పుంజకస్థలంబును జేరి యందుఁ దపము జేయుచుండెను. ప్రతి రోజును వాయుదేవుని కృపారసముచే నొక్కొక్క పండు సమీపమునకు వచ్చుచుండెను. ఆపండు తిని తరువాత నియమమును బూని జపించుచుండెను. ఇట్లుండ నంత వాయుదేవుండు శంకరుని వీర్యము తాను ధరించుచున్నవాఁడు గావునఁ దద్వీర్యమును నొకపండువలె నొనరించి యంజనచెంత నుంచి చనెను. మామూలుపండు అనుకొని యంజన తినినది. వెంటనే గర్భవతియైనది. అంజన నియమమును మాని యాశ్చర్యము నందుచుండెను.

ఉ॥ ఎమ్మెయి జవ్వనంబు గల యింతి పతిన్ బెడఁబాసి యొంటిగాఁ
ద్రిమ్మరుచోట గర్భము ధరించిన దన్నను గన్న విన్న వా
రెమ్మెయిఁ గల్ల లేమి గణియింతురొ ? యెంతురొ ? బంధుకోటిలో
నమ్మక చెల్ల ! నా నియమ మల్లరిపాలయె నంచుఁ జింతిలన్

క॥ సారపుఁ బలుకులు నవ క
ర్పూరపుఁబలుకుల తలంపు పుట్టఁగఁ జేయన్
సారెకు నంజనకు గగన
భారతి సంప్రీతితోడఁ బలికెను నిట్లుల్.

సీ॥ ఓబాల! నీవేల? యూరక చింతిల్ల మున్ను వానరరూపమున శివుండు
తనయట్లు మెనయు గౌరినిగూడి నిజతేజ మామెకు మోయశక్యంబుగామి
నుర్విపై నగ్నిపై నుంచి మోయఁగలేమి గాలిపై నిడె బహుకాలమూని
యనిలుండు నీహృదయాబ్జ సంగతుఁడౌటఁ బ్రతిదినంబు నొసంగు ఫలము లీల

గీ॥ ముందరను వైవ లోఁగొంటి వందువలన నమ్మ! నీగర్భగుక్తిఁ బ్రత్యక్ష శివుఁడు
పెరుగుచున్నాఁడు గాడుప గర్భీకరించెఁ గానఁ బవనజుఁడను పేరు గాంచు నితఁడు

ఉ॥ ఈ వరగర్భశుక్తి జనియించు కుమారక రత్న మార్యసం
భావిత దివ్యకీర్తి సురపాలక జాల కిరీటకాంతి శో
భావహ మూర్తి సర్వజగదంచిత భవ్యగుణానువర్తి నా
నావిధ రామకార్య ఘటనాహృత నమ్రజనార్తి యౌ ననన్

ఉ॥ అంతట గాలిదేవుఁడు నిజాకృతిఁ జూపి నభ స్సరస్వతీ
కాంత నిజంబె పల్కెఁ గలకన్ బడనేటికి? బోటి! యీవిధం
బంతయుఁ దెల్పు నీవిభున కంచితఁడేగిన నయ్యుదంత మా
ద్యంతము కాంతుచెంతఁ దెలియన్ వినిపించి సుఖించుచున్నెడన్

తా॥ పడుచుదనములోనున్న యీడుది పెనిమిటి లేని యప్పుడు గర్భ మెట్లుధరించె? నని జనులు నిందింతురు. నా తపము నిందపాలయ్యెను గదా! యని యంజన విచారించుచుండ నాకాశవాణి యిట్లు పలికెను. ఓయంజనా! నీవు విచారింప కుము. శివుండు మున్ను వానరరూపుఁడై వానరరూపముతో

నున్న గౌరితోఁ గలిసియున్నయప్పు డావీర్యమును గౌరి భరించలేకుండెను. శంకరుం డా వీర్యము భూమిపై నిడెను. పుడమియును మోయలేక పోవుటచే అగ్నిదేవునిపై నుంచెను. అగ్నియును భరించలేకున్నఁగని పవనునియం దునిచెను. నీవు మనస్సునందు వాయుదేవుని గూర్చి యే జపించుచున్నదానవు గాన, ఆవాయువు మామూలు పండు రీతిగా శివవీర్యము ఫలరూపమున నీకిడెను. నీవు భక్షించితివి. గర్భవతివైనావు. నీకు మంచిపుత్రుండు కలుగును. వాయువు సంపర్కమున్నందున వాయుజుం డందురు.

ఇతఁడు లోకములకు మిక్కిలి మేలొనరించు వాఁడగును. శ్రీరామచంద్రునందు అపరిమితమగు భక్తి కలవాఁడగును. అని పలుకుచుండఁగా వాయుదేవుండు ప్రత్యక్షమై ఇదియంతయును యథార్థము. నీవు భయంపడకుము. ఈసంగతి నీభర్తకును దెలియఁజేయుము. అని పలికెను. అంత నంజనాదేవి యింటికి వెళ్ళి యీసంగతి తనపతికిం దెలిపెను. కేసరియును మిక్కిలి సంతసించెను. ఇట్లు దంపతులు సుఖముగా నివసించుచుండిరి.

## శ్రీ హ ను మ జ్జ న న ము

శ్లో॥ వైశాఖే మాసి కృష్ణాయాం దశమీ మందసంయుతా
పూర్వ ప్రోష్ఠపదా యుక్తా తథా వైధృతిసంహితా

శ్లో॥ తస్యామ్ మధ్యాహ్న వేళాయా మంజనా జనరంజనా
వాయుభక్తిరతా సాధ్వీ జనయామాస వై సుతమ్

శ్లో॥ మహాబలం మహాసత్త్వం విష్ణుభక్తిపరాయణమ్
సర్వదేవమయం వీరం బ్రహ్మవిష్ణుశివాత్మకమ్

శ్లో॥ వేదవేదాంగతత్త్వజ్ఞం సర్వవిద్యావిశారదమ్
సర్వబ్రహ్మవిదాం శ్రేష్ఠం సర్వదర్శన సమ్మతమ్

శ్లో॥ మాణిక్యకుండలధరం దివ్యపట్టాంబరావృతమ్
కనకాచలసంకాశం పింగాక్షం హేమమాలినమ్

శ్లో॥ స్వర్ణ యజ్ఞోపవీతం చ మణినూపురశోభితమ్
ధ్వజవజ్రాంకుశచ్ఛత్త్ర పద్మరేఖాంఘ్రిసంయుతమ్

శ్లో॥ దీర్ఘలాంగూలసహితం దీర్ఘకాయం మహాహనుమ్
సర్వలక్షణసంపన్నం కిరీటకనకాంగదమ్

శ్లో॥ ప్రభ యాఽమితయా విష్ణో రవతార మివాపరమ్
పపాత పుష్పవృష్టిశ్చ నేదు ర్దుందుభయో దివి

శ్లో॥ ననృతు ర్దేవగంధర్వా స్తుష్టువు స్సిద్ధచారణాః
వవౌ వాయు స్సుఖస్పర్శ స్సరితో నిర్మలోదకాః

శ్లో॥ యదంజనా కేసరి ధర్మపత్నీ
హ్యసూత బాలం కపిసార్వభౌమమ్
ప్రదక్షిణాకార శిఖం మునీనామ్
తత్రైవ వహ్నిత్రితయం విరేజే.

శ్లో॥ పతంతి రత్నాని సురేతరాణామ్
కిరీటకోటిగ్రథితా న్యకాండే
తదంగనా మానసగహ్వరేషు
సగర్భకంపం భయ మావివేశ.

తా॥ వైశాఖమాసమునందు బహుళపక్షమునందు దశమీతిథియందు శనివారమునందు పూర్వాభాద్రనక్షత్రమునందు వైధృతి యోగమునందు మధ్యాహ్న సమయములో జనులకు మిక్కిలి సంతోషమును కలిగించునట్టియును, వాయుదేవుని యందు భక్తి కలిగియున్నట్టియును, పతివ్రతయైనట్టియును అంజనాదేవి; మహాబలవంతుడైనటువంటియును, మహాసత్త్వము కలిగి

నటువంటియును, విష్ణుమూర్తియందు మంచిభక్తికలిగియుండి
నట్టియును, సర్వదేవతలయొక్క శక్తికలిగినట్టియును, వీరుడైనట్టి
యును, బ్రహ్మవిష్ణుమహేశ్వరులయొక్క స్వరూపుడైనట్టియును,
వేదములయొక్కయు వేదాంగములయొక్కయు యథార్థతత్త్వము
నెఱింగియున్నట్టియును, అన్నివిద్యలయందును సమర్థుడైనటు
వంటియును, అందఱు బ్రహ్మవేత్తలలో ముఖ్యుడైనటువంటి
యును, అన్నిదర్శనములకు ముఖ్యుడైనటువంటియును, మణి
కుండలములు ధరించినట్టియును, దివ్యపట్టములు వస్త్రములు కలిగి
యుండినట్టియును, బంగారుకొండయగు మేరుపర్వతముతో
సమానమగు ప్రతిభకలిగినట్టియును, పచ్చనినైన కన్నులుకలిగినట్టి
యును, బంగారుదండలు ధరించినట్టియును, బంగరు జందెమును
ధరించినట్టియును; మణులతోఁ దనరారగు అందెలుకలిగినట్టియును,
ధ్వజము, వజ్రము, అంకుశము, ఛత్త్రము, పద్మము మొదలగు
మంచి రేఖలు కలిగియుండినట్టియును, మిక్కిలి పొడవగు తోక
కలిగియుండినట్టియును, ఎక్కువ పొడవగు శరీరము కలిగినట్టి
యును, మిక్కిలి గొప్ప చెక్కిలి గలిగియున్నట్టియును, అన్ని
మంచిలక్షణములతోఁ గూడికొని యున్నట్టియును, బంగారు
కిరీటము భుజకీర్తులు కలిగినట్టియును, అమితమగు కాంతి
కలిగియుండుటచేత విష్ణువేయవతరించినట్లుండినట్టియును సుపుత్త్రుని
గనెను.

ఆ సమయమునందుఁ పుష్పలవానలు కురిసినవి. దేవ
దుందుభులు మ్రోగినవి. దేవతలును గంధర్వులును సిద్ధులును
చారణులును సంతోషించినారు. వాయువులు అనుకూలముగా
చినవి. నదులు నిర్మలోదకములు కలవై ప్రవహించినవి.

శ్రీకేసరికి భార్యయగు అంజనాదేవి కపిసార్వభౌముఁ డగు హనుమంతునిఁ గనినయప్పుడు మునివరులు చేయు నగ్ని హోత్రములు మూఁడును ప్రదక్షిణముచేసినరీతిని మంచిజ్వాలలు కలవై విరాజిల్లినవి.

దేవతలకంటె నితరులగు దానవులు దైత్యులు మొదలగు రాక్షసులయొక్క కిరీటములయొక్క పైభాగముల యందు అమర్పఁబడిన రత్నములును మణులును కారణములేకయే జల జలరాలి క్రిందఁబడిపోవుచున్నవి. ఆ రాక్షసులు మొదలగువారి యొక్క స్త్రీలయొక్క మనస్సీమలలో బ్రహ్మాండమును గంపింపఁ జేయునట్టి గర్భములు భేదిల్లునట్టి మిక్కిలి వణకును బుట్టించు నట్టి మహాభయము కలిగినది. సత్పురుషులు మిక్కిలి సంతో షించుచుండిరి. దేవతలు మునులు మొదలగు వారు మహానంద మును అమితసుఖమును అనుభవించుచుండిరి. పతివ్రతలు పొంగు చుండిరి. వృక్షములు పుష్పించినవి. ఫలించినవి. జంతువు లమం దానందమునంది యోలలాడినవి. ఱాళ్లు కరగినవి. ఆహా! మహా మహుని జన్మం బేమని కొనియాడ వచ్చు?

ఉ॥ కేసరి పొంగిపోయెడె గజకేసరి; యంజన యుబ్బిపొంగె; వి
ద్యాసముపాధిరంజన; మహామునిగౌతముఁ డేమియయ్యెనో?
యాసతి శైలమేమయెనొ? యంతయుఁ జెప్పఁగనేల? సంతతా
భ్యాసము సంతసంబునకు నంతమె కానఁగరా దొకింతయేఁ.

తా. గజాసురుని సంహరించిన సింహమువంటి కేసరి మిక్కిలి పొంగిపోయినాఁడు. మహావిద్యను సముపాసనము చేయు వారలయొక్క మనమ్మున కానందమును కలిగించునట్టివంటి యంజనాదేవి యుబ్బిపోయినది. గౌతమముని యెంత సంతసిం

చెనో చెప్పలేము. శిలయై పడియుండిన యహల్యకుఁ గలిగిన యానందమునకు మితియున్నదా? లేదు. మెత్తపడినది. కరిగి పోయినది. సంతతము శాశ్వతానందమునం దలవాటుగలవారు కూడ ననుభవించిన సంతోషమునకుఁ బరిమితియే కానరాదు.

క॥ అంజన పుత్త్రునిఁ గనుఁగొని
రంజనమును జేయుచుండె రాత్రియుఁ బవలున్
సంజలనున్ బోషించుచుఁ
గ్రొంజిలుకలఁ జూచిపొంగెఁ గ్రొమ్మనమారా !

తా॥ అంజనాదేవి పుత్త్రునకు రాత్రింబవళ్లు మేలులు పొనఁగూర్చుచును, సంధ్యలయందుఁ బోషణకృత్యము లొనఁ గూర్చుచును క్రొత్తచిలుకను క్రొత్తమనముతోవలెఁ జూచుచు మురియుచున్నది. ఆనందము సచ్చిదానందము కదా !

## జోలపాట

ఆనందభైరవిరాగము—రూపకతాళము.

జో! దీనమందార ! – జో! శుభాకారా !
జో! వానరకులేంద్ర ! – జో! రాజచంద్రా ! ॥జో॥
నిదురింపుమోచిట్టి! – నిద్రపోవయ్యా !
సదమలగుణసాంద్ర ! – శౌర్యసింహేంద్రా ! ॥జో॥
జగములనురక్షింపఁ – జనవలయుఁగాన
నిగమవందిత ! వేగ – నిదిరింపుమోయి! ॥జో॥
ఖలులు భూదేవినిన్ – గలచుచున్నారు
చలమునన్ దున్మవలెఁ – బాలనిద్రపొమ్ము ॥జో॥

ఆలము హెచ్చాచమె - నిలను నల్లెడల
ంకులు కూర్పవలె - వలనిద్రపోరా! ॥జో॥
రామనామమే - సిద్ధమంత్రంబు
రామరక్షయా - నోరి!పండుమురా! ॥జో॥
కంబుఁ బ్రోవఁగా - నీకుముఖ్యమురా !
ంబు మానుమురా! - సుఖనిద్రపోరా ! ॥జో॥

# 9 భాతమహాలాలనము

శ్రీరాగము—ఆదితాళము

సుకుమారా! హరి! - లేరా! లోకములఁ బ్రోవఁ
లిడ నీవేరా! - కోరి కోరుచుండిరారా! ॥ఓరీ॥
ందఱు నీయందే - భక్తిని గమికొన్నవారు
ండవై నీవుందువు - హర్షము చేయుదువుగాని ॥ఓరీ॥
హరి! కలిజనముల - తాపములను బాపుమురా!
నుహృదయంబుల - నోపికధ్యానించుచుంద్రు॥ఓరీ॥
పము నీనామము - నీరమ్యగుణంబులునుఁ
ంత్రములు నోరా! - సంశయమ్ము లేదోరా! ॥ఓరీ॥
లు పత్రిలు తెచ్చిరి - పూజింతురు సమ్మతిమై
బడి కొనుమయ్యా! - పవనాత్మజ! వేగమ్మె ॥ఓరీ॥

# మ ధ్యా హ్న మ హా భో గ ము

కాంభోజరాగము—ఆదితాళము

పాహి మాం శ్రీయాంజనేయా! - పాహిసద్భక్త!
సాహాయ్యంబు కోరియెల్ల - జనులువచ్చి యున్నవారు
శ్రీహనూమన్! శ్రీహనూమన్! -
శ్రీహనూమన్! పాహి దేవ ! ॥పాహి॥
శ్రీహర్షంబు కూర్పుమయ్యా! - ప్రేమించిమాకు
కోహారనుచు హస్తములను - జోడించి యిందున్నవారు
ఆహారమ్ము లిచ్చువారు-శ్రీహారమ్ములిత్తురయ్యా! ॥పాహి॥
బహువిధములు భోజ్యములున్ -
భక్ష్యంబులు చోష్యములున్ ;
బహువిధపానీయంబులు -
బహులేహ్యంబులు తెచ్చిరి ॥పాహి॥
తియ్యనిమామిడిపండులు - తేనె చెఱకు రసములునున్
వేయిరకములు తెచ్చిరి - వేడుకతో సేవించర! ॥పాహి॥
నీరదగంభీరనాద! - నారదకమనీయవేద !
పారదంతవీరమ్మోద! - శూరసంఘవిదితవాద ! ॥పాహి॥

# సా యం కా ల మ హా సే వ

శంకరాభరణరాగము—ఆదితాళము.

శ్రీయాంజనేయా ! నిను - సేవింపంగ వచ్చినారు
న్యాయంబు - కైకొనుమోయీ ! ॥శ్రీ॥

ఓయీ! నీమాటలును - జేయునట్టిపనులు
హాయిఁగూర్చునయ్యా! - యోయయ్యా! చూడు మిటు
లను ॥శ్రీ॥
శంకరుఁడవీవనుచు నెల్లరు - సంతసంబునుగాంచినారలు
ఇంకనీవుత్సాహ మొందుచు - సంకటములను బాపు
మయ్యా! ॥శ్రీ॥
బ్రహ్మవీవే! విష్ణువీవే! - పరమశివుఁడవునీవే! పర
బ్రహ్మవీవే! యనుచునిన్నే - పలుకరింతురు భావములలో
॥శ్రీ॥
పోరులందున ముందునుందువు - శూరుఁడవు ముల్లోక
ములలో।
లేరునీతో సములిఁకెందును - కోరికలు వేగమ్మొ
యిడరా ॥శ్రీ॥
బంగారపుఁబళ్లెరముల - బాలును మీగడఁదెచ్చిరి
సంగీతముపాడుచుండ్రి - సంతోషముతోఁగొనరా! ॥శ్రీ॥

వ॥ అనియి ట్లంజన పాటపాడుచు మహోత్సాహంబునఁ బుత్త్రినిఁ
గాని ముద్దుల్ మురిపెంబులుఁ జెలువుచుఁ గ్రొంగ్రొత్త భావంబులఁ
మనమునం దుత్సాహ మూరుచుండ నెపుడుఁ మవ్వంబునఁ బెంచుచుఁ
దనభాగ్యంబునె యంతరంగమున సంధ్యానించు చున్నంతలోఁ.

లా॥ జోలపాటలు పాడుచుఁ, బ్రభాతలాలింపులును, మాధ్యాహ్న భోగింపులును, సాయంకాల సేవింపులును మహోదమ్ముతోఁ జెలికత్తెలతోఁ గలసిమెలసి చేయుచు, నూతనాభిమములతోఁ బుత్త్రిని ముద్దులు ముచ్చటలు సంతృప్తికరంగా ననుభవించుచుఁ దనకు గలిగి యున్నట్టి యా మహాభాగ్య

ఉ॥ ఈతఁడు సర్వలోకవిభుఁ డీశ్వరవీర్యజుఁడాంజనేయుఁ డ
త్యాతత బాహుశౌర్యనిధియయ్యును గేవల శైశవంబుచే
నీతఁడె నన్నుఁ గన్గొని ఫలేచ్ఛ గ్రసింపఁగ వచ్చె నిందునన్
భీతిలనేల ? యంచు వినిపింపఁగ నజ్జగజెట్టి యట్టిచోన్

క॥ ఇట్టు నటు చూచి ముఖమున
నట్టె యొకటి నుంచి వేడిమైనను వెడలన్
బట్టికొని కేలఁగొట్టియుఁ
దిట్టియు వెసఁబోయి మఱియుఁ దెమలించునెడన్

శా॥ ఆ స్వర్భానుఁడు నాఁడు పర్వదినమా టాభీలనార్భాట దీ
ర్ఘ స్వానోచ్ఛలితాఖి లాంశుఁడయి ఘోరంబానితోరంబుగా
భాస్వంతున్ వివృతాస్యయుక్తిఁ గబళింపన్ బూని దుర్వార గ
ర్వ స్వాతంత్ర్య నిరూఢి మీఱఁ బఱతేఱన్ జూచి సామీరియున్

శా॥ కల్పాంతాగ్రహ సర్గ భర్గ కర జాగ్రద్వ్యగ్ర ఢక్కార్భటీ
కల్పానల్ప భయంకరారవమునన్ గర్జించి ధైర్యచ్యుతిన్
గల్పింపన్ దిగులొంది కుందియొఁటఁ జక్కంజూడ శంకించి సం
కల్ప క్షోభముఁ జెంది రాహువు పఱకన్ గా నేగి స్వర్గంబునన్

ఉ॥ ఈలువు మాలి తెల్పెద సురేశ్వర ! పర్వముగాన నేఁ డుషః
కాలమునన్ రవిన్ బొదువఁగాఁ జన; నంతకు మున్న వచ్చి నా
పాలికి దాయయై రవినిఁ బట్టినవాఁ డొకవింత రాహు వే
నేల ? యిఁకన్ రవీందుల గ్రహింపఁగ వేఱొకరాహు వున్నెడన్

క॥ మిట్టిపడి యింద్రుఁ డదివిని ;
యిట్టితెఱంగెఱుఁగ మెన్న డిపు డొకఁడినునిన్
బట్టెనె నను నెట్టెనె విధి
కట్టడిఁ దప్పింప నెంత కైవస మయ్యెన్

శా॥ ఓహో! యేల? విచార, మీవెఱుఁగవే? యున్మత్త వృత్రాది దై
త్యాహంకృత్యపహ్నుత్యుపగ్రమగు నాహస్త్రాసి రమ్మంచు నా

రాహున్ బిల్చి సితేభమెక్కి యమవజ్రిం బంచ సాధ్యాగ్రణీ
సాహోనాదము మించ వేగము గమించన్ జిష్ణుఁ డేతెంచఁగన్

కం॥ ఈపండు ధవళదీప్తుల
దీపించుట దీనిఁ దినఁగ దీపించు సుధన్
దీపించు నంచు దానిఁ
బ్రాపించి గ్రహించ నెంచి పట్టుచునున్నన్

కం॥ శతకోటి కల్పితాశని
శతకోటి కఠోరధాటి జంభారి మరు
త్సుతు పైవ హనువు నగలిన
నతఁ డుదయాద్రిపయి వివశుఁడైనటు లున్నన్

తా॥ హనుమంతుఁడు తన తండ్రియగు వాయువు చల్లదనం
బుగా వీచుచుఁ దన వెంట వచ్చుచుండఁగా; లక్ష యోజన మార్గం
బుగడచి సూర్యమండలమునఁ బ్రవేశించినంత నందలి ద్వారము
చెంత నుండువారు నన్ను రక్షింపుఁడని వాపోవుచు భయము
చే సవయవములు చలించుచుండఁగా జపముచేయు మాలికలు
విడిచి ప్రళయకాల రుద్రుఁడు వీఁడుగో వచ్చుచున్నాఁడు. నన్ను
దయతోఁ జూడుము. వానికాంతులతో మాకన్నులు గుడ్డివైనవి.
వాని కేకలతో మా చెవులు చిల్లులు పడినవి. చెవుడు వచ్చినది.
మాకింకొక దిక్కు లేదు. శత్రువువల్ల మిక్కిలి భయంపడి
యున్నాము. మాకు మేలుచేయుమని వేఁడుచుండ సూర్యుఁ
చూచి, ఇతఁడు శివవీర్యమువల్లఁ బుట్టినాఁడు. మంచి శౌర్యశౌ
గలవాఁడు. అన్నిలోకములను బరిపాలింపఁ దగినవాఁడు.
తపముచేత నన్నొకపం డనుకొని తినుటకు వచ్చినాఁడు. మీరు
భయపడకుఁడు, అనునంతలో నాహనుమంతుఁడు సూర్యు
మ్రింగుటకుఁ బ్రయత్నము చేయుచుండఁగా ఆరోజు పర్వదిన

మగుటచేత సూర్యగ్రహణమునకై వచ్చి యత్యంతగర్వముతో స్వేచ్ఛగాఁ బై పడఁ జూచుచుండఁగా నాంజనేయుండును ప్రళయకాలమహాకాలుండువలె మిక్కిలి భయంకరమగు కేక వేయఁగా రాహువు మహాభీతిని జెంది చూడలేక అక్కడనుండ లేక స్వర్గమునకు వెళ్లి దేవేంద్రునితో "నేను పర్వదినముగావున సూర్యగ్రహణమునకుఁ బోవఁగా నంతకు ముందుఁగా నింకొక విచిత్రరాహువువచ్చి సూర్యగ్రహణము చేయుచున్నాఁడని చెప్పె నంతనే" మండిపడి యింద్రుండు వృత్రాసురుఁడు మొదలగు దుర్మార్గులను సంహరించిన కత్తియున్నది. భయమేల? రమ్మని రాహువునకుఁ జెప్పి తా నైరావతకరీంద్రము నెక్కి వజ్రాయుధము చేత ధరించి వచ్చినంతనే యాంజనేయుండు చూచి మంచి తెల్లని పండువచ్చినది. ఈపండు రుచిగానుండునని, దీనితో నాకలి తీరునని యనుకొని వెల్లయేనుగును బట్టుకొనుటకుఁ బ్రయత్నము చేయుచున్నంతలో మిక్కిలి పసునుగలిగి యనేకులను హతమొనర్చిన వజ్రాయుధమును చేతఁబుచ్చుకొని దేవేంద్రుఁడు మహాకోపంబుతో మారొక్కని వాయుకుమారుండగు హనుమంతునిమీఁద విసరెను. అంతనే దవడలు చెక్కిళ్లు పగిలినవి. అతఁడు శరీరస్పృహ లేనివాఁడువలె నుదయాద్రిపయిఁ బడి యుండెను.

క॥ అంత సమీరుఁడు చింతా
క్రాంతస్వాంతాబ్జుఁడై జగజ్జనబాహ్యా
భ్యంతర సంచారముతే
కెంతయుఁ జింతించి కినుక నెదను గ్రహించెన్

క॥ అంజన యింటను బాలున
కుం జవికల పండ్లు తెచ్చి కోరిక నీయం
గంజని లేకుండిన లో
నం జింతించెను గరమ్ము నానావిధులన్

క॥ కేసరి యాంజన కిట్లనె
నో సతి! మనవాఁడు సూర్యు నొకపండని చే
రోసఁ దినఁబోవ రాహువు
వాసవునకుఁ జెప్ప నతఁడు వజ్రము వైవన్

క॥ హనుమంతుఁ డుదయగిరిపై
నను బడియుండెను బవనుఁడు నందనునకు మే
లొనఁగూర్ప స్వానుగమనం
బును మానెను వైభవములు పుత్త్రుఁడు పొందున్

క॥ అనినంతనె యాంజనయున్
మునుకొన మనమునను ఖేదమును మోదమునున్
తనయునకును మేలునకై
ఘనముగ ధ్యానమ్ము చేసెఁ గలదైవములన్

శా॥ సర్వప్రాణుల ప్రాణముల్ పవనుఁ డాచ్ఛాదింప నిస్త్రాణులై
గీర్వాణుల్ వెఱసుక్కి బ్రహ్మఁ గని భక్తిన్ మ్రొక్కి బాహ్యాంతర
ఖర్వక్రౌర్యము గాంచెనేమొ తగవింకన్ గాదు నీవింకఁ ద
ద్దుర్వారార్తిహరింపవే యన సురస్తోమంబుతో ధాతయున్

క॥ దేవేంద్రుఁడు తనపట్టిని
జీవమునకు భంగమయిన చేవను గొట్టన్
భావమున దుఃఖమొందుట
నీవిధి సంప్రాప్తమయ్యె నిది వాయువుచేన్

క॥ మన మిపుడు వాయుదేవున
కును సంతసమును బొనర్పఁ గొడుకును మరలన్
మునుకొని బ్రతికించుటయే
యని వారలఁ గొనుచు ధాత యనిలునిఁ జేరెన్

తా॥ అంత సుతునిమూర్ఛను గనుంగొని వాయుదేవుండు బాహ్యాంతర సంచారము మాని చింతించుచుండె, ఇంకనింటిలోఁ గుమారునకై పలురకములు పలురుచులుగల పండ్లు నచ్చినవి యేరికోరి తీసికొనివచ్చి తత్తనయుం డింట లేకుండుటచే నంజన మిక్కిలి చింతించుచుండె. కేసరి తన సతియగు నంజనాదేవిని జూచిమనకుమారుఁడుపండనుకొని సూర్యుని మింగుటకుఁ జూచు చుండగారాహువు పర్వదినము గావు నసూర్యగ్రహణమునకువచ్చి హనుమంతునిఁ జూచి భయంపడి స్వర్గలోకమున కేగి దేవేం ద్రునితో నీ సంగతియంతయును జెప్పె. ఇందు్రిందువచ్చి వజ్రా యుధముతోఁ గొట్టినాఁడు. బాలుఁడు ఇప్పు డుదయాద్రిపైఁ బడియున్నాఁడు. వాయుదేవుండిది చూచి సంచారము మాని వేసినాఁడు. కావున మనపిల్లవానికి మంచిమేలులు కలుగునని చెప్పిన భర్తయొక్క పలుకులు విని చింత యొకవంక సంతోష మింకొకప్రక్క దందడించుచుండఁగాఁ దన మనంబున నుంచి సకల దైవములను ధ్యానించుచుండెను.

అంత నిచ్చట వాయుసంచలనము లేనందున సర్వప్రాణు లును నిరాధారములై బాధనొందుచున్నయవి. దేవతలందఱును గలసిమెలసి యీసంగతి నంతను బ్రహ్మదేవునకుఁ దెలియఁజేసి యీ కార్యము గాలిదేవునివల్లఁ గలిగినది. దీనిని నివారింపఁ జేయుమని ప్రార్థించినారు. పిమ్మట బ్రహ్మదేవుఁడు వారలను గనుంగొని దేవేంద్రుండు వాయుదేవుని కుమారుని నాంజనేయు ఁను గొట్టుటచేత నతఁడు కోపించియున్నాఁడు. కావున నిప్పుడే వాయుదేవుని దగ్గరకు వెళ్లి వానికుమారునకు మేలు చేసిననే

నలకు మేలుకలుగును అని చెప్పి వారలను వెంటఁబెట్టు
నహ్నా, వాయువున్న చోటునకు వెళ్లెను.

వాయువునిఁ గనుంగొని శుభంబగు నీకని యుచ్చరించి నీ
గాయముఁ గోరివచ్చితిమి. చక్కఁగ నీదగు మేలు మేమునుఁ
కోరుగఁదిర్గి మేలు నభివృద్ధికరమ్ముగఁ జేయుచుందు మో
వాయి! ప్రసన్నచిత్తుఁడవు సూక్తినెఱింగినవాఁడ వెంతయుఁ.

॥ సకలజగత్ప్రాణుఁడవై
సకలజగజ్జన విహారసంధాతవునై
సకలాత్మలఁ గలనీకును
సకలాత్మక! యింతకిసుకసను నే? యనినఁ.

పరితాపంబునువీడి వాయువును జంభద్వేషి దంభోళిదు
ర్భరధారాహతి మూర్ఛపాల్పడిన లేఁబట్టిఁ మరల్ పుట్టఁగా
రయుగ్మంబునఁ బట్టి చెచ్చెఱ వచఃకాంతామనఃకాంత శ్రీ
చరణాంభోజయుగంబుపై నిడి నమస్కారంబు గావించినఁ.

స్వస్తియొనర్చి వాయుజుని చక్కఁగ నుంగొని యాతఁ డార్యజన
ప్రశస్తవనీయ శౌర్యుఁడని యాతని మేను సరస్వతీలతాం
స్తనపద్మకోరక మృగీమదపత్త్రవిచిత్రలేఖన
ప్రస్తుతహస్త పద్మమున స్పర్శయొనర్చెను ధాత యంతలోఁ.

॥ పూర్ణిమాచంద్రికర సుధాస్ఫూర్తి "వాడి
పడినసస్యంబు క్రమ్మర నడరుకరణి"
నాంజనేయుండు దేహదాహంబు మాని
చెంతఁజెరలాడఁజూచి రాజీవభవుఁడు.

ఫలకాంక్షాహృతబాలసూర్య! గిరిశుంభద్ధైర్య! రావోయి యం
చెలమిన్ దగ్గఱఁజేరి యెత్తికొని మోమీక్షించి ముద్దాడఁగా.
బలుసంతోషముగాంచి గాడ్పు మరలన్ భాషావధూభర్తయం
ఘ్రిలకున్ మ్రొక్కి తదాజ్ఞ నెప్పటి తెఱంగున్ గాంచె లోకంః

తా॥ ఓ వాయుమూర్తీ! నీసాయమును గోరివచ్చినాము; నీకును దిరిగి మేలు మిక్కిలి మంచిగాఁ జేయుదాము; నీవు అన్ని జీవములకు నాధారమయినవాఁడవు. అన్ని జీవులలో నుండువాఁడవు. అన్ని లోకములలో నుండువారలందరికును మిక్కిలి ముఖ్యప్రాణమయినవాఁడవు. నీకుఁ గోపము తగునా? యనినంతనే. వాయుదేవుండు దుఃఖము మాని దేవేంద్రుని వజ్రముచే మూర్ఛిల్లిన పుత్త్రునిఁ జేకొని బ్రహ్మపాదంబులపైనుంచి నమస్కరించెను. అంత విరించి ఈతనికి శుభంబు కలుగునని తనచేతులతో స్పర్శించినంతనే పూర్ణిమ నాటి చంద్రుని కిరణములచే నాఁటిన పంటచేలు తిరిగి మంచియేపుగా నభివృద్ధినందునట్లు హనుమంతుఁడు దేహము వేడిమిపోయి మంచియుత్సాహముతో గంతులు వేచుచుండెను. బ్రహ్మదేవుండు ఓ యాంజనేయా! నీవుపంటనుకొని సూర్యభగవానుని మ్రింగినవాఁడవోయి! ఇటురమ్మని నాని సమీపంబునకుఁబోయి యెత్తుకొని ముద్దాడి ప్రేమించుచుండఁగాఁ బవనదేవుండు పొంగిపోయి బ్రహ్మదేవుని యనుమతిని బొంది, నమస్కరించి లోకములయందు నెప్పటివలెనే సంచరించుచుండెను. లోకములన్నియును మరల సంతోషమును బొందియున్నయవి. అంతట

శా॥ ఓ దిక్పాలకులార! యీపవనజుం డూహింప లోకత్రయీ
మోదప్రోద్యముఁడౌట నిత్తము వరమ్ముల్ మీ రటంచున్ సౌఖ్య మా
పాదింపన్ గలఁ డాయుష్యలాత్ములను సంభావించినన్ శంభుఁడే
ప్రాదుర్భావము నొందెనన్న విధ గీర్వాణాళి ప్రమోదంబుతోన్

తా॥ ఓదిక్పాలకులారా! ఈ వాయుదేవునికుమారుండగు హనుమంతుఁడు మూఁడులోకములలోని ప్రజలకు సమ్మోద

మును గలిగించుటకు మిక్కిలి ప్రయత్నించుచుండును. కావున వీనికిఁ దగినవరములను మనముఇత్తము రండు. తరువాత నాలోచించినయెడల నితఁడే మనకుఁ బ్రత్యుపకారము చేయఁగలఁడు. శంకరుండే ఇటు జన్మించినాఁడని బ్రహ్మ పలుకఁగా దేవతలందఱును సంతోషించినారు.

సీ॥ తమకంప వేదశాస్త్రములు వచ్చునటంచుఁ
దనతోడి తేజంబు ధరణియిచ్చె
నిజపాశముల చేత నీటు నిర్భయుఁడుగా
వరుణుండు కరుణతో వరము లిచ్చెఁ
గాలదండము మృత్యుగతి రుజల్ సతతంబుఁ
బొరయని వర మర్కపుత్త్రుఁ డిచ్చెఁ
దన చేతఁ దన యాయుధములచే విశ్రాంతి
బూనని మహిమ మీశానుఁ డిచ్చె

గీ॥ నని జయంబిచ్చె తన గదాహతికి వెఱచిఁ
మనికి ధనపతి దయచేసె మును స్వనిర్మి
తంబులౌ శస్త్రముల భీతి దక్కనొసగి
కనక కుండలములు విశ్వకర్మ యిచ్చె.

మ॥ తన దంభోళి హనుస్థలిన్ బెరసియున్ దారింపలే కుండుటన్
హనుమంతుం డను పేర మీరునని జంభారాతి వజ్రాయుధం
బున నిర్భీతుఁడుగా వరంబొసఁగె నంభోజాసనుండున్ జిరం
తన దీర్ఘాయువు మౌనిశాపతరణౌద్ధత్యంబు నిచ్చెన్ దయన్

క. నినుబ్రహ్మాస్త్రంబేమియుఁగన నేరదుగాని, యేడుగడియలు నన్నుఁ గనికట్టువడియుండుము కన నేర్తురె? యొరులునిన్నుఁ గపివర! యనిరి

క. అనలాది నిర్జరేంద్రులు హనుమంతున కిచ్చి రంత నంచిత వరముల్ వనజాసనుండు గ్రమ్మఱసనిలు నిరీక్షించి యప్పు డరుదుగఁ బలికెన్

ఆ॥ అనఘ! నీకుమారుఁ డమలకీర్తి విహారుఁ
డజితుఁ డేకవీరుఁ డద్రిధీరుఁ
డఖిలజగదుదారుఁ డాత్మతత్త్వవిచారు
డాంతరాదిదూరుఁ డనఁగ మీఱు

సీ॥ అణిమాదు లపరిమితహితములై తనుగొల్వ
నొకరి కుత్పాదింప నోపు నితఁడు
కమలజాండము నిరర్గళ మనోవేగంబు
కలిమి నెంచిన మాత్రిఁ గాంచు నితఁడు
సతత వైరాగ్యోప రతుల నిష్కాముఁడై
కామరూపముఁ బూనఁగలుఁగు నితఁడు
అనివార్య శౌర్య ధైర్య దయాది సద్గుణ
స్తోమంబులకు జన్మభూమి యితఁడు

గీ॥ కడు విచిత్రక్రియల్ చేయఁగలఁ డితండు
మహిమ నఘటన ఘటనాసమర్థుఁ డితఁడు
రామకార్యార్థమై పూని రాక్షసాళి
నెల్ల హరియించి పతికి మేలిచ్చు నితఁడు

కం॥ ఎన్నియని సన్నుతించెద
నన్నా! నీచిన్నవాని యద్భుతలీలల్
కన్నులఁ జూచెద నీవే
యన్నియు నని చనియె విధి నిజాలయమునకున్

సీ॥ పరితిలేని తనపరితాపము తెల్పుటకు నింత
పని చేసెఁ గాబోలు ననెడివారు
కాదు లే తనకాంతి గతిఁదోచిన నసూయ
నరుపెంచి కబళించె ననెడివారు

తన త్రిమూర్త్యాత్మకత్వ మహత్వ మతిశయం
బగుట నిక్కముచేసె ననెడివారు
అన్యగోత్రాధిశుఁ డగు టుఱుంగని రీతిఁ
దన మాహాత్మ్యమొనరించె ననెడివారు

తే॥ కాక బాలురకీజోక లోకములను
గలదె? యనువారు నై నిర్జరులు గణించి
కొనుచుఁ దమలోకములకేగఁ గొడుకుఁ గొనుచు
నంజనను జేరఁజనుదెంచె ననిలుఁడప్పుడు

తే॥ వచ్చి యచ్చిన్ని పాపని నిచ్చి నిచ్చ
లిచ్చ మచ్చిక హెచ్చి వియచ్చరేంద్రు
లిచ్చిన వరంబు లెఱిగించి మచ్చెకంటి
నెచ్చరిక చేసి పవమానుఁ డేగుటయును.

తా॥ భూమి వేదశాస్త్రములం దమంతటఁ దాము వచ్చు
నని వరమిచ్చెను. వరుణుండు తనపాశములచే భయము లేకుండు
నని వరమిచ్చెను. యముండు కాలదండముగాని మృత్యువుగాని
రోగముగాని కలుగదని వరమిచ్చెను. ఈశానుండు తనచేత
దన మాయుధములచేతను భయపడదని వరమిచ్చెను. కుబేరు
యుద్ధమునందు జయముకలుగునట్లును గదాభయము లేనట్
కులాసాగా జీవించునట్లును ధనముకలుగునట్లును వరమిచె
విశ్వకర్మ తాను నిర్మించిన శస్త్రములచేతనుగాని యస్త్రముల
నుగాని భయము కలుగకుండునట్లును వరమిచ్చెను. మఱియు
బంగారుచెవులు పోగులిచ్చెను. దేవేంద్రుఁడుతన వజ్రాయుధ
చేతఁబగిలిపోయినపెదవులు దవడలు చెక్కిళ్ళు కలవాఁడ యు
ఒక్కింతయుఁ జలనమును నంద లేకుండుటవల్ల హనుమంతు
పేరుగాంచుననియును తనవజ్రాయుధముచేత నొక్కింతయు

భయపడకుండునట్టి వరమునిచ్చెను. బ్రహ్మదేవుఁడు శాశ్వతమై
నట్టి దీర్ఘాయుష్మంతుఁ డగుననియును, మౌనిసంఘ మొసంగు
శాపములవల్ల నొక్కింతయును భయము లేదనియును బ్రహ్మా
స్త్రముచేత భయములేదనియు నేడుగడియలు మాత్రము
భయపడినట్లు కట్టుబడి యుండుననియును వరమిచ్చెను.
అగ్నిహోత్రుండు మొదలగు వారందఱు విశేష వరము లిచ్చిరి.
బ్రహ్మదేవుండు తిరిగి వాయుదేవున కిట్లుచెప్పెను. ఓమహా
నీయుఁడా! నీకుమారుండు మంచి విమలమైనట్టి కీర్తి కలవాఁడు.
ఇతరులచే జయింపఁబడనివాఁడు. ముఖ్యులలో పెద్దలలో ముం
దుండువాఁడు. పర్వతమునలెఁ జలించని ధైర్యము కలవాఁడు.
అన్నిలోకములను ఉద్ధరించువాఁడు. వేదాంతజ్ఞానము గలవాఁడు.
పరతత్త్వమును దెలిసికొనినవాఁడు. అంతశ్శత్రువులను జయించిన
వాఁడు. మిక్కిలి గొప్పవాఁడని ప్రసిద్ధిపొందును

అణిమాది సిద్ధులకు వశ్యుండు కాక ఈ సిద్ధులను
దాను వశ్యము చేసికొని యితరులకుఁ గలిగించుచుండును. మన
స్సులోఁ దలంచుకొనినంతమాత్రముచేతనే బ్రహ్మాండమంతయు
సంచరించుటకు మిక్కిలి శక్తికలవాఁడగును ఎల్లప్పుడును వైరా
గ్యము నిష్కామ్యము కలవాఁడై కామరూపములను బొందు
చుండును. అనివార్యములగు శౌర్యము, ధైర్యము, దయ
మొదలగు సద్గుణములకు నివాసస్థానమగును. మిక్కిలి చిత్ర
విచిత్రములగు పనులు చేయుచుండును. తన మహిమముచేత
నెరవేర్చుటకు వశములుకాని పనులను నెరవేర్చుచుండును.
శ్రీరామచంద్రమూర్తికొఱకు రాక్షససంఘములను జయించి
రామునకు సంతోషము మేలు కలిగించుచుండును. ఓయి

ము దేవా! యీ చిన్నవాని చిత్రచరిత్రములు నే నెన్ని
గలను? నీవే కనులతోఁ జూచుచుందువు. ఇట్లు చెప్పి
నివాసంబున కేగెను.

ఇంక నిటఁ బ్రజలు తన ప్రతాపమును లోకమునకుఁ
యఁజేయునిమిత్త మింతపనిచేసె నని కొందఱు చెప్పుచు
ను. కాదు తన కాంతివంటి కాంతి యింకొకని కుండకూడ
సూయచేత వెళ్ళి సూర్యుని మ్రింగినాఁడని కొందఱు
పుచున్నారు. తాను త్రిమూర్తి స్వరూపుఁ డనునది
చేయుట కింతపని చేసె నని కొందఱు పల్కుచున్నారు.
క గోళమునకు అధికారి యనునది తెలియనట్లు తెలివి
వచే నింతచేసె నని కొందఱనుచున్నారు. లేకపోతే
ఇట్టిపనులు చేయజాలరని కొందఱు నిశ్చయించుచున్నారు.
దేవతలు చేర్కొనుచుఁ దమతమ నివాసములకు సంతోష
వెళ్ళిరి.

పిమ్మట వాయుదేవుఁడు తనభక్తురాలగు శ్రీ యంజనా
దగ్గఱకుఁ దీసికొని వచ్చి యీ హనుమంతుని నామెకు
చి దేవతలు దయచేసిన వరములు తెలిపి ప్రోత్సా
కలిగించి తన పనిని బూనుకో నేగినాఁడు.

క॥ అంతటఁ దల్లియు నంజన
సంతోషించుచును సుతుని జయ్యన నిట్టుల్
చింతలు పోవఁగఁ దలంచుచుఁ
సంతతిభక్తియుతు నిట్లు సన్నుతిఁ జేసెన్

శా॥ నన్నున్ బాసి ఫలాశ డాసి యరుణు న్భక్షింపఁగా నిచ్చఁ జే
కొన్నన్ నిన్ను బలారి వజ్రహతిచేఁ గుందించినన్ వ్రాలి నీ
వన్నా! యేమని నన్ దలంచితివొ? యం చబ్జాక్షి ప్రేమంబునన్
గన్నీటన్ గడిగెన్ ధరాగత పరాగ క్రాంత పుత్రాస్యమున్

ఉ॥ ఎక్కడి కెక్కడయ్య! దివసేంద్ర మయూఖము లాడమండి యీ
దిక్కునఁ బాటినంతటనె దేహము దాహమునొందుచుండఁగా
నుక్కుక చక్కఁగా నెదిరి సూర్యునిఁ జేకొని మ్రింగ నీతఁ డె
మ్మక్క! మహాత్ముఁ డంచుఁ గొనియాడి రతిధ్వనిమై దపోధనుల్.

క॥ మిహిర పరిగ్రహము తమో
గ్రహ ఘోరాగ్రహము దివిజ గణ శేఖర ని
గ్రహము శివాదిసు రాను
గ్రహముఁ దలఁచి కేసరియు సుఖస్థితి నొందెన్

సీ॥ అమితాగమారూఢ నాయీయి శాఖల ననుకూల సంచార మాచరించుఁ
బటుశాస్త్రగరిమ చొప్పడిన ఖరప్రౌఢి నమరకృత్యాచ్ఛాదనము
లడంచు
పవన వర్తన లీల పరిమితి కుశలతా వర్ధనోదార భావము వహించుఁ
గవినయజ్ఞాన సంగతి ధర్మవేదిఁ బా యని నేతి యుక్తి మాయను
హరించు

గీ॥ గానఁబడుఁ గానఁబడ కొక్కకడఁ జరించు
నతుల గతులను గుహలీల లతిశయించు
నిందు నందును నెల్లెడ లందు నుండుఁ
బ్రబలమతి మీఱి వానర బ్రహ్మచారి.

తా॥ అంతఁ దల్లియైన యంజన సంతోషించుచు మిక్కిలి భక్తితో నున్న పుత్త్రునిం గనుంగొని వింతలు తెలిసికొనుటకై యిట్లు పలికెను. ఓయి తండ్రీ! నన్ను విడిచి పళ్లకొఱకు వెళ్లి

ాసూర్యుని గ్రసింపఁ బోయినప్పుడును దేవేంద్రుఁడు నిన్ను వ్రముచేఁ గొట్టినప్పుడును బాధచే నీవు నన్నేమని విలపించి కదా! అని యానందబాష్పంబులచే సుతుని యొడ పై నంటిన పరాగమును బోఁగొట్టెను. సూర్యుని కిరణము క్కడ? అక్కడకు వేడిమికి సహించి వెళ్లుటయెక్కడ? మన లో భయపడక సహించి యెదిరించి సూర్యుని మ్రింగినాఁడు. డు చాల మహాత్ముఁ డనుచు మునులుకొనియాడిరి;

సూర్యుని మ్రింగుటయును రాహువుయొక్క మిక్కిలి పమును దేవేంద్రునియొక్క దెబ్బయును దేవతలయొక్క నుగ్రహము తలఁచికొని కేసరిపొంగుచుండెను; హనుమంతుఁడు ్రశాస్త్రములు దేవప్రతిష్ఠాశాస్త్రములువానిభాగములుమిక్కిలి చ్చికొని వానిభావములు ముచ్చటించుకొనుచుండెను. శాస్త్ర కము ననుసరించి మంచి తెలివితేటలతో దేవతా కార్య తులు తెలసికొనుచుండును. యజ్ఞ యాగములు వానిధర్మ లు మహిమములు తెలిసికొని మంచి జ్ఞానమును సంపాదనము ముచుండును. అజ్ఞానమును నివారించుటకుఁ దగిన సూక్ష్మ లు నేర్చి లేదు లేదను భావముచే నిశ్చయ తత్త్వమును ముచుండును. ఒకప్పుడు కనఁబడుచుండును. ఒకప్పుడు కనఁ క యొకచోట సంచరించుచుండును. అనేకరీతులచేతను కవిలాసములచేతను నభివృద్ధిని గాంచుచుండును. ఇక్కడను డను ఎల్లచోటులయందును ఉండును. వానరబ్రహ్మచారి ు శ్రీహనుమంతుఁడు మిక్కిలి యెక్కువ బుద్ధిసిద్ధులు కల డు. ఎల్లప్పుడును భక్తులకు సకలకామ్యముల నిచ్చుచుండును.

శ్లో॥ శ్రీమ ద్ధనూమ జ్జననం యే శృణ్వంతి పఠంతి యే
అప్రజా స్సప్రజాస్సంతి నష్టప్రజాశ్చ నిర్భయాః
శ్లో॥ సపుత్రాః పౌత్రికాస్సన్తి సర్వే సకల సంపదః.
తేషాం సకల కామ్యాని సిద్ధ్యంతి నాత్ర సంశయః

తా॥ శ్రీహనుమంతుని జననము ఎవ్వరు విందురో ఎవ్వరు చదువుదురో వారికి అన్ని కోరికలును ఫలించును. సంతానము లేనివారికి సంతానముకలుగును. నష్టసంతానము కలవారికి సంతాననష్టము కలుగదు. దీర్ఘాయుష్మంతులగు పుత్త్రపౌత్త్రులు కలుగుదురు. ఇందుకు నెంతమాత్రమును సంశయము లేదు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

